# చతుర ప్రపంచం

## ఆధునిక విషం

సిగరెట్ లోని నికొటిన్, కాఫీలోని కెఫైన్‌లు మైండ్ మీద పని చేసి అలవాటుని చేస్తాయి. వీటికన్నా ఎన్నో వేలరెట్లు అధికంగా మైండుమీద పనిచేస్తుంది కొకైన్ లోని విషపదార్థం. అందుకే కొకైన్‌ని ఒక్కసారి తీసుకుంటే, ఆ అలవాటునించి తప్పించుకోలేనివాళ్లే అధికం.

మెదడులో ఎమోషన్స్, భోజనం, ప్రమాదం నుంచి తప్పించుకోవడం, సెక్స్ లాంటి భావాలని కంట్రోల్ చేసే విభాగం మీద ఈ మందు పనిచేస్తుంది. దాంతో కొకైన్ తీసుకోగానే ఆనంద భావాలు మెదడులో ఉత్పన్న మవడంతో తిరిగి తిరిగి మెదడు ఆ ఆనందాన్నే కోరడంతో డ్రగ్స్‌కి అలవాటు పడ్డవారు ఓ పట్టాన అందులోంచి బయటపడలేరు.

అమెరికాలో ఈ డ్రగ్స్‌ని జంతువులమీద ప్రయోగిస్తే అవి భోజనం, సెక్స్, నిద్రలని కూడా నిర్లక్ష్యం చేసి, వాటి బ్రెయిన్ లోని సర్క్యూట్స్ అన్నీ షార్ట్ అయ్యి చివరికి మరణించడం గమనించారు.

మనిషి బ్రెయిన్‌లో కోట్లకొద్దీ సెల్స్




చతుర... 3

ఉంటాయి. న్యూరాన్స్ అనే ఈ సెల్స్, ఆలోచనలు, భావతరంగాలని ఇంకా పంచేంద్రియాలైన దృష్టి, రుచి, వినికిడి, స్పర్శ, వాసనలని తమ కంట్రోల్‌లో ఉంచుకుని పని చేస్తాయి. కొకైన్, లేదా ఆ రకం ఇతర డ్రగ్స్ డైరెక్ట్‌గా ఈ న్యూరాన్స్‌ని కుదిపి పారేయడం తో ఈ మందు తీసుకున్నవారికి బయటనుంచి చెవిలో వినపడనివి మెదడుకి వినబడతాయి. కనపడనివి కనపడతాయి. అనవసరపు భావాలు, ఆలోచనలు కలుగుతాయి. దాంతో డ్రగ్స్ తీసుకున్నాక వాళ్లు ఆలోచనాశక్తిని కోల్పోతారు. బ్రెయిన్ నించి ఎప్పుడు ఏ సజెషన్ వస్తే, పంచేంద్రియాలు ఆపనిని నిర్వర్తిస్తాయి. ఈ కారణంగానే డ్రగ్స్ తీసుకునేవారు అధికంగా ఉన్న అమెరికాలో నేరాలు చేసే వారి సంఖ్య అధికం. హత్య, హింసాత్మక దోపిడీ, మానభంగం లాంటివి డ్రగ్స్ తీసుకున్నవారి బ్రెయిన్ ప్రేరేపిస్తుంది.

బ్రెయిన్‌లోని న్యూరాన్స్ డ్రగ్స్ వల్ల ఇలా ఏక్టివేట్ అవడంతో, ఏడుపు, నవ్వు, ఉదాసీనత, ద్వేషం లాంటి వివిధ భావాలు కారణంలేకుండా కలుగుతూంటాయి. ఇందువల్లే డ్రగ్స్ తీసుకుంటుంటారు భార్యలు, లేదా భర్తలు.

శారీరకంగా డ్రగ్స్ అనేక పరిణామాలను సృష్టిస్తాయి. రక్తనాళాలని కుంచించుకునేలా చేసే శక్తి వీటికి ఉండడంతో రక్తప్రసరణ ఆరోగ్యవంతంగా సాగదు. ఆకలి, నిద్రలు తెలియవు. శరీరంలోని ఆరోగ్యవంతమైన కణాలు క్రమేపీ నాశనం చేయబడి ఆకస్మికంగా గుండె ఆగడం, లేదా పక్షవాతానికి దారి తీస్తాయి. డ్రగ్స్‌వల్ల చివరికి మరణం తప్పదు.

---

## ఉద్యోగస్థులు కావలెను

**మ**నదేశంలోని ప్రధాన సమస్యల్లో ఒకటి నిరుద్యోగం. జపాన్‌లో కూడా ఇదే సమస్య రివర్స్‌గేర్ లో ఉంది. అక్కడ ఉద్యోగస్థులు దొరకని సమస్య విపరీతంగా ఉంది. చాలా కార్యాలయాల బయట, ఫ్యాక్టరీలు, ఫాస్ట్‌ఫుడ్ ఫ్రాంచైజ్, ఇళ్ల కనస్ట్రక్షన్స్‌ల బయట 'హెల్ప్ వాంటెడ్' (ఉద్యోగస్థులు కావలెను) అన్న బోర్డులు వేళ్లాడుతూ ఉంటాయి. ఏ ఉద్యోగ ప్రకటనకైనా అవసరమైన అప్లికేషన్లలో 46 శాతం వరకే వస్తాయి. వాళ్లల్లో 20 శాతం మందికి ఉద్యోగం లేదా జీతం నచ్చక చేరరు. జపనీస్ చరిత్రలో లేబర్ షార్టేజ్ ఇంతలా ఇంతకుమునుపెన్నడూ లేదు. గత 2 ఏళ్లలో 600 జపనీస్ కంపెనీలు వర్కర్స్ దొరక్క మూసేశారు. జపనీస్ బిజినెస్ జయింట్స్ అయిన మజ్దా, నిస్సాన్, మాట్స్‌షిట్ లాంటి కంపెనీలు హెచ్చు జీతాలిచ్చి ఉద్యోగులను తీసుకుంటున్నారు. యూనివర్శిటీల్లో ఆఖరి సంవత్సరం చదివే విద్యార్థులకి పెద్ద కంపెనీలు ఉద్యోగాలకి ఎర వేస్తున్నాయి. వాళ్ల చదువుకి అప్పులిస్తున్నాయి. ప్రతి యూనివర్శిటీలో ఉద్యోగాలకి సంబంధించిన ఆకర్షణీయమైన సాహిత్యం విద్యార్థులకి పంచుతుంటారు.

1960లో అక్కడి నిరుద్యోగ శాతం 2.2. కానీ 1960 నుంచి జపాన్‌లో జననాల సంఖ్య బాగా తగ్గింది. అంతేకాదు, ముసలివాళ్లయ్యే వారి శాతం కూడా ఇదే పీరియడ్‌లో పెరగడంతో రిటైరయ్యాక కొత్త వాళ్లని తీసుకోవడానికి అభ్యర్థులు దొరకడంలేదు.

దానికి తోడు జపనీస్‌కిష్టమైన హాలీడే రిసార్ట్ అయిన హవాయ్‌లో కూడా నిరుద్యోగ సమస్య ఉండడంతో యువత అక్కడికి వెళ్లి పార్ట్ టైమ్ ఉద్యోగం చేస్తూ ఆ వచ్చేదాంతో అక్కడ హాయిగా కాలం గడ




పడం అలవాటవడంతో కూడా ఉద్యోగస్థుల సంఖ్య జపాన్‌లో పడిపోయింది.

రెండో ప్రపంచ యుద్ధంలో మృతి చెందిన సైనికులు కూడా జనాభా తరుగుదలకి ఓ కారణం. దానికి తోడు పారిశ్రామిక రంగం పురోభివృద్ధి చెందడంతో ఉద్యోగస్థులకి డిమాండ్ కూడా పెరుగుతోంది.

జపాన్‌లో పెళ్లయిన ఆడవాళ్లు బయటకి వెళ్లి ఉద్యోగాలు చెయ్యరు. భర్త సంపాదించేది సరిపోతుంది కాబట్టి ఇంటి పట్టునే ఉండి పిల్లలని చూసుకోవడం కూడా ఈ ఉపద్రవానికి మరో కారణం. అదీకాక జపాన్‌లో సెక్రటరీ, లేదా పి.ఏ ఉద్యోగం అంటే దాదాపు ఉంపుడుగత్తె లాంటిది అనే భావం ఉంది. అందువల్ల ఎంతో అవసరం అయితే తప్ప ఆడవాళ్లు ఉద్యోగాల్లో చేరరు. దాంతో జపాన్‌లో 60 ఏళ్లు పైబడ్డ వాళ్లని కూడా ఉద్యోగాల్లోకి తీసుకుంటున్నారు. వారి శాతం 11.6. చాలా కంపెనీలు రిటైర్‌మెంట్ వయసును 60 నుంచి 65 కి పెంచాయి. తర్వాత వాళ్లు తిరిగి హెచ్చు జీతానికి అదే ఉద్యోగంలో కంటిన్యూ అవుతూ ఉంటారు. ఈ వయసు వాళ్లని ఉద్యోగంలోకి తీసుకుంటే ప్రభుత్వం ఆ కంపెనీలకి సబ్సిడీలు కూడా ఇస్తుంది.

విదేశస్థులు తమ దేశం వచ్చి సెటిల్ అవడం జపనీస్‌కి పెద్దగా ఇష్టం ఉండక పోవడంతో అక్కడ ఉద్యోగుల సమస్య మరింత తీవ్రంగా ఉంది.

✦

నా సొంత కంపెనీ కదా, మెరుపులాంటి అమ్మాయిని సెక్రటరీగా తీసుకుందామనుకున్నాను....కానీ, బాడ్‌లక్! సెలక్షన్లన్నీ మా ఆవిడే చేసేసింది!!

# 'పథకం' పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర' లో ప్రచురితమైన మంజరి నవల 'పథకం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## "ఆసక్తికరం...కానీ"

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

ఫిబ్రవరి చతుర నవల 'పథకం' చదవగానే కలిగే మొట్టమొదటి యింప్రెషన్ చాలా ఇంటరెస్టింగ్ నవల అన్నది. రచయిత్రి కథనంలో కనబరచిన నైపుణ్యాం, పాఠకుడిమీద పట్టు సడలకుండా చదివింపజేసేలా చిన్నచిన్న సంఘటనల్ని సైతం మలచిన తీరు, క్రమం... ఈ నవలకి హైలైట్స్.

అయితే ఇతివృత్తానికొస్తే కొనియాడాల్సి





నంత కొత్తదనం, అభినందించదగ్గ అసాధారణత్వం ఏమీలేదు. కథాస్థలంలో, పాత్రల పేర్లలో ఒరియా వాసన ఎక్కువవడంతో ఇది అనువాదమా అన్న అనుమానం కల్గుతుంది.

ద్వివేది, సూరి, రామ్‌బెహరా, నిష్ఠోని పాత్రల తీరు, స్వభావాలు ఇంతకుముందే వచ్చిన కొన్ని పాపులర్ నవలల్లోంచి లేదా సినిమాల్లోంచి తీసుకున్నట్లనిపిస్తుంది. అడవిలో దాచిన డబ్బు అన్వేషణకోసం సుబ్బారెడ్డి ద్వివేదిని ఎన్నుకోవడం, అతని గతాన్ని సి.ఐ.డి. లా శోధించిన తర్వాత వాళ్ళ బృంద సభ్యుల్ని చంపడానికి రామ్‌బెహరాను నియమించడం, వీళ్ళ వెనక సూరి ఫాలోయింగ్... రియలిస్టిక్ అన్పించకపోయినా, నవలకు ఆసక్తికరమైన ముగింపు తెచ్చేందుకు దోహదం చేశాయి. కోందుజాతి వారి జీవనశైలి గురించిన వివరణలు, ద్వివేది చివరకు వారి జీవితాల్లోకి నాగరికత తేవడం... ఈ నవలకు కొంతయినా చతుర సహజమైన నిండుదనాన్ని ఆపాదించాయి.

మెలోడ్రామాను మేళవింపు జేసే ప్రయత్నమే కారణమనుకుంటాను, కమర్షియల్ నవలల్లో, సినిమాల్లో కనబడే సాధారణ పొరపాట్లు పథకంలో కూడా చోటుచేసుకున్నాయి. హత్యాప్రదేశంలో ఇన్‌స్పెక్టర్ సూరి వెళ్లేసరికి ఆ జూరిస్‌డిక్షన్ పోలీసులెవరూ లేకుండా కేవలం కమీషనర్ మాత్రమే వుండడం... (ఒక సాధారణ గృహిణి హత్యను స్వయంగా కమీషనర్ వచ్చి పర్యవేక్షించేంత ఉదారత్వం పోలీసు డిపార్ట్‌మెంట్‌లో వుందా? )... కథ ముగింపులో పెళ్లయిన రెండేళ్ళకే తల్లిచాటున దాక్కోగలిగేంత పెద్ద పిల్లలు ద్వివేదికి వుండడం... మచ్చుకు కొన్ని.

**–డాక్టర్ పి. వెంకటరామిరెడ్డి**
బెంగుళూరు- 560 089.

## ఆల్ ఈజ్ వెల్

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

థామస్‌మోర్ కలలుగన్న ఉటోపియాని నిజం చేయడానికి రాబిన్సన్ క్రూసో నడుంకడితే ఎలావుండేదో అదే ద్వివేది పాత్ర.

మానం అమ్ముకుని శరీరాన్ని పోషించుకునే వేశ్యలను కూడా మోసం చేయడానికి వెనుకాడనిది మగజాతి! ఉద్యోగం పేరుతో పన్నిన బలమైన వల బారిన పడిన సంధ్య జీవితంలో ఎదురైన సంఘటనలు అమ్మాయిలు సదా అప్రమత్తంగా వ్యవహరించాలనే యదార్థాన్ని దయనీయంగా వర్ణించింది.

భర్త భార్యకు చేసే సాయం ఏమిటి అంటే, వంటగదిలో ఆమె కెదురుగా పీట వాల్చుకుని కూర్చోవడం, ఆ పని చేసినందుకు ఆమె అప్పుడప్పుడు ఆయనకి టీ అందించడం అంటారు రచయిత ఒకచోట. మనుషుల మధ్య ఆత్మీయత వెల్లడించే విషయాలు చిన్నవి. వాటిలో గాఢత కళ్లతో కాకుండా మనసుతో సూరి పరికించి ఆత్మీయతని లెక్కగట్టిన తీరు పాఠకుల కళ్లకి కూడా మనసునద్దింది.

తెలిసి ముట్టుకున్నా, తెలియక ముట్టుకున్నా కాలిన అగ్ని కోందుల ఉదూలియా! హార్గుణసావోతా అందమైన పుబులి-ద్వివేదిలకు నీరు సాక్షిగా జరిపిన వివాహం గిరిజన జాతుల ఆచారపూర్వక ఆహ్లాదంగా అన్పించింది.

డబ్బు పిచ్చికి ఏ న్యాయస్థానం విధించలేని కఠినశిక్షగా సుబ్బారెడ్డికి నిజంగానే పిచ్చెక్కడం సహజ న్యాయం అమలైనట్టుగా వుంది.

మంజరి పథకం- దొంగతనాలతో, కుతంత్రాలతో, హత్యలతో ధనాన్ని అన్వేషిస్తూ సాగినా చివరికి స్వంత ఆస్తి లేని, తిండి



గింజల కరువులేని, అందరి అవసరాలు తీర్చుతూ, అసలు డబ్బే అవసరంలేని ఆద ర్శగ్రామాన్ని, ఆదిమ సమాజాల్లో కమ్యూని జాన్ని మించిన సంపూర్ణ సమసమాజాన్ని ఆవిష్కరించడం జరిగింది.

–జన్ను లక్ష్మి
ఇస్నాపూర్

## స్వార్థఫలం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

'పథకం' కథద్వారా రచయిత పాఠకులకు ఏమి సందేశం యివ్వాలనుకున్నారో అర్థం కాలేదు. ప్రతి కథకు వినోదం అయినా వుండాలి, సందేశం అయినా వుండాలి, నీతి అయినా వుండాలి.

నంబియార్, ద్వివేది పాత్రలద్వారా దొంగల్లోనూ మంచి దొంగలుంటారనీ, అలాగే సూరి పాత్రద్వారా పోలీసుఆఫీసర్ల లోనూ మంచి వారు, చిత్తశుద్ధితో పనిచేసే వారు వుంటారనీ అందరికీ తెలిసిన సంగతే రాశారు.

నిష్ఠానివంటి నియమనిష్ఠలతో మంచిగా బతికే ధనవంతుడు కొడుకు చేసిన నేరానికి పడిన శిక్ష తప్పించడానికి హత్యలు కూడా చేయిస్తాడా? అనిపిస్తుంది. అంతగా కావా లంటే తనకున్న డబ్బు, పలుకుబడితో కొడు కును రక్షించుకోవడానికి అడ్డం వచ్చే పోలీ సు ఆఫీసర్లను బదిలీ చేయించవచ్చు కనుక కంకణం కట్టుకుని హత్య చేయించాలనుకో వడం అసహజంగా వుంది. మంచివాడిలో స్వార్థం వున్నా హద్దులు దాటడు.

ద్వివేది, బసవప్పల గురించి చదువు తుంటే పరిస్థితులు మనుష్యులను చెడు త్రోవ పట్టిస్తాయనేది నిజమనిపిస్తుంది.

ఉద్యోగాల పేరిట అమ్మాయిల జీవితా లను నాశనం చేసే సంఘటనలు సంఘంలో కోకొల్లలు. నవలలో సంధ్యకి జరిగిన అన్యాయం తెలుసుకున్న అమ్మా యిలు తగు జాగ్రత్తతో ముందడుగు వేయాలి. అంతేగానీ అందరూ బయటపడి సంధ్యలాగ న్యాయం జరిపించుకోలేరు. అన్నిచోట్లా సూరిలాంటి మంచి పోలీసు ఆ ఫీసర్లు వుండరుగదా!

నక్సల్స్ ఉద్యమం ఎలా ప్రారంభమ యిందీ, తీవ్రవాద కార్యకలాపాలలోని సదు ద్దేశ్యమూ చక్కగా వివరించారు. అలా ప్రారంభమయిన ఉద్యమం ఏవిధంగా పెడ దారులు పట్టినదీ కూడా వివరించి వుంటే బాగుండేది. ప్రస్తుతం నక్సల్స్ అంటే ప్రజలు భయపడే రీతిగా తయారైంది కదా?

వెనుకబడిన గిరిజన వర్గాల కట్టుబాట్లు, నిజాయితీ బాగున్నాయి. వారి ఆచారవ్యవ హారాలు, ఆహార పద్ధతులు చదివితే, రచ యిత వారి కుటుంబాలను బాగా అధ్య యనం చేసినట్లే వుంది. వారి కట్టుబాట్ల ప్రకారం ఒక యువతిని యువకుడు లాక్కె ళ్తున్నపుడు ఆమె ఎండిన కన్నీటిచారికలతో అయిష్టంగా వెళ్తున్నపుడు వారి భాష తెలి యకపోయినా పద్ధతులు తెలియకపోయినా ద్వివేదివంటి మనసున్నవాడు ఇరుక్కోవ డంలో అసహజత్వం లేదు. కుభి భాష మాత్రమే వచ్చిన పుబులి, ఆమె తండ్రి హర్గుణసాహోతా తరువాత కథాగమనంలో మన భాషలోనికెలా వచ్చినదీ అర్థంకాదు. డబ్బు ఎంత పనయినా చేయిస్తుందనేది స్పష్టంగా వున్నా, సుబ్బారెడ్డికి చివరలో పిచ్చిపట్టడానికి బలమైన మలుపు తిరగ లేదు కథ.

–ఎన్. సులోచన
బాపట్ల-522 101

## రిలీఫ్

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

అపరాధ పరిశోధక నవలలా మొదలై





రానురాను తీవ్రవాద కలాపాల మేళవిం పుతో, మలుపులు తిరుగుతూ పాఠకుడిని ఆసాంతం చదివించేలా నడిచిన మంజరిగారి పథకం ఒక రచన ప్రయోజనం, అది పాఠ కులను చదివించేలా ఉండటమే అనుకుంటే ఆ ప్రయోజనాన్ని నెరవేరుస్తుందనటంలో సందేహం లేదు. మాఫియా కార్యక్రమాలు, డబ్బుకోసం హత్యలు, తీవ్రవాద కార్యకలాపాలు, ఒక సామాజిక మార్పుకోసం ఉద్యమిస్తున్న విప్లవకారుల్లో మానవ సహజమైన ధనకాంక్ష, ఉద్యమ విద్రోహాలు మనం నిత్యం పేపర్లనిండా చూస్తున్న వార్తలే. వీటిని చదివిన తర్వాత నవలల్లో వర్ణించిన సంఘటనలు, వ్యక్తులు సజీవులుగానే అనిపిస్తారు. అచ్చం ఇదేవిధంగా ఉండకపోయినా అది ఒక లోపం అవదు. ఆఫ్టరాల్ ఫాక్ట్‌కు ఫిక్షన్ జోడించకపోతే అది నవల కాలేదుగదా. యదార్థం సాహిత్య రూపం సంతరించుకునే దశలో రచయిత యిమాజినేషన్‌లో పాత్రలు, సంఘటనలు రూపుదిద్దుకుంటాయి. ఇది అనివార్యం. లేకపోతే అది కేవలం వార్తాకథనం అవుతుంది.

తన విద్యుక్తధర్మానికి కట్టుబడి పనిచేసిన ఇన్‌స్పెక్టర్ సూరి, అమాయకంగా అమానుషానికి బలైపోయిన సంధ్య, కన్నకొడుకు వెధవ పనిచేసినా మమకారాన్ని చంపుకోలేక సాక్ష్యాన్ని తొలగించి కొడుకును రక్షించుకోవాలని చూసే నిష్ఠని, కాసుల ఎరచూపిస్తే చాలు ఎంతటి కర్కోటకానికైనా వెరవని రామ్‌బెహరా, ఉద్యమంలో దూకిన సుబ్బారెడ్డి, అతని అనుచరులు బసవప్ప, సిద్ధయ్యలు, దొంగయినా కొంత హృదయమున్న ద్వివేదిలాంటి పాత్రలను చక్కగా మలచారు. శ్రీకాకుళం, ఒరిస్సా సరిహద్దులలోని అమాయక గిరిజన జీవితాల నేపథ్యం నవలకు ఒక విలక్షణతను సమకూర్చింది. ఆ గిరిజన ఆచారాలను గురించిన అవగాహన విషయంలో నేల విడిచి సాము చేయలేదు.

కథనం సాదాసీదాగా, అనవసరపు వర్ణనలు లేకుండా సూటిగా నడిచింది. ఆసాంతం బోరుకొట్టకుండా సస్పెన్సు సినిమాలా చదివించగలిగింది. సీరియస్ సాహిత్యం నుండి ఈ నవల కొంత రిలీఫ్‌ను ఇవ్వగలుగుతుంది.

–ఎ. ఏసుపాదం
కొత్తగూడెం-507 101.

## తెలుగు సినిమా

***(అయిదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)***

మంజరి నవల పథకం సోషియో క్రైమ్ థ్రిల్లర్‌గా ఆద్యంతం రంజింపచేసింది.

కథనం ఉత్సుకత కలిగించేదిలా వుంది గానీ... కథ, ఇతివృత్తం చాలా బలహీనంగా వుంది. పాత్రలు పకడ్బందీగానే వున్నాయి. ద్వివేది ఏ పరిస్థితుల్లో దొంగగా మారాడో హృద్యంగా రాశారు రచయిత్రి. విధినిర్వహణలో ఇన్‌స్పెక్టర్ సూరి పాత్ర రోమాంచితంగా వుంది.

ఇన్‌వెస్టిగేషన్లో సంఘటనలు బలంగా వుండి పాఠకుడ్ని 'ఔరా' అన్పించాయి. అటవీ నేపథ్యంతో సాయుధరైతాంగ పోరాట పరిస్థితులు, గిరిజనుల తెగ కోందుల వివరాలు ఆసక్తికరంగా వున్నాయి. నాగరిక యువకుడు ద్వివేది గిరిజన స్త్రీ 'పుబులి'ని పెళ్ళి చేసుకోవడం స్ఫూర్తి దాయకంగా వుంది.

నిధి అన్వేషణలో సాగిన యత్నాలు ఎందుకనో అసంపూర్తిగానే వుంచారు రచయిత. సుబ్బారెడ్డిలాంటి నయవంచకులు, నమ్ముకున్న దళాన్నే నట్టేటిలో ముంచిన 'గోర్కీ'లాంటి నీచులు, సిద్ధాంతంకోసం ప్రాణాలర్పించే 'సిద్ధయ్య'లను మనం చూస్తూనే వుంటాం. నవల ఫర్వాలేదుగానీ మరీ మసాలా తెలుగు సినిమాలా వుంది.

–డాక్టర్ కె. సంధ్యారాణి
లింగపాలెం -534 462.



# చతుర

సంపుటి: 24 సంచిక: 3

ఏప్రిల్: 2001

279వ సంచిక

ఆమెకు చిన్నప్పటినుంచీ తెగింపు ఎక్కువ. అవతలి వ్యక్తి ఎంతటివాడైనాసరే, అతడు చేసింది తప్పయితే నిర్భయంగా ఎదుర్కొనేందుకు సిద్ధపడుతుంది. స్కూల్లోనూ, కాలేజీలోనూ ఆ అమ్మాయి అంటే ఇష్టమున్నవాళ్ళూ, కసి పెంచుకున్నవాళ్ళూ కూడా వున్నారు.

తను పోలీసు కొడుకునన్న అహంభావంతో విద్యార్థినులను ఏడిపించబోయిన ఓ యువకుడిని చెప్పుతో చెంప పగలగొట్టిన ఆమె విద్యార్థిజీవితం ఎలాంటి మలుపులని ఎదుర్కొంది?

జీవితంలో అనుక్షణం సాహసోపేతంగా అడుగు ముందుకువేసే ఆ యువతి చివరకు ఏ గమ్యం చేరుకుంది.?

ఆసక్తికరంగా చదివించే

మొలకలపల్లి కోటేశ్వరరావు రచన

'సాహసి' ఈ నెల చతుర సమగ్ర నవల.

మొలకలపల్లి కోటేశ్వర రావు

కరుణకి చిన్నప్పటినుంచీ తెగింపు ఎక్కువే!

సమస్యల్ని ఎదుర్కోవడం అంటే కరుణకి గోటితో సమానం.

కరుణ ఒక సంచలనమే.

అందుకే, అలాంటి అమ్మాయిని తీసుకుపోయి వేరే వూళ్ళో కాలేజీలో, హాస్టల్లో చేర్పిస్తే ఎలాంటి పరిణామాలు ఎదుర్కోవాలో, ఎలాంటి సమస్యలు సంభవిస్తాయో అని తల్లి సరస్వతమ్మకి మనసులో భయం పట్టుకుంది.

కాలేజీలో చేర్చకుండా మంచి సంబంధం చూసి పెళ్ళి జరిపించేస్తే ఒక భారం దిగిపోతుందనీ, తరువాత లోకులు ఆక్షేపణలు చేసే అవకాశం వుండదనీ, పరువుగా బతికిన కుటుంబం పరువు నిలబెట్టినట్లు వుంటుందనీ ఆ తల్లి కోరిక.

అయితే ఆ కోరిక నెరవేరే అవకాశం ఆమెకి ఏమాత్రం కనిపించడంలేదు. కనీసం నెరవేరుతుందనే నమ్మకమూలేదు, ఆశా లేదు!

మరి ఏంచేయాలో ఆమెకి అంతుబట్టకుండా వుంది. అర్థంగాకుండా వుంది.

తనమాట అంటే ఇంట్లో లక్ష్యం వుండదా? తనమాట చెల్లదా? అంటే అదే మీకాదు.

చాలా విషయాల్లో ఇంట్లో తనమాటకి ఎదురువుండదు. తను ఏది చెబితే అది జరిగితీరుతుంది.

కానీ ఈ విషయంలో మాత్రం భర్త శంకరం తనమాటని కనీసంగా అయినా పట్టించుకుంటాడనే నమ్మకంలేదు.

"ఇక చదువు వద్దు, పెళ్ళిచేద్దాం" అని చెప్పడానికే తనకి ధైర్యం చాలడంలేదు.

పెద్దమ్మాయి అరుణ పెళ్ళి పూర్తిగా తన బలవంతంమీదనే జరిగింది.

అప్పుడు శంకరం అరుణ పెళ్ళికి కొంత కాలం ఆగుదామన్నాడు. తనే తొందరపడి పెళ్ళి జరిపించింది.

అప్పుడు ఎంత తొందరపడిందో, ఇప్పుడు అంత పశ్చాత్తాపపడుతోంది.

పెళ్ళి అయినా అరుణకి ఏమీ సుఖం లేదు. ఆమె భర్తకు సకల వ్యసనాలూ ఉన్నాయి. ఆ సంగతి పెళ్ళయ్యాకగానీ తెలిసి రాలేదు.

అరుణకి చదువు వంటబట్టలేదు. పదవ తరగతి మూడుసార్లు తప్పింది. అలాంటి అమ్మాయి ఇంట్లోవుండి చేసేదేముంది? ఎప్పుడైనా పెళ్ళిచేసుకోవాల్సిందే కదా!

వెనుక మరో అమ్మాయి ఉంది. ఆ అమ్మాయికీ పెళ్ళిచేయాలి. కనీసం ఒకరికి పెళ్ళి జరిగినా జరిగినట్లే అనే వుద్దేశంతో తనే చొరవ తీసుకుని అరుణ పెళ్ళి జరిపించింది.

అల్లుడు బుద్ధిమంతుడేనని అనుకున్నారు తప్ప నిజంగానే మంచివాడయి ఉన్నట్లయితే తమకి బాధ వుండేదికాదు.

అరుణ మెతకమనిషి. నెమ్మదస్తురాలు. చురుకుదనం కూడా తక్కువే!

అరుణకి పూర్తి వ్యతిరేకం కరుణ. ఇద్దరూ అక్కచెల్లెళ్ళు అని పేరేకానీ ఆకారంలోనూ, రూపంలోనూ, గుణంలోనూ పరస్పర విరుద్ధం. స్వభావంలోనూ ఇరువురివీ భిన్న ధృవాలే!

ముందు పెడసరం పుట్టి, తరువాత కరుణ పుట్టింది.

ఆడపిల్ల అంటే అణకువగా, ఒద్దికగా, పొందికగా వుండాలి. అలా వుంటేనే జనం మెచ్చుతారు. లోకం హర్షిస్తుంది.

కరుణలో చూద్దామన్నా అలాంటి లక్షణాలులేవు. ఎవర్నీ లెక్కచేయదు. ఎవరినీ పెద్దగా గౌరవించినట్లు కనిపించదు. చాలా నిర్లక్ష్యంగా వుంటుంది.

ఇలాంటి అమ్మాయికి పెళ్ళిచేసి ఒక ఇంటిదాన్ని చేస్తేనే మంచిది.

ఊళ్ళో వున్న జూనియర్ కాలేజీలో ఇంటర్మీడియట్ చదివింది. పరీక్షలు రాసింది. పాస్‌కి ఢోకాలేదు. మంచి మార్కులే తెచ్చు

కుంటుంది.

చదువంటే శ్రద్ధగానూ, బాధ్యతగానే వుంటుంది. అయినా ఇక పైచదువులు అనవసరం.

తన అన్నకొడుకు వున్నాడు. బుద్ధిమంతుడు.

డిగ్రీ పూర్తిచేశాడు. కంప్యూటర్ కోర్స్ కూడా ఏదో చేసి ఉద్యోగ ప్రయత్నాల్లో వున్నాడు.

తాము అడిగితే వాళ్ళు కరుణని చేసుకోవడానికి అంగీకరించవచ్చు.

ఈ రోజుల్లో ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేయడం అంటే తేలికైన విషయంకాదు.

తమ వూళ్ళోనే ఎంతోమంది ఆడపిల్లలు పెళ్ళికి ఎదిగినవాళ్ళున్నారు.

ఆ పిల్లల తల్లిదండ్రులు పడుతున్న బాధలు సామాన్యమైనవికాదు. మంచిసంబంధాలు కుదరకా, ఒకవేళ కుదిరితే వాళ్ళు అడిగిన కట్నకానుకలు ఇవ్వలేకా చాలామంది తల్లిదండ్రులు బాధపడుతున్నారు. తమ బిడ్డలకి ఇక పెళ్ళిళ్ళు కావని కూడా కొందరు దిగులు పడిపోయారు.

తమకి ఆ సమస్యలేదు. స్వయానా తన అన్నకొడుకు. వాళ్ళకి కొద్దోగొప్పో ఆస్తిపాస్తులున్నాయి. వాళ్ళనుంచి పెద్దగా అభ్యంతరం వుండదు. అభ్యంతరాలూ, అవాంతరాలూ అన్నీ తమ ఇంట్లోనుంచే!

ముందు కరుణనీ, వాళ్ళ నాన్ననీ ఒప్పిస్తే చాలు!

ఇద్దరూ మొండిఘటాలే. ఇది అంత తేలికగా జరిగే విషయంగా తనకి అనిపించడం లేదు.

ముందు ఆయనగారు ఏమంటారో!

శంకరం ఇంటిముందు వున్న వేపచెట్టు నీడలో మంచం వేసుకు పడుకుని ఏదో నవల చదువుకుంటున్నాడు. పక్కనే కుర్చీ వుంది.

కరుణ అక్కడ కుర్చీ వేసుకుని అప్పటివరకూ ఏదో చదువుకుంది. తరువాత కరెంట్ రావడంతో టీవీ ఆన్ చేసుకుని దానిముందు సెటిలైంది.

ఇంట్లో టీవీ ఉన్నా చూసేవాళ్ళు తక్కువ. కరుణ కూడా పెద్దగా ఆసక్తితో టీవీ చూడదు.

పరీక్షలయ్యాయి. సెలవులు... తోచక, కాలక్షేపంగా టైంపాస్‌కోసం టీవీ ముందు కూర్చుంటుంది.

"ఏమండీ, అయితే అమ్మాయిని నిజంగానే కాలేజీలో చేరుద్దామంటారా? " వేపచెట్టు కిందకి వెళ్ళి కుర్చీ లాక్కుని కూర్చుని, కొద్ది సేపటి తర్వాత అడిగింది సరస్వతమ్మ.

శంకరం భార్య అడిగిన ప్రశ్నకి అయోమయంగానూ, ఆశ్చర్యంగానూ ఆమెవైపు చూశాడు.

"ఏమిటి నీవనేది? " ప్రశ్న అర్థంకానట్లు అడిగాడు.

"అమ్మాయిని కాలేజీకి ఎక్కడికో తీసుకుపోయి చేర్చడం నాకు ఇష్టంలేదండీ" ఈసారి మనసులోని మాటని డొంకతిరుగుడు లేకుండా స్పష్టంచేసింది.

"నీకు ఇష్టం లేకపోయినా కాలేజీలో చేరడం అమ్మాయికి ఇష్టమే"

"అమ్మాయికి పెళ్ళిచేసి పంపిస్తేనే మంచిదని నా వుద్దేశం" సూటిగా విషయం చెప్పింది.

"పెళ్ళా? " ఆశ్చర్యంగా అడిగాడు శంకరం.

"మనమ్మాయి అందరిలాంటిది కాదండీ. పెళ్ళిచేయాలి. చేస్తేతప్ప నా మనసుకి శాంతి వుండదు"

"అమ్మాయికి పద్దెనిమిదో ఏడువచ్చింది. తన మంచిచెడ్డలేవో తను నిర్ణయించుకోగల శక్తిసామర్థ్యాలున్నాయి. అమ్మాయి అమాయకురాలేంకాదుగదా! ఎలా ఇష్టమైతే అలా చేస్తుంది. తల్లిదండ్రులుగా తనకి చేయూతనివ్వడమే మన బాధ్యత"

"మీకు చెప్పి మిమ్మల్ని వప్పించడం కంటే నయానో భయానో అమ్మాయికి చెప్పి



చిన్నగా వప్పించడం మంచిది. మీ ధోరణి మీది తప్ప మంచీచెడూ మీకుపడితేగదూ"

"ఇప్పుడు నీవు అనేది ఏమిటి సరూ?"

వాదన పెంచి, ఘర్షణస్థాయికి తీసుకుపోవడం ఇష్టంలేక శాంతంగా అడిగాడు శంకరం.

"మన అమ్మాయి అందరి అమ్మాయిల్లాగా వుంటే మనకి ఏ బాధావుండదు. అందరు అమ్మాయిలు ఎలా వుంటున్నారూ, ఇది ఎలా వుంటోంది? దారినపోయే కుక్కని కదిలించుకుని కరిపించుకునే రకం ఇది. మన దారిన మనం పోతే ఆ కుక్క దారిన అదిపోదూ? మన స్థాయి ఏమిటో, మనం ఎంతవరకూ వుండాలో అంతవరకే వుండాలి. ఒకరిజోలీ, ఒకరి ప్రస్తావనా మనకి అనవసరం"

"అనవసరమే కానీ అవసరమని ఎవరన్నారు? అమ్మాయి ఎవరిజోలికీ వెళ్ళలేదే"

"వెళ్ళలేదూ? మీరు సమర్థిస్తుండబట్టే దానికి అన్ని కాళ్ళు రావడం, దానికంటే ముందు మిమ్మల్ని అనుకోవాలి. మీవలనే అది పాడుకావడం, ఇది అసలు ఎన్ని గొడవల్లో ఇరుక్కొంది? దీనికెందుకు లేనిపోని గొడవలు?"

"ఇప్పుడు అమ్మాయి ఏం చేసింది సరూ? ఏం గొడవ చేసిందట?"

"ఒకటా, రెండా? అసలు ఆ పోలీసాయన కొడుకుతో వీళ్ళకేం పనండీ? కొరివితో తలగోక్కోవడం అంటే ఇదేకదూ! చూస్తూచూస్తూ పోలీసోడి కొడుకుని వీళ్ళు ఎందుకు కదిలించాలి? ఆడపిల్లలు వెళ్ళి ఒకబ్బాయిని కొట్టడం అంటే ఎంత పొగరు కాకపోతే అలా తెగిస్తారూ! ఇప్పుడు ఆ పోలీసాయన పళ్ళు నూరుతున్నాడట. ఈసారి ఏమాత్రమైనా పొరపాటు జరిగితే మన అమ్మాయి విషయం ఏమవుతుందీ?"

"ఆ పోలీసోడి కొడుకుని వీళ్ళు కదిలించారా, వాడే వీళ్లని కదిలించి అల్లరిపెట్టాడా?"

"ఏదైనా ఒకటే! ఏ రాయి అయితేనేం పళ్ళు రాలగొట్టుకోవడానికి. అరటిఆకు పోయి ముల్లుమీద పడినా, ముల్లువచ్చి అరిటాకుమీద పడినా చివరికి చిరిగిపోయేదీ, నష్టపోయేదీ అరిటాకే! అతను మన అమ్మాయిని ఏం అల్లరిపెట్టలేదుగదా. ఎవరికో ఏదో జరిగితే మనకెందుకు లేనిపోని దురద! మనపాటికి మనం పోతే పోదూ?"

"మనకీ వాదన తెగేదికాదులే సరూ! అమ్మాయి ఇష్టం. తనకి ఎలా కావాలంటే అలా చేసుకుంటుంది. ఏదైనా మంచి నిర్ణయం తీసుకునే తెలివితేటలు అమ్మాయికి వున్నాయి. తనే నిర్ణయించుకుంటుంది" శంకరం మాటలు పెంచడం ఇష్టం లేనట్లు పుస్తకం తెరిచాడు.

సరస్వతమ్మకి కొంచెం ఉత్సాహం కలిగింది. కొద్దిగా ఆశ రేకెత్తింది. కరుణదే తుదినిర్ణయం అని భర్త చెప్పడంతో ఎలాగైనా గట్టి పట్టుబట్టి కరుణని ఒప్పిస్తే సరిపోతుందని భావించింది.



శంకరం, సరస్వతమ్మ దంపతులకి సంతానం ఇద్దరు అమ్మాయిలు, ఒక అబ్బాయి.

పెద్ద అమ్మాయి అరుణ, రెండో





అమ్మాయి కరుణ, కొడుకు రమణ.

శంకరం ఆ వూరికి పొరుగునే వున్న గ్రామంలోని అగ్రికల్చరల్ కో-ఆపరేటివ్ సొసైటీలో పెయిడ్ సెక్రెటరీగా వుద్యోగం చేస్తున్నాడు.

పెద్దమ్మాయి అరుణకి పెళ్ళి అయింది. కానీ ఆ కాపురం మూడుకష్టాలూ, ఆరునష్టాలుగా సాగుతోంది.

అల్లుడికి లేని వ్యసనం లేదు, అమ్మాయికి లేని అగచాట్లులేవు.

అరుణకి చదువు పెద్దగా రాకపోయినా ఇంట్లో పొందికగా, నైనంగా వుంటుంది. అన్నిపనులూ ముచ్చటగా చేస్తుంది. ఇంటిని అద్దంలా తీర్చిదిద్దినట్లు వుంచుతుంది.

ఆడుతూపాడుతూ పనిచేసుకుంటూ ఇంట్లో వున్న అమ్మాయికి చూస్తూచూస్తూ ఎందుకు పెళ్ళిచేసి కష్టాలకొలిమి లోనికి దించామా అని శంకరం ఎప్పుడూ విచారపడుతుంటాడు.

ఉన్న అల్లుడ్ని అలాగే వదిలేస్తే ఇంకా పేట్రేగిపోతాడనీ, చివరికి పెద్ద కూతురు జీవితం అస్తవ్యస్తం అవుతుందనీ, అతన్ని ఎలాగైనా ఒకదారికి తీసుకురావాలని, శంకరం వాళ్ళు అప్పట్లో నిర్ణయించుకున్నారు. కొంత పెట్టుబడి తాము అయినా పెట్టి, అల్లుడితో ఏదో ఒక వ్యాపారం పెట్టించాలనుకున్నారు.

చాలా వ్యాపారాలు చూడగా, చివరికి వాళ్ళకి ఫ్యాన్సీస్టోరు పెట్టించడం ఉత్తమం అనిపించింది.

మంచి సెంటరు చూసి గది ఒకటి అద్దెకి తీసుకుని అల్లుడితో షాపు పెట్టించారు.

అతను పని బద్ధకస్తుడు. సోమరి. షాపు ఒకరోజు తీస్తే రెండురోజులు మూసి ఉంచుతాడు. ప్రస్తుతం షాపు అలా నడుస్తోంది.

రెండో అమ్మాయి కరుణని గురించి శంకరానికి ఎలాంటి విచారంలేదు.

ధైర్యంగా వుంటుంది. ఎలాంటి సమస్యనైనా ఎదుర్కొంటుంది. ఎవరికి ఎలాంటి సహాయం అయినా చేస్తుంది. మంచిగా వుంటుంది. కూతురు గురించి ఆయన ఆలోచన అది.

అయితే కరుణని గురించి తల్లి సరస్వతమ్మకి మాత్రం చాలా విచారం.

"ఎక్కడెక్కడి సమస్యలూ కొని తెచ్చుకుంటుంది. ముళ్ళకంపని తలకి చుట్టుకుంటుంది. సొమ్ము వుండేదీ, పోయేదీ తెలియదు. తనకి తక్కువైనా అడిగినవాళ్ళకి లేదనకుండా ఇస్తుంది. తనకి న్యాయం అని తోస్తే ఎవరితో అయినా జగడం వేసుకోవడానికి వెనుకాడదు. ఎంత చిన్న విషయం అయినా తనకెందుకులే అని పోనీయదు" అని తల్లి భావన.

కరుణది చిన్నతనంనుంచీ కరుణ స్వభావమే.

తనకి ఆపేరు పెట్టినందువలనో, సహజంగా వచ్చిన లక్షణమోకానీ చాలా దయగల స్వభావం. అంతే కాదు ఆమెకు చాలా పట్టుదల కూడా వుంది.

చాలా విషయాల్లో కరుణ పట్టు ఉడుం పట్టే అని తల్లిదండ్రులకి బాగా అనుభవమైంది.

స్కూల్లో కూడా కరుణ అలాగే వుంటుంది.

ఒకసారి కరుణ ఐదవతరగతి చదువుతుండగా క్లాసులో పిల్లలు గొడవచేస్తున్నారు. మాష్టారు న్యూస్‌పేపర్ చూసుకుంటూ, "ఒరేయ్ గోల చేయకండ్రా. మౌనంగా కూర్చోండి. నిశ్శబ్దం" అని పేపర్లోంచి తలతిప్పి పిల్లలకి చెపుతున్నాడు.

మాష్టారి మాటని ఎవరూ పట్టించుకోలేదు. క్లాసు గోలగోలగా వుంది. ఎవరిమటుకు వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ, కొట్టుకుంటూ, ఏడ్చుకుంటూ అరుస్తున్నారు.

మాష్టారుకి చిరాకెత్తిపోయింది.

కూర్చున్నవాడు ఒక్క ఉదుటున లేచి



బెత్తంతో వరుసగా పటపటా కొట్టుకుంటూ వచ్చాడు. కరుణకి గట్టిదెబ్బలు రెండుపడ్డాయి.

నిజానికి అప్పుడు కరుణ మౌనంగా వుంది.

అక్షరాలు అందంగా కుదరాలనే వుద్దేశంతో తల వంచుకుని కాపీ బుక్ రాసుకుంటోంది.

పేపర్‌లో తలదూర్చిన మాష్టారు ఎవరు మాట్లాడారో, ఎవరు మాట్లాడలేదో చూడకుండా వరుసగా వడ్డించుకుంటూ వచ్చాడు. ఆ వరుస వడ్డింపులో కరుణకీ వడ్డన జరిగింది.

రాసుకుంటూ వున్న తనని అకారణంగా కొట్టడంతో కరుణకి కోపం వచ్చింది.

"నన్ను ఎందుకు కొట్టారు సార్? " అంది లేచి ఏడుస్తూ.

ఎదురుతిరిగి ప్రశ్నించడంతో మాష్టారుకి కోపం మరీ ఎక్కువైంది.

"వేలెడంత లేవు. నాకు ఎదురు తిరుగుతావా? " అని ఆ కోపంలో బెత్తంతో మరో రెండు దెబ్బలు ఇంకా గట్టిగా వేశాడు.

"మీరు సార్ అయితే అయ్యారు. వూరికే మీ ఇష్టం వచ్చినట్లు కొడతారేమిటి? " అంది కరుణ పెద్దగా ఏడుస్తూ, కోపంగా.

"గోల చేయొద్దంటే ఎందుకు గోల చేస్తున్నావు? " అన్నాడు మాష్టారు.

"నేను గోల చేయడం నీవు చూశావా? పేపర్ చదువుకుంటూ నిద్రోతున్నావా? " నిర్భయంగా అంటూ బుక్స్ సర్దుకుని లేచింది.

"ఆ అమ్మాయి గోలచేయలేదు సార్, కాపీ రాసుకుంటోంది సార్" అని పిల్లలు అప్పటికే అరవడం మొదలుపెట్టారు.

మాష్టారుకి తన తప్పు తెలిసివచ్చింది. ఊహించని సంఘటనా, అంతకుముందు ఎప్పుడూ జరగని విషయం, కరుణ ఇంటికి వెళ్ళడానికి సిద్ధపడడం వీటితో ఆయన ఖిన్నుడైపోయాడు.

"అది కాదమ్మా... అది కాదమ్మా..." అని ఏదో సంజాయిషీ ఇవ్వబోతున్నాడు.

"పిల్లల్ని చేసి మీ ఇష్టం వచ్చినట్లు కొడతారేమిటి? " అని కరుణ, ఆయన పిలుస్తున్నా వినిపించుకోకుండానే బ్యాగ్ తీసుకుని ఇంటికి వచ్చేసింది.

ఇంటిదగ్గర అమ్మానాన్నలకి విషయం చెప్పింది.

"అదికాదే, మాష్టారు కోపంలో ఒక దెబ్బ వేశాడని పుస్తకాలు సర్దుకుని ఇంటికి రావడమేనా? నిన్ను ఒక్కదాన్నే కాదుగా, మిగతా పిల్లల్ని కూడా కొట్టారంటున్నావుగా! వాళ్ళు ఎవరేనా నీ మాదిరిగా లేచి వచ్చారా? " తల్లి కోప్పడింది.

"ఒకరితో నాకెందుకు? వాళ్ళు గోల చేశారో, చేయలేదో నేను చూశానా? నన్ను అనవసరంగా కొడితే నేను వూరుకుంటానేమిటి? "

"ఇలాగైతే నీకు చదువు బాగానే వస్తుంది. భయమూ భక్తీ లేకుండా బళ్ళో మాష్టార్లకి ఎదురు తిరిగినవాళ్ళకి ఎవరికీ చదువురాదు. మాష్టార్లంటే గౌరవం వుంటేనే వాళ్ళు చెప్పేది బుర్రకి ఎక్కుతుంది. నీ మొండితనం, పెడసరంతోనే నీవు దెబ్బతింటావు"

"అన్యాయంగా కొడితే తనకి బాధవెయ్యదూ. ఎవరు గొడవ చేస్తున్నారో, ఎవరు చేయడంలేదో చూసి కదూ దండించాల్సింది" అన్నాడు శంకరం.

"మీ సమర్థింపు బాగానే వుంది. ఇంట్లో కానీ, బళ్ళోకానీ ఆవేశంలో అనేక పొరపాట్లు జరుగుతుంటాయి. మీరు రోజూ ఎన్నిసార్లు నామీద వూరికే చిటపటలాడడం లేదూ"

కరుణ ఇక ఆ స్కూల్‌కి వెళ్ళనంటే వెళ్ళనని తేల్చి చెప్పింది. అది మంచి స్కూలు. చదువు బాగుంటుంది. అయినా సరే!

స్కూల్లో వదిలిపెట్టి వస్తాను రమ్మని శంకరం రెండురోజులు కరుణని బతిమా




లాడు.

కరుణ తన పట్టు సడలించుకోలేదు.

"చదువు అయినా మానుకుంటాను కానీ ఇక ఆ స్కూల్‌కి మాత్రం వెళ్ళను నాన్నా! ఎందుకు అనవసరంగా అడుగుతావు" అని తండ్రితో పాటు తల్లికి కూడా స్పష్టంగా చెప్పింది.

"సరే నీ ఇష్టమమ్మా!" అని శంకరం వూళ్ళో వున్న మరో స్కూల్‌లో కరుణని చేర్పివచ్చాడు.

కరుణ పట్టుదల అలాంటిది.

★ ★ ★

క్లాసులోనూ, విడిగానూ ఎప్పుడూ కరుణ వెంట కొంతమంది స్నేహితురాళ్ళు వుంటారు. ఆడపిల్లలు అందరూ కరుణ జట్టే!

టీచర్లు కూడా కరుణ అంటే ఆప్యాయతానురాగాలతో వుంటారు.

చదువులో. చురుకుగా వుంటుంది. పిల్లలు ఎవరితోనూ ఎప్పుడూ గొడవపెట్టుకోదు. చదువుకి సంబంధించి చెప్పిన వర్క్ బాధ్యతగా చేస్తుంది. ఠంచన్‌గా వేళకి స్కూలుకి వస్తుంది. ఎగనామం పెట్టదు. అల్లరి చిల్లరిగా వుండదు. ఈ కారణాలతో టీచర్లు అందరూ కరుణ అంటే అభిమానంగానూ, ఇష్టంగానూ వుంటారు.

కరుణ స్నేహితురాళ్ళలో రాధ ముఖ్యమైనది.

ఇద్దరూ ఒకటే క్లాసు. దాదాపు ఇద్దరూ ఒకే బెంచ్‌మీద కూర్చుంటారు.

క్లాసులో మార్కుల్లో రాధ ఫస్ట్ ర్యాంక్ అయితే కరుణ నాలుగు ఐదు ర్యాంకుల్లో వుంటుంది.

చదువులో రాధకి తిరుగులేదు. ఎప్పుడూ చదువుకుంటూనే వుంటుంది.

రాధ చదువంటే ఎంత ఇష్టంగా వుంటుందంటే ఆరవ తరగతి నించీ కూడా. క్లాసులో దాదాపుగా రెండవ ర్యాంకు ఎప్పుడూ రాలేదు. ఎప్పుడూ ఫస్ట్ ర్యాంకే!

ఆ అమ్మాయి ధ్యాస అంతా చదువుమీదనే! చదువుకోసమే పుట్టినట్లూ, చదువే జీవితమైనట్లూ మరో లక్ష్యం, మరో ఆలోచన లేకుండా వుంటుంది.

మనిషి కూడా కుందనపు బొమ్మ. అపురూపమైన అందం. పట్టుకుంటే కమిలిపోతుందేమో, మురికి అవుతుందేమో అనిపించేట్లు తెల్లటి తెలుపు రంగు! పొడవైన వెంట్రుకలూ, పెద్దకళ్లూ!

కరుణ, రాధ ఇద్దరూ ఒకరి పక్కన ఒకరు నిలబడి వుంటే చూసేవాళ్ళకి విచిత్రంగా వుంటుంది.

రాధ స్వచ్ఛమైన తెలుపురంగు అయితే కరుణ కల్తీలేని నలుపురంగు. రాధ బక్కపలుచగా సన్నగా మల్లెలా వుంటే కరుణ బలిష్టంగా, దృఢంగా వుంటుంది.

రాధా వాళ్లది చాలా పేద కుటుంబం. వాళ్ల నాన్న ఒక చిన్న దేవాలయంలో అర్చకుడుగా పని చేస్తుంటాడు. ఆయనకి చెప్పుకోదగిన ఆదాయం రాదు.

రాధ సక్రమంగా స్కూల్‌కి పోతుందికానీ పుస్తకాలూ, కలాలూ లాంటివి మాత్రం సరిగా వుండవు. రాధకి ఎక్కువగా అవసరమైన పుస్తకాలు, కలాలు, నోట్‌బుక్స్ కరుణే ఇస్తుంటుంది.

ఎప్పుడు తీసుకున్నా గత్యంతరం లేని పరిస్థితుల్లో మొహమాటపడుతూనే రాధ అవి తీసుకుంటుంది.

"అబ్బ... తీసుకోవే. నాకు లేకపోతే నువ్వు ఇవ్వవా? చూడబోతే నిజంగా ఇచ్చే దానివిగా లేవే!"

"అదేం మాట కరుణా... నీకు లేకుండా నా దగ్గిర వుంటే నీకు ఇవ్వకుండా ఎలా వుంటాను?"

"ఇప్పుడూ అలాగే అనుకో!" అంటూ కరుణ బలవంతంగానే ఇస్తుంటుంది.

చదువులో రాధకి వున్న ఆసక్తినీ, పట్టుదలనీ గమనించిన స్కూలు మేనేజ్‌మెంటు వాళ్లు ఫీజు అడగటం విరమించుకున్నారు.



# మిస్టర్ బిగ్ బెల్లి

సచిత్ర విచిత్రం



అమెరికాలో అతి విశాలమైన ఉదరం గలవారెవరా అని ఇటీవల ఓ అమెరికన్ దిన పత్రిక పోటీ పెట్టింది. అందులో పాల్ డైడ్‌రిచ్ (39) అనే ఓ పెద్దమనిషి గెలుపొందాడు. ఆరడుగుల ఒక అంగుళం పొడవుండే ఇతడి పొట్ట చుట్టుకొలత 82 అంగుళాలు. అంటే ఆరడుగుల పది అంగుళాలు. ఇతనీ పొట్టను ఎలా సాధించాడని ప్రశ్నిస్తే "బీర్, ఫ్రెంచ్ ఫ్రయిస్, పిజ్జా" అని జవాబిచ్చాడతడు. 275 పౌన్ల నుంచి 18 నెలల్లో ఇతను 575 పౌన్ల బరువు పెరిగాడు. తన ఇంట్లో అద్దం పక్కన మరో అద్దం అమర్చుకున్నాడు. ఆ రెండింటిలో చూస్తే కానీ ఇతని పూర్తి ప్రతిబింబం కనపడదు.

అలాంటి అమ్మాయి తమ స్కూల్లో వుంటే స్కూలుకి మంచి పేరు వస్తుందనీ, మంచి ర్యాంకు వస్తే మరింతమంది పిల్లలు చేరతా రనే వుద్దేశంతో రాధకి ఉచితంగానే చెపుతున్నారు.

కరుణని డేరింగ్, డేషింగ్, డైనమిక్ లేడీ అని ఊళ్లో చాలామంది కుర్రవాళ్లు పరోక్షంలో అంటూంటారు.

కరుణ, రాధ ఇద్దరూ పదవ తరగతి చదువుతుండగా జరిగిన ఓ సంఘటనే కరుణని వూళ్లో మంచిగా కానీ, చెడుగాకానీ చెప్పుకోవడానికి ఒక రకమైన గుర్తింపు తెచ్చి పెట్టింది.

వీళ్లు పదవ తరగతిలో వుండగా వీళ్ల క్లాసులో రాజు అనే కుర్రవాడు వేరే వూరి నించి వచ్చి చేరాడు.

డిపార్ట్‌మెంట్‌కి సంబంధించి ఏదో నేరం చేస్తే పనిష్మెంట్‌గా ఆయనని ఈ వూరికి బదిలీ చేశారు.

రాజుకి బొత్తిగా చదువులేదు. క్లాసులో అందరూ పదిహేనూ, పదహారు ఏళ్లు, అంతకులోపు వాళ్లయితే వీడికి పదిహేడేళ్లు వుంటాయి. మనిషి కూడా పొడుగు.

పోకిరి బుద్ధులూ, పొగరుబోతు లక్షణాలూ మెండుగా వున్నాయి. ఇవి రెండే గాకుండా బడాయి మాటలూ, తాను హీరో అనిపించుకోవాలనే తాపత్రయమూ ఎక్కువ.

"నేను చదువుకుని వచ్చిన స్కూల్లో మన మంటే హడల్‌రోయ్! పిల్లలకే కాదు, టీచర్లకి కూడా మనమంటే టెర్రర్! నన్ను చూస్తే హెడ్ మాస్టర్ సైతం వణికిపోవాల్సిందే!" వచ్చిన రెండో రోజే క్లాసులో పిల్లలకి చెప్పాడు.

"హెడ్‌మాస్టర్‌కి ఎందుకురా నిన్ను చూస్తే భయం?" ఒక కుర్రాడు ఆసక్తిగా అడిగాడు.

"ఎందుకేమిటీ? అంతేరా మనమంటే"

"క్లాస్‌లో నన్ను ఏ సార్ కానీ మేడంకానీ క్వశ్చన్ చేయరు. నన్ను ప్రశ్నలు అడిగే దమ్ములు ఎవరికీ లేవనుకో!" ఉత్సాహంతో చెప్పాడు రాజు.

అలాంటి కబుర్లతో క్లాసులో చదువులేని పిల్లలు నలుగురైదుగురికి రాజు హీరో అయిపోయాడు.

ఒక నెల జరిగింది. అతని దృష్టిలో రాధ పడింది.

రాధని అల్లరి చేయడం మొదలుపెట్టాడు.

"ఏం ఫిగర్రా! ఫిగర్ అంటే ఇలా వుండాల్రా" అని రాధ దగ్గరగా వచ్చి అన్నాడు ఒకసారి.

రాధ ఆ మాటలకి తనని కాదన్నట్లు తల దించుకుంది.

"రాధా... అందించు నీ లేతపెదవీ..." రాధ ఒంటరిగా స్కూల్‌కి నడచివస్తుంటే సైకిల్ మీద వస్తూ సినిమా పాట ప్రారంభించాడు.

రాధ స్కూల్‌కి వస్తున్నప్పుడో, ఇంటికి వెళ్తున్నప్పుడో సైకిల్ మీద అనుసరిస్తూ ఈలలు వేయడం, వెకిలి సినిమా పాటలు పాడటం చేస్తున్నాడు.

"వాక్కుంటే వాక్కుంటాడ్లే. వాడి పాపాన వాడే పోతాడు" అని రాధ ఎవరికీ చెప్పలేదు.

రోజురోజుకీ రాజు అల్లరి శృతిమించిపోతోంది. ఇక రాధ భరించలేని పరిస్థితి వచ్చింది. కరుణకి చెప్పాలా, వద్దా? చెబితే ఎలా వుంటుంది. అనే సందిగ్ధంలో అప్పటి వరకూ వుంది రాధ.

విషయం తెలిస్తే కరుణ అంత తేలికగా విడిచిపెట్టదు. వాడ్ని ఎదిరించి అడుగుతుంది. వాడు ఏదో అంటాడు. విషయం పెద్దది అవుతుంది. నలుగురి నోళ్లలోనూ నానుతుంది. తన నుండి ఎలాంటి ప్రోత్సాహం వుండకపోతే వాగివాగీ వాడే మానుకుంటాడని రాధ ఆలోచించింది.

ఆ ఆలోచన తప్పు కావడంతో కరుణకి చెప్పి సలహా తీసుకోవడం, తన గుండెల్లోని వేదనని తగ్గించుకోవడం మంచిదని రాధ



నిశ్చయించుకుంది.

"ఏమే, వాడు ఏమిటి ఉదయం నీవైపు చూసి ఏదో అంటున్నాడు? "

"ఇవ్వాళ ఒక్కరోజే కాదు కరుణా, రోజూ గొడవ చేస్తున్నాడు" అని తనని అల్లరి చేస్తున్న విషయం మొత్తం చెప్పింది రాధ.

"మరి ఇన్ని రోజుల్నించీ నాతో మాట మాత్రం ఎందుకు చెప్పలేదే? "

"నీతో చెబితే గొడవ పెద్దదవుతుందని భయపడ్డాను కరుణా! వాడు మానుకుంటాడని అనుకున్నాను కానీ మానుకునేలా లేడు. నీకు చెపుదామనుకుంటున్నాను.. నువ్వే అడిగావు"

"వాడు ఎందుకు మానుకుంటాడే? అల్లరి ఎలా మానుకుంటాడనుకున్నావు? "

"వాడికి అక్కచెల్లెళ్లు లేరా? అమ్మలేదా? "

"వుంటే? "

"వాళ్లు మనలాంటి వాళ్లుకాదా? "

"అయితే ఏమంటావు? తనకీ అక్కచెల్లెళ్లు వున్నారనీ, వాళ్లూ అందరిలాంటి వాళ్లేననే జ్ఞానం వున్నవాళ్లు ఎవరూ ఆడపిల్లల్ని వేధించరు. వీడు అలాంటి ఆలోచన బొత్తిగా వుండని బాపతు? "

"మరి ఏం చేస్తే బాగుంటుంది కరుణా? " రాధ అడిగింది.

"అదే నేనూ ఆలోచిస్తున్నా! ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేస్తే అంతగా న్యాయం జరగదే! ఆయన గట్టిగా మాట్లాడలేరు. ఆయనకి చెప్పినా ఒకటే, చెప్పకపోయినా ఒకటే!"

"అసలు ఆయనకి చెప్పకుండా వుండటమే మంచిది కరుణా! ఆయనకి రిపోర్ట్ చేసినా ఆయన పరిష్కరించలేడు. దాంతో వీడికి ఇక తనని ఎదిరించేవాళ్లు ఎవరూ వుండరని అసలు లక్ష్యపెట్టడు. అందుకే నేను ఇన్ని రోజులుగా ఆయనకి రిపోర్ట్ చేయడానికి వెనుకాడుతున్నాను"

"ఆయన మనదే తప్పంటాడు. అసలు మగపిల్లల జోలి ఆడపిల్లలకి ఎందుకు అంటాడు? ఒకసారి జ్యోతి విషయంలో కూడా ఇలాగే అన్నాడు కదే!"

"అవును. మరి ఏం చేద్దాం కరుణా. నాకు భయంగా వుందే!" దీనంగా ముఖం పెట్టి అడిగింది రాధ.

"భయపడితే ఎలాగే? నీవు ఏమాత్రం భయపడినా వాడు విజృంభిస్తాడు. వాడికి చెప్పి చూద్దాం. పద్ధతి మార్చుకుంటాడా సరే! లేకపోతే తరువాత ఏం చేయాలో ఆలోచిద్దాం!" అంది కరుణ.

"వాడ్ని చూస్తేనే నాకు భయంతో వణుకు పుడుతోందే! వాడికి ఏం చెప్పగలమే!"

"నీవు చెప్పొద్దులే! నేనే చెపుతాను. అంత భయపడితే ఎలా? చదువు ఒక్కటేకాదు, చాలా విషయాలు నేర్చుకోవాలి" నవ్వుతూ అంది కరుణ.

ఆ సాయంత్రం రాధ వెంట కరుణ తోడుగా వాళ్లింటి వరకూ వెళ్లింది. చాలా సార్లు సైకిల్ మీద వెంటపడి ఏదో ఒక పోకిరీ మాటో, పాటో అనేవాడు ఆ రోజు ఎందుకో రాలేదు.

మరుసటి రోజు ఉదయం రాధ ఒక్కతే స్కూల్‌కి వస్తుంటే దారిలో సైకిల్‌మీద కలిశాడు రాజు.

"హాయ్ రాధా... బావున్నావా? "

రాధ భయపడిపోయి తల ఇంకా భూమిలోకి కుంచించుకుపోయేలా వంచుకుని నడక వేగం పెంచింది.

"మాట్లాడితే రత్నాలు రాలిపోతాయా? ముత్యం లాంటి నోరు అరిగిపోతుందా? "

ఎప్పుడూ మగవాళ్లవైపు కన్నెత్తి చూడని రాధ గుండెలు వేగంగా కొట్టుకోవడం ప్రారంభించి, ఆ వేగం కాళ్లకి వ్యాపించి పరుగులాంటి నడకతో క్లాస్‌రూంలోనికి వచ్చి పడింది.

క్లాసులో కరుణ కూర్చుని వుంది. కరుణ పక్కన కూర్చుని చిన్నగా రొప్పుతూ ముఖానికి పట్టిన చెమటని చేతి రుమాలుతో తుడుచుకుంది.

ముఖంలో ఆందోళన ఛాయ ప్రస్ఫు

టంగా కనపడుతోంది.

రాజు ఏదో అల్లరి చేసి వుంటాడని కరుణ భావించింది. అయితే ఆ సమయంలో ఏం జరిగిందని కరుణ అడగదలుచుకోలేదు. ఆందోళన తగ్గిన తరువాత నెమ్మదిగా తనే చెపుతుందనుకుంది.

కరుణ వూహించినట్లుగానే రీసెస్ బెల్ సమయంలో దూరంగా తీసుకుపోయి ఉదయం జరిగిన విషయం చెప్పింది రాధ.

"ఇక వూరుకోకూడదే! మనం పోనీలే అని తాత్సారం చేసినకొద్దీ వాడు పెచ్చురిల్లిపోతు న్నాడు. దద్దమ్మ ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేయడం దండగమారి పని. సాయంత్రం నేను వాడితో మాట్లాడుతాను. నీవు కూడా వుండు" అంది కరుణ.

కరుణ ఏం అడుగుతుందో, వాడు ఏం అంటాడో, ఏమైనా గొడవ జరుగుతుందేమో అని స్కూల్ వదిలేవరకూ ఆందోళనగానే కూర్చుంది రాధ. క్లాసులో టీచర్స్ చెప్పే పాఠాల మీదకి మనసు పోలేదు.

హోంబెల్ కొట్టడంతోనే బుక్స్ తీసుకుని సైకిల్‌స్టాండ్ వద్దకు వెళ్లాడు రాజు.

కరుణ అతనిని అనుసరించి వెళ్లి "రాజూ మాట" అని పిలిచింది.

ఆ పిలుపుకి రాజు తత్తరపడిపోతూ కరుణవైపు చూశాడు. ఉదయం రీసెస్‌బెల్ సమయంలో రాధ కరుణతో ఏదో చెప్పడం గమనించాడు. తన విషయమే చెపుతోందని రాజు అప్పుడే అనుకున్నాడు.

కరుణని చూస్తే క్లాసులో మగపిల్లలు అందరూ జంకుతారు. కరుణ సీరియస్‌గా వుంటుంది. సిన్సియర్‌గా వుంటుంది. చాలా విషయాల్లో స్ట్రిక్ట్‌గానూ వుంటుంది.

"ఏమిటి?" రాజు అడిగాడు బెరుకుగానే.

"నీతో మాట్లాడాలి. కొద్దిసేపు ఆగు"

సైకిల్‌స్టాండ్ తీసి నిలబడ్డాడు రాజు. రాజు దగ్గరకి వెళ్లారు ఇద్దరూ.

"రాజూ... రాధని రోజూ వెంటపడుతూ ఏదో అంటున్నావట. ఏమిటీ విషయం?" కరుణ అడిగింది.

"నేనా? నేను ఎప్పుడూ ఏమీ అనలేదే!" అమాయకంగా ముఖంపెట్టి అన్నాడు రాజు.

"నీవేం అనడంలేదా?" ఆశ్చర్యంగా అడిగింది రాధ.

"నేను ఎప్పుడు అన్నాను? ఏమన్నాను?"

"రోజూ అంటున్నావు? ఇవ్వాళ ఉదయం హాయ్ రాధా, బావున్నావా అని అడుగుతూ సైకిల్ మీద వెంటబడలేదూ? ఇంకా ఏవేవో అనలేదూ?" రాధ అడిగింది.

"బావుంది ఇది. నేనేం అన్నానూ? అసలు నీవు ఎవరివో కూడా నాకు తెలియదే! అసలు నేను ఎందుకు అంటాను?"

"నీవు ఏమీ అనకుండానే రాధ వూరికే చెపుతుందా? మొన్న నీవు ఏదో కామెంట్ చేయడం నేను కూడా విన్నాను. సరే ఏదైనాగానీ మర్యాదగా వుండదు. ఈసారి మాత్రం రాధని ఏమైనా అన్నట్లు తెలిస్తే విషయం చాలా దూరం వెళ్తుంది" సీరియస్‌గా అంది కరుణ.

"మర్యాదగా వుండేదేమిటి? ఏం చేస్తావేమిటి?"

"మాట్లాడు, ఏం చేస్తామో తెలుస్తుంది"

"మీరు చేసినప్పుడు చూద్దాంలే! మీలాంటి వాళ్లని చాలామందిని చూశాను"

"చూసిన ఫేసే ఇది. ఏమైనా నోరు జారు, ఎదురుగా వున్న మమ్మల్ని చూసేదేమిటీ, ఎన్నడో పోయిన నీ తాతల్ని కూడా చూపిస్తాం" కరుణ అంది కోపంగా.

"మీరు అనవసరంగా ఎక్కువగా మాట్లాడుతున్నారు. నేను ఒకర్ని అనను. ఒకరు నన్నంటే వూరుకోను. నేను ఆ అమ్మాయిని అనలేదని చెపుతున్నాకదా!"

"మరి ఆ మాట మీదనే వుండు. ఎక్స్‌ట్రాలు పోవద్దు. ఇద్దరికీ బాగుండదు!"

"నేనేం ఎక్స్‌ట్రాలు పోవడంలేదు. మీరే



పోతున్నారు. నేను సినిమా పాట పాడుకుంటున్నాను. నా ఇష్టం" అన్నాడు రాజు.

"నీ ఇష్టం నీ ఇంటి దగ్గర! బజారులోనూ, పబ్లిక్‌లోనూ నా ఇష్టం అంటూ ఉన్మాదంతో వ్యవహరిస్తే ఎవరూ వూరుకోరు" కరుణ అంది.

"నేనేం ఉన్మాదంతో వ్యవహరించడం లేదు. నా ఇష్టం వచ్చినట్లు నేను పాడుకుంటాను. మీరు చేసేదేదో చేసుకోండెహె!" నిర్లక్ష్యంగా అంటూ సైకిల్ ఎక్కి వేగంగా తొక్కుకుంటూ వెళ్లిపోయాడు రాజు.

"ఎహై ఏమిటీ? చాలావుంది వీడి దగ్గర! మనల్ని చేసేదేదో చేసుకొమ్మంటున్నాడు. అయితే వీడికి పెళ్లి కావాలి కాబోలు! మరి పెళ్లి చేద్దాం" అంది రాధ.

కరుణ మహా ఆశ్చర్యపోయింది. ఎప్పుడూ నోరు విప్పి మాట్లాడి ఎరుగని రాధ చక్కగా, నిర్భయంగా, ధైర్యంగా మాట్లాడింది.

"నీవేనంటే మాట్లాడింది" కరుణ అంది.

"నాకు తెలియకుండానే మాటలు అవే వచ్చాయి కరుణా! ముందు నీవు అతన్ని నిలబడమన్నావు, అప్పుడు నాకు కాళ్లు ఒకటే వణికిపోయాయి. వాడి నక్క వినయానికీ, వాడు మాట్లాడే ధోరణికీ నాకు తెలియకుండానే కోపం వచ్చి మాట్లాడాను కరుణా!"

"అంతేనే! ఎప్పుడూ ముడుచుకుని కూర్చుంటే అలాగే వుంటుంది. ఈసారి ఇంకా ధైర్యంగా మాట్లాడతావు చూడు, అల వాటైపోతుంది" అంది కరుణ.

★ ★ ★

రాజూ వాళ్ల అమ్మమ్మకి బాగులేదని ఫోన్ రావడంతో ఆ రోజు రాత్రే అనుకోకుండా వూరు వెళ్లాల్సి వచ్చింది వాళ్ల కుటుంబం. తరువాత నాలుగు రోజుల వరకూ. వూరినించి రావడానికి వీలుపడ లేదు.

ఈ నాలుగు రోజులూ రాజు ఎంతో మథనపడ్డాడు. తను ఎదురు తిరిగి ఇంకా గట్టిగా మాట్లాడి వుండవలసింది అనుకున్నాడు.

తను అనవసరంగా భయపడ్డాడు. కరుణ అయితే... తనను ఏం చేస్తుంది?

తను చాలా పొరపాటు చేశాడు. ముందు వాళ్లని చూసి భయపడ్డాడు. తనకంటే వాళ్లదే పైచేయిగా మాట్లాడారు.

వాళ్ల విషయం తేల్చుకోవాలి. మగవాడినై వుండి వాళ్లని ఎదుర్కోలేకపోవడం ఎంత తప్పు!

ఎప్పుడెప్పుడు తిరిగి వూరు వెళ్దామా, వూరు వెళ్లి స్కూల్లో వాళ్ల విషయం తేల్చుకుందామా అని ఆతృతపడిపోయాడు.

ఇక్కడ క్లాసులో రాధ హాయిగా, నిశ్చింతగా వూపిరిపీల్చుకుంది.

"ఇక ఆ రాజుగాడు స్కూల్‌కి రాకపోతే బాగుండమ్మా! పీడా వదిలిపోతుంది" అని కరుణతో అంది రాధ.

ఐదో రోజున వూడిపడ్డాడు రాజు. ఉదయమే క్లాసుకి వచ్చాడు.

పిల్లలూ, టీచర్లూ ఇంకా రాలేదు.

రాధ, మరో అమ్మాయి క్లాసులో కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు. మగ పిల్లలు ఇద్దరు ముగ్గురు మినహాయించి ఎక్కువ మంది లేరు.

వచ్చిన వెంటనే బుక్స్ తన డెస్క్ దగ్గర పడేసి రాధ చెంతకి వెళ్లాడు రాజు.

"ఏమిటీ, మొన్న నువ్వూ, నీ ఫ్రెండూ ఏమిటో రెచ్చిపోతున్నారు. ఏం చేస్తారేమిటి మీరు? " రాధ బెంచ్ పక్కన నిలబడి అడిగాడు రాజు.

"నీవేం చేస్తావేమిటి? " గొంతు పెగల్చుకుని అంది రాధ.

"నేను. చేస్తానని నేనేం చెప్పలేదే! మీరే అన్నారు తాతల్ని చూపిస్తామనీ, మర్యాదగా వుండదనీ"

"అవును. దారిన పోయేవాళ్లని నోటికి వచ్చినట్లు మాట్లాడితే వూరుకుంటారేమిటి? '





"వూరుకోకపోతే వురిపెట్టుకోండి. ఎవరికీ అభ్యంతరంలేదు"

"మాకేం అంత అవసరం? నీవే పెట్టుకో వురి!"

"నాకేనా అవసరం? ఎక్కువెక్కువ మాట్లాడొద్దు. మొన్న ఏమిటో వార్నింగ్ అంటున్నారు. ఏం చేస్తారు మీరు? నేను నైన్త్ క్లాస్ చదివి వచ్చిన హైస్కూల్లో నన్ను చూస్తే టీచర్లకే టెర్రర్, హర్రర్! ఇక స్టూడెంట్స్ విషయం చెప్పేదేముంది? ఆఫ్టాల్ ఈ స్కూలెంత, మీరెంత? ఆ రోజు ఎందుకు పోనీలెమ్మని మౌనంగా వున్నాను. లేకుంటేనా"

"లేకుంటే ఏం చేసేవాడివి బోడి" ఒకవైపు భయపడుతూనే మాట్లాడుతోంది రాధ.

"బోడీనా? మళ్లీ మరోసారి అన్నావంటే నీకు ఈ బొచ్చు వుండదు. ఏమనుకున్నావో!" రాధ జడపట్టుకుని వెనక్కి గుంజి అన్నాడు రాజు.

"వదులు జడ" అని జడ లాక్కుంది రాధ.

"జాగ్రత్త!" అంటూ చూపుడు వేలితో హెచ్చరించి తన సీట్లోకి వెళ్లిపోయాడు రాజు.

క్లాసులోకి వచ్చిన ముగ్గురు మగపిల్లలూ, పక్కన కూర్చున్న అమ్మాయీ విచిత్రంగా చూశారు. ఎవరికీ నోటి మాట రాలేదు. అంతా రెండు మూడు నిముషాల వ్యవధిలోనే జరిగిపోయింది.

మూడు బెల్లులు అయ్యాయి. క్లాసులు ప్రారంభమయ్యాయి.

మూడో బెల్లు కొట్టేటప్పుడు కరుణ క్లాసులోకి వచ్చింది. అప్పటికే క్లాస్ టీచర్ కూడా వచ్చింది.

కరుణ రెండో బెంచ్‌లో కూర్చుంది. పక్కన కూర్చున్న అమ్మాయి చదువుతున్నట్లు ముఖానికి పుస్తకం అడ్డుపెట్టుకుని కరుణతో అంతకు పది నిముషాల ముందు జరిగిన విషయం మొత్తం చెప్పింది.

కరుణకి అంతులేని ఆగ్రహం కలిగింది.

రాధ చిన్నగా ఎక్కిళ్లు పెడుతూ ఏడుస్తోంది.

టీచర్ పాఠం చెప్పడానికి క్లాస్‌లోనే టెక్స్ట్ బుక్ చూస్తూ గుసగుసలు వినిపించడంతో ఆడపిల్లల బెంచ్‌వైపు చూసింది.

కన్నీళ్లు తుడుచుకుంటూ రాధ కనిపించింది. కళ్లు ఎర్రగా అయ్యాయి.

"ఏంటి రాధా... ఎందుకు ఏడుస్తున్నావు? ఏం జరిగింది? " అడిగింది టీచర్.

ఎక్కిళ్ల మధ్య రాధకి మాట రాలేదు.

"ఏం జరిగిందో చెప్పు. చెప్పకుండా ఎలా తెలుస్తుంది? "

"నేను చెపుతాను టీచర్" అంటూ కరుణ లేచి రాజు మీద చెప్పింది.

"ఏం రాజూ... నిలబడు" టీచర్ గదమాయించింది. రాజు నిలబడ్డాడు.

"ఆడపిల్లల జోలికి ఎందుకు వెళ్లావు? నీకేం పని వాళ్లతో? " కోపంగా ప్రశ్నించింది.

"నేను వెళ్లలేదు టీచర్. వాళ్లేమొన్న నాతో గొడవపడ్డారు టీచర్. నన్నే కదిలించి తిట్టారు!"

"ఏంటమ్మాయి? "

"లేదు టీచర్" అని కరుణ అంతకు ముందు జరిగిన విషయం మొత్తం చెప్పింది.

"వయసు పెరిగిందికానీ బుద్ధి పెరగలేదయ్యా! అసలు ఆడపిల్లల ప్రస్తావన నీకు ఎందుకు? వాళ్లని చూసి పాటపాడటం ఎందుకు? వాళ్లతో అసలు నీకేం అవసరం? " టీచర్ గద్దించింది.

"నేను అసలు పాడలేదు టీచర్. వాళ్లే కల్పించి చెపుతున్నారు!"

"వాళ్లు ఎందుకు చెపుతారు? వాళ్లకి ఇంకో పనిలేదా ఏమిటి? కొద్దిగా సంస్కారవంతంగా వుండటం నేర్చుకో. మనిషి పొడుగు పెరగడమే కాదు, కొంచెం బుద్ధి కూడా పెరగాలి. ఇలాంటి వెధవ్వేషాలు ఇక

ముందు ఎప్పుడూ వేయవద్దు"

"అదేంటి టీచర్ అలా అంటారు, నేనేం అనకపోతే!" బాధగా ముఖంపెట్టి ఏడుపు గొంతుతో అన్నాడు రాజు.

"సర్లే కూర్చో ఒకరి జోలికి ఒకరు వెళ్ల కండి. చదువు ఒక్కటే వుండదుకానీ ఇలాంటి వాళ్లకి వెధవకళలు అన్నీ బాగా వుంటాయి. ఇంకోసారి ఇలాంటి తప్పు జరిగితే మాత్రం వూరుకోను!" రాజుమీద కోప్పడింది.

"ఊరుకోమ్మా రాధా... ఏడవకు. ఇంత మాత్రానికే అలా ఏడిస్తే ఎలా?" , అని రాధని సముదాయించింది.

కరుణకి కోపం తగ్గలేదు. రాజుకి తగిన శిక్ష విధించాలనీ, మరోసారి ఏ ఆడపిల్లనీ అల్లరి పెట్టకుండా బుద్ధి చెప్పాలనీ మనసు తహతహలాడిపోతోంది.

ఆ క్లాసులో పదకొండు మంది ఆడపిల్లలు వున్నారు.

రీసెస్‌బెల్ సమయంలో ఆడపిల్లలు అందరూ రాధ చుట్టూచేరి ఓదారుస్తున్నట్లుగా మాట్లాడటం ప్రారంభించారు. కరుణ ఆ అవకాశాన్ని వినియోగించుకుంది.

"వాడు ఇవ్వాళ రాధని గొడవ చేశాడు. రేపు నన్ను చేస్తాడు. ఎల్లుండి నిన్ను చేస్తాడు. ఇప్పుడు వాడ్ని వూరికే విడిచిపెడితే వాడికి ఇక ఎదురు వుండదు. వాడికి గట్టిగా బుద్ధి చెప్పాల్సిందే మనం!" అంది కరుణ.

"అవును, వాడ్ని ఏం చేద్దాం?" ఒక మ్మాయి అడిగింది.

"మనం ఏం చేసినా ముందు ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేద్దాం!"

"ప్రిన్సిపాల్ ఏం చేస్తాడే! ఆయన పేరే దద్దమ్మాయె!"

"దద్దమ్మ అయినా ముందుగా మనవైపు నించి ఎలాంటి తప్పు జరక్కుండా వుండాలి. తరువాత నాతో ఎందుకు చెప్పలేదు అనే అవకాశం వుంది. రాధా... సాయంత్రం మీ నాన్నని తీసుకువచ్చి ప్రిన్సిపాల్‌తో మాట్లాడవే!"

"మా నాన్న అంత గట్టివాడు కాదు కరుణా! సమర్థుడుకాదు. పాతకాలం మనిషి. నన్ను ఇలా గొడవ పెట్టినట్లు తెలిస్తే మరో ఆలోచనలేకుండా చదువు మానుకొమ్మంటాడు. ఇప్పుడే స్కూల్‌కి ఎందుకు, చదివింది చాల్లే అని గొడవ. మా అమ్మకి ఏమో నన్ను బాగా చదివించాలని ఇష్టం. మా అమ్మ బలవంతం మీదనే నేను స్కూల్‌కి రాగలుగుతున్నాను. మా నాన్న అయితే చిన్నప్పుడే చదువు మానుకుని వుండేదాన్ని"

"పెద్దవాళ్లు వచ్చి మాట్లాడితే ప్రిన్సిపాల్ కూడా గట్టిగా వుంటాడని అన్నానే! మనం అయితే అంతగా ప్రాముఖ్యత ఇవ్వడు"

"మా నాన్నకి ఏమీ తెలియదు అని చెపుతున్నాను కదే! ఇలాగొడవ అయినట్లు కూడా తెలియకూడదు"

"మనం ఇప్పుడే వెళ్లి ప్రిన్సిపాల్‌తో మాట్లాడదాం. ఆయన ఏం అంటాడో ఏం చేస్తాడో చూద్దాం. తరువాతనే మన ప్రోగ్రాం" కరుణ అంది.

"ఇద్దరు ముగ్గురుకాదు, అందరం వెళ్లి మాట్లాడదాం" అంది రాధ.

"అలాగే" అంటూ వాళ్లు ప్రిన్సిపాల్ రూంలోకి వెళ్లారు.

వీళ్లు వెళ్లేటప్పటికి ఆయన సీట్లో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు.

ప్రిన్సిపాల్ సన్నగా, గాలివేస్తే పడిపోయేలా వున్నాడు. నెత్తిమీద ఒక్క వెంట్రుక లేదు. వృద్ధాప్యం వచ్చినట్లు ముఖంలో ముడతలు కనపడుతున్నాయి. గవర్నమెంటు సర్వీస్‌లో రిటైరయ్యి దాదాపు పదేళ్లు కావస్తోంది. మేనేజ్‌మెంట్‌కి అతి సమీపబంధువు కావడంతో ప్రిన్సిపాల్ పదవి ఇచ్చి కుర్చీలో కూర్చోపెట్టారు. ఆయన క్లాసులకి పెద్దగా వెళ్లడు.

"ఏమిటీ, అందరూ ఒకేసారి వచ్చారు.




ఎనీ ప్రోబ్లెం? " అడిగాడు ప్రిన్సిపాల్, పట్ట బోతున్న నిద్రకి భంగం కలిగించినందుకు ఒకింత అసహనంగా.

కరుణ జరిగిన విషయం వివరంగా చెప్పింది.

"అసలు అతనితో మీకేం పని? ఈ కాలంలో ఆడపిల్లలు ఆడపిల్లల మాదిరిగా వుండటం లేదమ్మాయి. మరీ ఓ పద్ధతీ, పాడూ లేకుండా తయారయ్యారు. అసలు మగపిల్లల ప్రస్తావన మీకెందుకు? "

"మేం ఏమీ పొరపాటుగా ప్రవర్తించలేదు సార్. అతను మమ్మల్ని చాలా అసభ్యంగా హేళన చేశాడు!"

"ఈ కాలపు కుర్రవాడుకదా! ఏదో సిని మాలో పాట పాడుకున్నాడేమో! అది మిమ్మల్నే అని ఎందుకు అనుకోవాలి? సర్లే నేను అతనికి చెపుతాలే! మీరు వెళ్లిపొండి. మీరు మాత్రం ఎవరి గురించీ పట్టించుకో కండి!"

"మేం ఎందుకు పట్టించుకుంటాం సార్? మీరు అతనికి మాత్రం స్ట్రాంగ్ పనిష్మెంట్ ఇవ్వాలి సార్! అతని ప్రవర్తన మారకుండా ముందు ముందు కూడా అలా వుంటే మీతో కూడా చెప్పం సార్, మేమే ఏదో చేస్తాం!" కరుణ సీరియస్‌గా అంది.

"అదేంటమ్మాయ్ అలా మాట్లాడతావ్? మీరే ఏదో చేసే పనయితే ఇక స్కూల్ ఎందుకూ? మేం ఎందుకూ? డిసిప్లిన్ వుండాలి. నేను అతనితో మాట్లాడతాను. మీరు వెళ్లిపోండి" అన్నాడు కొంచెం కోపంగా.

వీళ్లు రూంనించి వెలుపలకి రావడంతో ఆయన నిద్రాదేవికి ఆహ్వానం పలికాడు.

స్కూల్ చివరి పీరియడ్‌లో హోంబెల్ కొట్టడానికి ముందు రాజుని తన రూంలోకి పిలిపించాడు ప్రిన్సిపాల్.

"ఏంటోయ్! ఏ వూరునించి వచ్చి ఈ స్కూల్లో చేరావు? మీ నాన్న ఏం చేస్తుం టాడు? "

చెప్పాడు రాజు.

"ఏం క్యాస్టు? "

చెప్పాడు.

ప్రిన్సిపాల్‌కి కడుపు వుబ్బిపోయింది. తనదీ అదే! సేమ్ క్యాస్ట్ అన్నమాట!

"మీ నాన్న కానిస్టేబుల్. ఎంతో బాధ్య తగా వుండాల్సినవాడివి. ఆడపిల్లల్ని గొడవ చేస్తున్నావట ఏమిటి? "

"సత్య ప్రమాణకంగా నాకేం తెలియదు సార్. వాళ్లు కావాలనే నామీద కల్పించి చెపుతున్నారు"

"ఉదయం రాధ జడ పట్టుకుని లాగావట కదా? "

"మొన్న నన్ను బాగా తిట్టారు సార్! ఇవ్వాళ ఉదయం కూడా తిట్టింది సార్!"

"ఏమని తిట్టింది? "

"నన్ను బోడి అంది సార్. ఇంకా తిట్టేరు సార్!"

"స్కూల్లో గొడవపడటం ఏమిటి? ఏమైనా ప్రాబ్లమ్స్ వుంటే నాకు చెప్పాలి. నేను పరిష్కరిస్తానుకదా! ఇంకోసారి నీమీద కంప్లయింట్ వస్తే వూరుకునేది లేదు. స్కూల్‌నించి వెళ్లగొట్టాల్సి వుంటుంది"

"అది కాదుసార్"

"నాకు ఇక చెప్పకు. నేను మంచిగా వుంటే మంచే, చెడ్డగా వుంటే నా అంత చెడ్డ వాడు ఎవడూ వుండడు. వెళ్లిపో"

రాజు వినయంగా తలవంచుకుని వచ్చే శాడు.

దద్దమ్మ! ఈ దద్దమ్మ తనని ఏమీ చేయ లేదు. చేసేవాడు అయితే ఇప్పుడే కనీసం గట్టిగా తిట్టి అయినా వుండేవాడు. భయం లేదు. ధీమా ఏర్పడింది రాజుకి.

తనని ఎవరూ ఏమీ చేయలేరు. తేల్చుకో వాల్సిందే. తన మీద కంప్లయింట్ ఇచ్చిన వాళ్ల అంతు చూడాల్సిందే.

కరుణవాళ్ల ఫ్రెండ్స్ గ్రూప్‌లో పార్వతి అనే అమ్మాయి కూడా వుంది. పార్వతి కూడా పదవ తరగతే.

తరువాత రెండు రోజులకి పార్వతి ఒక్కతే స్కూల్‌కి వస్తోంది. స్కూలు బయట గేటు దగ్గర రాజూ, మరొకడూ నిల బడివున్నారు.

"పారూ... పారూ... ఈ దేవదాసుని అన్యాయం చేస్తావా పారూ... నీకిది ధర్మమా పారూ" పార్వతికి వినపడీ వినప డనంత దూరంలో వుండగా రాజు సినిమా హీరో ఫక్కీలో అన్నాడు.

పార్వతికి ఆ మాటలు స్పష్టంగా వినపడ లేదు. దేవదాసు, ధర్మమా అనే మాటలు మాత్రం వినబడ్డాయి. తనని హేళన చేస్తు న్నారని గ్రహించింది.

క్లాసులోకి వెళ్లిన తరువాత అదే విషయం కరుణకి చెప్పింది.

"వర్రీ కావద్దు పార్వతీ! వాడు పెద్ద రౌడీ ననుకుంటున్నాడు. వాడి పాపం పండే రోజులు దగ్గరపడ్డాయి. మన తడాఖా ఏమిటో చూపెడదాం!" అంది కరుణ.

తరువాత రోజు రాధ వస్తుంటే కూడా ఏదో కామెంట్ చేశాడు.

కరుణని గమనిస్తున్నాడు. కరుణతో ఢీకొందామని వుందికానీ ధైర్యం చాలడం లేదు. తను ఏమైనా ఒక మాట అంటే తక్షణం కరుణ రెండు మాటలు అంటుం దని ఒకవైపు భయపడుతున్నాడు. మరో వైపు ముందు కరుణనే పట్టాలి, అని వుంది. అప్పుడే తను హీరో అనిపించుకోగలడు.

కరుణని ఎలా ఏడ్పించాలా, ఎలా కసి తీర్చుకోవాలా అని చూస్తున్నాడు.

రాజు వెంట ఇంకా ఇద్దరు ముగ్గురు ఆక తాయిలు చేరారు. వాళ్లని చూసి రాజుకి చాలా గర్వంగా వుంటుంది. తన మాటలకి వాళ్లు ఆశ్చర్యపోతున్నారు.

తనని హీరోగా గుర్తిస్తున్న వాళ్ల ముందు తన గొప్పదనాన్ని ఇంకా ప్రదర్శించాలి. తన ధైర్యాన్ని, తన సాహసాన్ని వాళ్లు విచిత్రంగా, కథలుగా చెప్పుకోవాలి.

"రేయ్! నీ ధైర్యం ఎవరికీ లేదురా! మొగోడి వంటే నువ్వేరా! నీలాంటి వాళ్లని మేం ఇంతవరకూ చూడలేదురా!" సావాస గాళ్ల బృందంలో ఒకడు అన్న మాటలు రాజుకి గుర్తు వచ్చాయి. ఆ ఒక్కడే కాదు, దాదాపు మిత్రబృందంలో అందరి అభి ప్రాయం అదే! వాళ్లిద్దరికీ తను కింగ్!

"అందరికంటే ఎక్కువ గర్వం, పొగరు కరుణకి వుందిరా! కరుణకి గట్టి బుద్ధి చెప్పాలిరా! మిగతా వాళ్లందరూ ఒక ఎత్తు అయితే కరుణ ఒక్కతే ఒక ఎత్తు! కరుణకి గట్టి బుద్ధి చెప్పగలిగితే ఇక అందరికీ నువ్వంటే ఏమిటో తెలుస్తుందిరా!"



క్లాసులోనూ, విడిగానూ రాజు కరుణవైపు క్రోధంగానూ, తీక్షణంగానూ చూస్తున్నాడు. ఆ చూపుల్ని కరుణ గమనించింది. మొత్తా నికి ఏదో ఒకటి జరగబోతోందని భావిం చింది.

"ఎందుకైనా మంచిది, గట్టి తోలు చెప్పులు కొనుక్కోండే! అవి అయితే బాగుం టాయి" అని కరుణ స్నేహితురాళ్ళకి చెప్పింది.

కరుణ మాటల్ని అర్థంచేసుకుని వాళ్ళు నవ్వారు. "ఏం రబ్బరు చెప్పులు బాగుం డవా? " ఒక స్నేహితురాలు నవ్వుతూ అడి

గింది.

ఎప్పుడో ఒకసారి జరగవచ్చనుకుంటున్న సంఘటన అంత తొందరగా ఎదుర్కోవాల్సి వుంటుందని కరుణా వాళ్ళు భావించలేదు.

ఆరోజు సాయంత్రం గ్రౌండ్‌లో మగపిల్లలూ, ఆడపిల్లలూ ఎవరికి వాళ్ళే ఆడుకుని, ఇంటికి వెళ్తున్న సమయంలో రాజు, మరొకడూ స్కూలు ఎదురుగా రోడ్డుమీద వున్న చెట్టుకింద నిలబడి వున్నారు. వాళ్ళు అప్పటివరకూ ఆడుకుని వెనకవున్నవాళ్ళకోసం ఆగారు.

ఆటలంటే ఆసక్తిలేని పిల్లలు ఇంటికివెళ్ళారు.

కరుణకి ఆటలంటే మంచి ఇష్టం. ఆడపిల్లలు రెండు బ్యాచ్‌లుగా విడిపోయి, అప్పటివరకూ ఖోఖో ఆట ఆడుకున్నారు. ఒక బ్యాచ్‌కి కరుణ కెప్టెన్.

ఆట అయిన తరువాత పుస్తకాలు చంకన పెట్టుకుని సైకిల్ వున్నవాళ్ళు సైకిళ్ళమీదా, లేనివాళ్ళు నడిచీ ఇంటిదారి పట్టారు.

కరుణ సైకిల్‌కి గాలిపోయింది. పుస్తకాలు క్యారేజ్‌మీద పెట్టుకుని మిగతా ఆడపిల్లలతో కలిసి నడక మొదలుపెట్టింది.

వీళ్ళు చెట్టుని సమీపిస్తున్న సమయంలో రాజు అన్నాడు, "ఒరేయ్! మనం యానివర్సిరీకి నాటిక వేద్దాంరా, బాగుంటుంది"

"ఏం నాటిక ఏమిట్రా? "

"ప్రేమదాసుడు"

"బాగుంటుందా? "

"భలేవుంటుందిరా! డైలాగులు కూడా చాలా బాగుంటాయి. అందులో ఒక డైలాగ్ చెప్పనా? "

"చెప్పు, వింటా"

"ఈ ప్రేమదాసుడ్ని కరుణించవా? నీది ఇంతటి కఠినహృదయమా? అది హృదయమా? పాషాణమా? "

"పాషాణంకాదు, ఇది ఎడమకాలి భూషణం!" అంది కరుణ ఎడమకాలి చెప్పు తీసి చూపెడుతూ.

"మేం ఏదో నాటికలో డైలాగ్స్ చెప్పుకుంటుంటే మీకెందుకు? మేం మిమ్మల్ని ఏమైనా అన్నామా? "

"మేమూ మిమ్మల్ని అనలేదుగా? "

"మరి చెప్పు ఎవరికి చూపెడుతున్నారు? "

"మమ్మల్ని అన్నవాళ్ళకి చూపెడుతున్నాం"

"ఇక్కడ ఎవరూలేరు. మేం మిమ్మల్ని అన్నామని మాకేగా చూపెడుతున్నారు. మీకేకాదు చెప్పులున్నది, మాకూ వున్నాయి అంతకంటే గట్టివి" రాజు అన్నాడు.

"ఉంటే ఏంచేస్తావేమిటి? "

"నువ్వేం చేస్తావేమిటి? నిన్ను చూసి ఇక్కడ ఎవరూ భయపడడంలేదు"

"భయం ఎందుకు? "

"మరెందుకు చెప్పు చూపెట్టావే? "

"ఎందుకా, ఇలా కొట్టడానికిరా" అంటూనే మెరుపువేగంతో చెప్పుతో బలంగా రాజు చెంపమీద కొట్టింది కరుణ.

రాజు కూడా కొట్టడానికి కరుణ చేతిలో నుంచి చెప్పు లాక్కుంటూ తిరగబడ్డాడు.

ఆడవాళ్ళు అప్పుడు ఆరుగురున్నారు. ఇటువైపు రాజూ, మరొకడూ వున్నారు. ఆ మరొకడు కరుణ ఎప్పుడైతే కాలిచెప్పు తీసిందో అప్పుడే పరుగుపందెంలో ఫర్లాంగు అవతల వున్నాడు.

రాజు కండబలం చూపెట్టడానికి సిద్ధపడుతోంటే వాడు మహావేగంతో పిక్కబలం చూపెడుతున్నాడు.

రాజు ఎప్పుడైతే తిరగబడ్డాడో, అప్పుడే కరుణకి సపోర్ట్‌గా ఇతర ఆడపిల్లలు కూడా కదనరంగంలోకి దూకారు.

రాజు వాళ్ళని నెట్టడానికి ప్రయత్నిస్తుంటే వాళ్ళు రాజుని నెట్టేశారు. తోపులాటలో రాజు కిందపడ్డాడు.

కిందపడినవాడ్ని "మమ్మల్ని ఇంకోసారి ఇలా అంటావురా? ఇప్పుడు నీవు ఎవరికి చెప్పుకుంటావురా? రాధ నీకు పెదవి అందించాలా? చెప్పుల్ని నీ బుగ్గకి అందించవద్దా? " అంటూ చిత్తం వచ్చినట్టు

కొట్టడం మొదలుపెట్టారు.

చదువు మినహా మరో విషయం పట్టని ఆ పిల్లలు, ఇంటి దగ్గర దించిన తల స్కూల్లోనే ఎత్తే ఆ పిల్లలు ఆరోజు రాజుని చిత్తుచిత్తుగా కొట్టి వదిలిపెట్టారు.

స్కూల్లో గొడవని చూసిన విద్యార్థులు వూళ్ళోనూ, ఇళ్ళలోనూ కథలు కథలుగా చెప్పారు. చీకటి పడే సమయానికి వూరంతా విషయం తెలిసిపోయింది.

కన్నవాళ్ళూ, విన్నవాళ్ళూ ఈ సీన్‌కి సూత్రధారిగా కరుణని తేల్చారు.

"ఆ అమ్మాయి మగరాయుడే! గుండెపెద్దది. అఖండురాలు" అన్నారు పెద్దవాళ్ళు.

"డేరింగ్ డేషింగ్ డైనమిక్ లేడీరా! అలా వుండాలి ఆడపిల్లలంటే. ఈకాలం పిల్ల" అన్నారు కుర్రాళ్ళు.

★ ★ ★

చెప్పుదెబ్బలతో బుగ్గలు బూరెలుమాదిరి పొంగగా, యుద్ధంలో క్షతగాత్రుడైన సైనికుడిలా తీవ్రమైన బాధతో, అవమానంతో, ఆగ్రహంతో, క్రోధంతో ఏడుపుని దిగమింగుకుంటూ, వంచిన తల ఎత్తకుండా అతివేగంగా నడుచుకుంటూ ఇంటికి వచ్చిపడ్డాడు రాజు. ఆరోజు సైకిల్ వేసుకుని వెళ్ళలేదు.

వచ్చిన వెంటనే పుస్తకాలు మూలకి విసిరికొట్టి కాళ్ళు కూడా కడుక్కోకుండా, లోనికి వెళ్ళి డబుల్ కాట్ మంచానికి అడ్డంగా పడి ఏడవడం మొదలుపెట్టాడు.

వెనకదొడ్లో పప్పు రుబ్బుకుంటున్న వాళ్ళమ్మ కొంతసేపటికి వచ్చి కొడుకు అవతారం, ఏడుపు చూసి విసుగ్గా అడిగింది. "మళ్ళీ ఏం తెచ్చిపెట్టావు నాయనా ఇంటిమీదకి. ఎవరు కొట్టారు? "

తల్లినుంచి సానుభూతి లభించకపోవడంతో సమాధానం చెప్పకుండా ఏడుపుస్థాయిని పెంచాడు రాజు.

కొడుకు పోకిరీ వాడనీ, ఎప్పుడూ ఇంటిమీదకి ఏదో ఒక గొడవ తెస్తాడనీ ఆమెకు తెలుసు. తప్పు ఎక్కువగా కొడుకుదే అయి వుంటుందని ఆమె భావిస్తుంది గత అనుభవాలతో.

అయినా ఈ పరిస్థితిలో కోప్పడటం మంచిదికాదని, మనసు మార్చుకుని మళ్ళీ అడిగింది శాంతంగా. "ఎందుకు బాబూ ఏడుస్తున్నావు? ఏం జరిగింది? ఎవరైనా తిట్టారా, కొట్టారా? "

రాజునుంచి ఎక్కిళ్ళు పెరిగాయి తప్ప జవాబులేదు.

"చెప్పు నాన్నా... ఏం జరిగింది? ఎందుకు ఏడుస్తున్నావు? " లాలనగా అడిగింది.

"ఆడపిల్లలు అందరూ కలిసి నన్ను కొట్టారమ్మా"

"ఎందుకు కొట్టారు? ఎవరువాళ్ళు? "

"క్లాసులో పిల్లలమ్మా. నేను అసలు ఏంచేయలేదు. వూరికే కొట్టారు"

"ఊరికే ఎందుకు కొడతారు? వాళ్ళకేమైనా పిచ్చి పట్టిందేమిటి? "

"ఉత్త గర్వపోతులమ్మా! మేం నాటిక వేసుకుందామని రిహార్సల్స్ మాదిరిగా డైలాగులు చెప్పుకుంటుంటే, మమ్మల్ని గురించే మీరు అంటున్నారని కదిలించుకుని కొట్టారు"

"సరే రేపు మీ ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేద్దాంలే. న్యాయం, అన్యాయం విచారించి వాళ్ళమీద సీరియస్ యాక్షన్ తీసుకొమ్మని చెపుదాంలే" అని ఆమె కొడుకుని వూరడించింది.

రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో వాళ్ళ నాన్న డ్యూటీ దిగివచ్చాడు. అప్పటికి రాజుకి ఏడుపు తగ్గింది. స్నానంచేసి, భోంచేసి టీవీముందు ఆసీనుడయ్యాడు.

"ఎప్పుడూ ఆ టీవీముందు కూర్చుని ఆ చెత్త ప్రోగ్రాములు చూస్తుంటే నీకు ఇక చదువు ఏం వస్తుందిరా? రోజూ కొద్దిసేపు అయినా పుస్తకాలు తిరగేయ్" ఆయన వస్తూనే కొడుకుని మందలించాడు.

"వాళ్ళ స్కూల్లో ఇవ్వాళ ఏం జరిగిందను





కున్నారూ..." అంటూ భార్య ప్రస్తావన తెచ్చింది.

రాజు జరిగిన విషయం వక్రీకరించి, కల్పన జోడించి, తన నేరం ఏమీలేదూ, నేరం అంతా ఎదుటివాళ్ళదే అన్నట్లుగా కథ మలిచి చెప్పాడు.

"ఆడపిల్లలు కొడుతుంటే నువ్వేం చేశావురా? తిరగబడి వాళ్ళ దుమ్ము దులిపి వదిలిపెట్టకపోయావూ? "

"వాళ్ళు చాలామంది వున్నారు డాడీ. నేను ఒక్కణ్ణే"

"ఎప్పుడూ సినిమాలు చూస్తుంటావు. ఆ సినిమాల్లో హీరో ఏడెనిమిదిమందిని ఒకే దఫా కొట్టడం చూళ్ళేదూ? అలాగే వాళ్ళందర్నీ కలిపి తుక్కు రేక్కొట్టొచ్చుగా! నువ్వు మనిషివి కూడా పొడుగు పెరిగావుగా, ఎందుకూ? సరే, వాళ్ళెవరో నీకు తెలుసుగా? "

"అంతా మా క్లాసులోవాళ్ళే డాడీ. ఉత్త రౌడీగుంపు"

"నేను రేపు మీ స్కూల్‌కి వచ్చి మీ ప్రిన్సిపాల్‌తో మాట్లాడతాలే. వాళ్ళ విషయం నేను చూసుకుంటాను కానీ నువ్వు బాగా చదువుకో. ఇంక ఆ విషయం మనసులో పెట్టుకోవద్దు"

"వాళ్ళని తీసుకువచ్చి రెండురోజులు మీ లాకప్‌లో వేసి కుళ్ళబొడవండి డాడీ! అప్పుడు నా మనసు శాంతిస్తుంది"

"వాళ్ళ విషయం నేను చూసుకుంటాగా"

ఆ కన్నతండ్రికి చాలా బాధ కలిగింది, కోపమూ వచ్చింది.

రాజు తన ఎత్తు పెరిగాడు. అలాంటి వాడ్ని పట్టుకుని ఆడపిల్లలు కొట్టారంటే ఏమనుకోవాలి?

వాళ్ళని ఏంచేయాలా అని పరిపరి విధాల ఆలోచించసాగాడు. రాజుని స్టేషన్‌కి తీసుకుపోయి కేసు రిజిష్టర్ చేద్దామనుకున్నాడు.

"చిన్నపిల్లల గొడవకి కేసు రిజిష్టర్ వరకూ ఎందుకు? ఆ పిల్లల్ని స్టేషన్‌కి పిలిపించో, స్కూల్‌కి వెళ్ళో మందలించి వస్తే సరిపోయేదానికి" అంటాడు ఎస్. ఐ. ఆయన శాంతపురుషుడు.

తను స్టేషన్‌కి పిలిచికానీ, స్కూల్‌కి వెళ్ళికానీ వాళ్ళని నాలుగుదెబ్బలు వేయాలి.

వాళ్ళ తల్లిదండ్రులు ఏమంటారో, మా పిల్లల్ని కొట్టడానికి నీవెవరివి అంటారేమో. తను వెళ్ళి దండిస్తే పిల్లల తగాదాలలో పెద్దలు జోక్యం చేసుకున్నట్లు వుంటుంది.

తను ఆ పిల్లల్ని కొడితే ఒకవేళ ఆ పిల్లల తల్లిదండ్రులు ఉన్నతాధికారులకి రిపోర్ట్ చేస్తారేమో. ఇప్పటికే తనమీద పైఆఫీసర్లకి గొంతువరకూ ద్వేషం వుంది. తనని అణగదొక్కడానికి కొందరు అధికార్లు కాచుకుని వున్నారు.

తనమీద రిపోర్ట్‌లు పోయి, ఎంక్వయిరీలు జరిగి, తన వైపునుంచి తప్పు వున్నట్లు రుజువైతే తనని సస్పెండ్ చేయడానికి క్షణం ఆలోచించరు. ఇప్పటికే ఎప్పుడెప్పుడు తనని సాగనంపుదామా అని అధికార్లు కాచుకుని కూర్చున్నారు.

ఇది తన కొడుకు గొడవ! తనకి ప్రత్యక్ష సంబంధం వున్న విషయం.

ఆలోచిస్తే ఆ ఆడపిల్లల్ని ప్రస్తుతానికి వదిలిపెట్టడమే మంచిది. ఈ స్టేషన్‌లో కూడా తనమీద సదభిప్రాయం, సానుభూతి ఎవరికీలేదు. విషయం విషమిస్తే తనకి సాయం చేసేవాళ్ళు కూడా ఈ స్టేషన్‌లో ఎవరూలేరు.

అంతా డబ్బు మహాత్యం.

లంచాలు పుచ్చుకున్న వాటాలు పంచుకునే విషయంలోనే స్టాఫ్ మధ్య తగాదాలు.

స్కూల్‌కి వెళ్ళి వాళ్లని నాలుగు తిట్టి రావడం మినహాయించి ఇంకో మార్గంలేదు. వాళ్ళని తనుగా వెళ్ళి కొడితే సమస్య రావచ్చు పిల్లల విషయంలో జోక్యం చేసుకుని దౌర్జన్యం చేశాడని పై ఆఫీసర్లకి కంప్లయింట్ ఇస్తే తను ఇబ్బంది పడాల్సి

వుంటుంది.

నిన్ననే స్టేషన్ రైటర్‌కీ, తనకీ గొడవ జరిగింది. తప్పు తనదే అని స్టేషన్‌లో అందరి అభిప్రాయం. హెడ్ కానిస్టేబుల్ అనే గౌరవం కూడా లేకుండా రైటర్ తనని ఎదిరించి మాట్లాడటంతో కోపం వచ్చి తను ఒక దెబ్బ అతన్ని వేశాడు. అతను అప్పుడే కంప్లయింట్ రాసి ఎస్.ఐ.కి ఇవ్వడంతోపాటు పైకి పంపించాడు.

మళ్ళీ ఇదొక సమస్య. ఏమైనా ఈ ఆడపిల్లల విషయంలో కొంచెం జాగ్రత్తగా వుండాలి. ప్రస్తుతానికి వాళ్లని విడిచిపెడితే మంచిది.

అయితే తరువాత వాళ్ళని అంతకు అంత దెబ్బతీయాలి. వడ్డీతో సహా కక్ష తీర్చుకోవాలి. ఇప్పుడు తన జాతకం బాగోలేదు.

పాము పగ తనది. తాచుపాములాగే. నెమ్మదిగా, ఈ గొడవ సర్దుమణిగిన తరువాత, వాళ్ళని స్టేషన్‌కి వచ్చేలా చేసి, తన కొడుకుని కొట్టినందుకు తగిన మూల్యం చెల్లించుకునేటట్లు చేయాలి.

ఈ ఆలోచనలతో ఆయన మనసు శాంతించింది. ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయాడు.

మరుసటిరోజు ఉదయం ప్రిన్సిపాల్‌తో మాట్లాడివద్దామని స్కూల్‌కి వెళ్ళాడు.

"సారీసార్... పొరపాటు జరిగిపోయింది. ఆడపిల్లలు ఇంత గొడవ చేస్తారని అనుకోలేదు సార్. ఈసారికి విడిచిపెట్టండి. మళ్ళీ ఇలాంటి గొడవలు రాకుండా నేను చూస్తాను సార్" అని ప్రిన్సిపాల్ ఆయన కాళ్ళమీద పడినంత పనిచేశాడు.

"ముందు ఆ పిల్లల్ని ఇక్కడికి పిలిపించండి. మా వాడిది తప్పుంటే వాడ్ని నేను హెచ్చరిస్తాను. తప్పు ఎవరిదో ముందు తేలాలికదా"

"ఆడపిల్లలు. వాళ్ళు మిమ్మల్ని చూస్తే భయపడతారు. పొద్దున్న ఒకమ్మాయి ఫాదర్ వచ్చి సారీ చెప్పిపోయాడు. ఈసారికి ఇలా పోనివ్వండి సార్"

"నేను స్కూలు దగ్గరకి మావాడి ఫీజు చెల్లిద్దామని వచ్చాలేసార్. ఎలాగూ వచ్చాను కదా, నిన్నటి గొడవేదో తెలుసుకుంటే మంచిది అని ఆగాను. మావాడు మంచివాడు అని మేం అనడంలేదు. వీడిది కూడా లోపం వుండవచ్చు అయినా విషయం తెలియాలికదా" అని ఆయన కొడుకు ఫీజు చెల్లించి వెళ్ళిపోయాడు.

ఆ కానిస్టేబుల్ గురించి ప్రిన్సిపాల్, ఇతర స్టాఫ్ అంతకుముందు విన్నారు. పెద్ద గొడవ జరుగుతుందని స్టాఫ్, ప్రిన్సిపాల్ భయపడుతున్నారు. ఆయన ఎలాంటి రచ్చ గొడవ చేయకుండా వెనుదిరగడంతో వీళ్ళు ప్రశాంతంగా ఊపిరి పీల్చుకున్నారు.

★ ★ ★

రాజుని కొట్టడంలో సూత్రధారీ, అందులో ప్రధాన పాత్రధారీ తన కూతురే అని ఇరుగుపొరుగు చెప్పడంతో సరస్వతమ్మ గుండెలు బాదుకుంది.

"అమ్మో... అమ్మో... ఇది చూశారా ఎంతపనిచేసిందో" అని నోటికి చేయి అడ్డం పెట్టి కొట్టుకుంటూ భర్తకి చెప్పింది.

కూతురి ఘనకార్యాన్ని ఆయన ప్రశాంతంగా ఆనందంగా విన్నాడు. ఆయన పెదవులమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. విన్న తరువాత "అయితే అమ్మాయివాళ్ళు మంచి పని చేశారన్నమాట" అన్నాడు.

"ఏమిటి మంచిపనీ? ఆడపిల్లలు పోయి మగపిల్లవాడ్ని కొట్టడం మంచిపని అంటారా? మీకు తలకాయ వుందా, పోయిందా? ఇవ్వాళ వూరూ వాడా ఏమనుకుంటున్నారు? నోటికి ఎలా వస్తే అలా మాట్లాడుకుంటున్నారు"

"మాట్లాడుకోనీయ్. వాళ్ళనోళ్ళు వాళ్ళ ఇష్టం... మనం మాట్లాడుకోవద్దంటే ఆపుతారా ఏమిటి? "

"నీతో ఎందుకులే? అసలు నీవల్లనే అది ఇలా తయారుకావడం. అది తప్పు పనిచేస్తే





నువ్వు మంచిపని అంటున్నావంటే ఏమను కోవాలి? రానీ దాని పనిచెపుతా. కాళ్ళిర గ్గొట్టి మూలన కూర్చోపెడతా. బడి వద్దు. చదివినవరకూ చాల్లే" అని కూతురుకోసం ఎదురు చూడసాగింది.

కరుణ వచ్చిన తరువాత చెడామడా తిట్టింది. శంకరం వుండడంతో కరుణ బతి కి బయటపడింది కానీ లేకపోతే బాగా కొట్టి వుండేదికూడా.

కరుణ పేరు మాత్రం వూరంతా మారు మోగిపోయింది. జనం రకరకాలుగా కరు ణని గురించి చెప్పుకున్నారు.

★ ★ ★

కరుణ పదవతరగతి పరీక్షలు రాసింది.

వేసవికాలం. ఇంటిదగ్గర వూరికే వుండడం ఎందుకని, ఊళ్ళో టైప్ ఇన్స్టి ట్యూట్ పెడితే నేర్చుకుందామని రోజూ వెళ్తోంది. ఆ ఇన్స్టిట్యూట్‌లో మూడు టైప్ మిషన్లున్నాయి.

వాళ్ళు కరుణకి ఇచ్చిన టైం ఉదయం 11 గంటలనుంచీ 12 గంటలవరకూ.

పాత హరిజనవాడకి దగ్గరగా వుంటుంది ఆ ఇన్స్టిట్యూట్. ఆ హరిజనవాడలో అన్నీ చిన్న చిన్న పూరిగుడిసెలే. గుడిసెమీద గుడిసె వేసినట్లు అన్నీ ఇరుకు ఇరుకుగా వుంటాయి.

ఒకరోజు కరుణ టైప్ చేస్తుండగా బజా రులో గోల, అరుపులు, పరుగులు వినిపిం చాయి.

వీళ్ళూ లోపలనుంచి పరిగెత్తుకుని వాడ వైపు వెళ్తున్నారు.

జోరుగా పడమటిగాలి కొడుతోంది. ఎండ కూడా తీక్షణంగా వుంది.

కరుణ కూడా చూద్దామని వాడవైపు వెళ్ళింది.

సెగలు, పొగలు, అరుపులు, ఏడుపులు, హాహాకారాలు.

ఒక ముసలమ్మ వంట చేస్తుండగా, ప్రమాదవశాత్తూ తడికెలకి నిప్పు అంటుకుని మంటలు లేచాయి. ముసలమ్మ అదిగో ఇదిగో అనేటంతలోనే అవి వ్యాపించాయి.

బావులనుంచి నీళ్ళు అందుకుంటూ, తోట ల్లోని నీళ్ళు పోస్తూ జనం మంటలు ఆర్ప టానికి ప్రయత్నం చేస్తున్నారు కానీ ఆ నీళ్ళు మంటల్ని ఏమాత్రం ఆర్పలేకపోతున్నాయి.

కొంతమంది ఒక గుడిసెకి దగ్గరగా ఆందోళనతో నిలబడి వున్నారు. అక్కడ పదేళ్ళ అమ్మాయి భోరుమని విలపిస్తోంది. కరుణ ఆ గుంపు దగ్గరకు వెళ్ళింది.

"మా అబ్బాయి లోపల నిద్రపోతున్నాడు. మా అబ్బాయిని తీసుకురండి. మామ్మా, మయ్యా పనికిపోయారు" అని ఆ పిల్ల ఏడు స్తోంది.

మంటలు వేగంగా వ్యాపిస్తున్నాయి. ఆ గుడిసె దగ్గరకి మంటలు వస్తున్నాయి.

ఎవరికివాళ్ళే ఏంచేయడానికీ తోచక ఆందోళన పడిపోతున్నారు. చుట్టూ గుడి సెలు వున్నాయి. లోపలకి వెళ్తే అంత తేలి కగా బయటకి వచ్చే అవకాశంలేదు.

వీళ్ళు ఆ గుడిసెకి కొంచెం దూరంగా నిల బడివున్నారు. అక్కడ నిలబడితేనే వెచ్చటిసె గలు నిలవనీయడంలేదు. వెనక్కి వెనక్కి సర్దుకుంటున్నారు సెగధాటికి.

పదేళ్ళపిల్ల పెద్దగా ఏడుస్తూ కనపడినవా ళ్ళకి చెపుతూ అరుస్తోంది.

"అదేనామ్మాయి మీ గుడిసె? " కరుణ ఆ పాపని అడిగింది.

"అదేనక్కాయి. లోపల మావోడు నిద్రపో తున్నాడు. వాడు పసోడు. వాడికి తెలి యదు" అంది ఆ అమ్మాయి.

మంటలు మూడుగుడిసెల అవతల వున్నాయి. ఇంకా ఈ గుడిసెకి మంట అంటుకోలేదు.

మగవాళ్ళూ, ఆడవాళ్ళూ భయంతో అరుస్తూ ఆందోళన పడిపోతున్నారే తప్ప పిల్లవాడ్ని రక్షించే వుద్దేశ్యం ఎవరికీ వున్నట్లు కనిపించడంలేదు.

కరుణ మంటల్ని చూసింది. ఆ గుడిసెకి

మంట అంటుకోకపోయినా వెచ్చటి సెగ వెనక్కి తరుముతోంది.

ఇక కరుణ క్షణం ఆలస్యం చేయలేదు. క్షణం ఆలోచించలేదు. క్షణం భయపడ లేదు.

వేగంగా పరిగెత్తుకుంటూ గుడిసెవైపు వెళ్ళింది.

"అమ్మో... శంకరంగారమ్మాయి పిల్లోడ్ని తీసుకురావడానికి మంటల్లోకి పోతోంది. మంటల్లోకి పోతోంది" అని అక్కడ వున్న కొంతమంది అరవడం మొదలుపెట్టారు.

వేగంగా వెళ్ళిన కరుణ అదే మెరుపువే గంతో పిల్లవాడ్ని చేతుల్లో ఇరికించుకొని బయటకి తీసుకువచ్చింది.

పిల్లవాడ్ని బయటకు తీసుకురావడం, విసురుగా కొట్టినగాలికి ఆ గుడిసె అంటుకో వడం నిముషాల వ్యవధిలోనే జరిగింది.

పిల్లవాడ్ని తెచ్చిన కరుణ గుంపు దగ్గరికి సమీపించి స్పృహతప్పి పడిపోయింది. వళ్ళంతా చెమటలు ధారాళంగా కారిపోతు న్నాయి. బాగా రొప్పుతోంది.

కరుణకి మంటలు అంటుకోలేదుకానీ వాటి సెగకి స్పృహ కోల్పోయింది.

మంటలు చూడటానికి వచ్చిన వూళ్ళో వాళ్ళు మోటార్ సైకిల్ మీద కూర్చోపెట్టు కుని వెనుక ఒకరు కూర్చుని పట్టుకుని హాస్పిటల్ కి తీసుకుపోయారు.

డాక్టర్ చూసి భయపడాల్సిన పనిలేదని సెలైన్ పెట్టాడు. ఎవరో వెళ్ళి శంకరం వాళ్ళకి కబురు చేశారు.

"ఎంత పనిచేశావు తల్లీ... నీకెందుకు తల్లీ లేనిపోని బాధ? ..." అని ఇంటి దగ్గర నించే ఏడుస్తూ సరస్వతమ్మ హాస్పిటల్ కి వచ్చింది.

"ఏంకాదమ్మా... మంటల దగ్గరకి వెళ్ళింది కదా! ఆ సెగకి స్పృహ కోల్పోయింది. సాయంత్రానికి మామూలు మనిషి అవు తుంది. మీరేం వర్రీ కావాల్సినపనిలేదు" అని డాక్టర్ చెప్పాడు.

అయినా సరస్వతమ్మ నిగ్రహించుకోలేక కూర్చుని ఏడుస్తూనే వుంది.

సాయంత్రం ఆరుగంటలకి కరుణ తెలివి లోనికి వచ్చింది. తన చేతికి సెలైన్... పక్కన కళ్ళు తుడుచుకుంటూ అమ్మ... డాక్టరూ... హాస్పిటల్... ముందు అర్థంకా లేదు. తరువాత మంటలూ... తను పిల్ల వాడ్ని బయటకు తీసుకురావటం...అంతా గుర్తొచ్చింది. మరి తనకేమైంది?

కరుణ కళ్ళు తెరవటంతో బయటవున్న ఫ్రెండ్సూ, ఇరుగూ పొరుగూ లోనికి వచ్చారు.

"మీరు చూసి బైటకి వెళ్ళిపోండి. అమ్మా యికి బాగా గాలి రావాలి. మీరందరూ గుంపు కూడితే గాలి ఎలా వస్తుంది?" కంపౌండర్ విసుక్కుంటూ అన్నాడు.

నర్స్ వాళ్ళని సున్నితంగా బయటకు పంపిస్తోంది.

"ఎంతపని చేశావమ్మా! ఏకొంచెం పొర పాటు జరిగినా ఎంతపని అయివుండేది ఇవ్వాళ. నీవు మాకు దక్కేదానివికాదు" సంతోషం, బాధ రెంటితో కూడిన స్వరంతో అన్నాడు శంకరం.

స్నేహితులూ, స్కూల్లో పిల్లలూ, హరిజన వాడలోని వాళ్ళూ, స్కూల్లో టీచర్లు చాలా మంది వచ్చారు కరుణని చూసిపోవటానికి.

"ఎలా వుందమ్మా?" డాక్టర్ అడిగాడు.

"కొద్దిగా నీరసంగా వుంది డాక్టర్"

"తగ్గిపోతుందిలే" అని డాక్టర్ మందులు రాసి ఇచ్చాడు.

మరుసటిరోజు మధ్యాహ్నం కరుణని ఇంటికి పంపించారు.

ఆరోజు సాయంత్రం కరుణా వాళ్ళ ఇంటికి జీపులూ, కార్లూ వేసుకుని ఎంఎల్ఏ, ఎంఆర్ఓ, ఆర్డీఓ వచ్చారు. వాళ్ళ వెంట శాసన సభ్యుని పార్టీ కార్యకర్తల గుంపు.

శంకర్ వాళ్ళని సాదరంగా ఆహ్వానిం చాడు.




# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: *3000/–* పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

........ఏప్రిల్ చతుర నవల సాహసి ........................

**సమీక్షకుని పేరు :** ..........................................................

**చిరునామా :** ..........................................................

..........................................................

..........................................................

..........................................................

"పూర్తిగా తగలబడిపోయిన హరిజనవాడని చూడటానికి వచ్చాం సార్. వాడకి చాలా ఘోరం జరిగింది. చాలా నష్టం వాటిల్లింది. అక్కడ మేం చూస్తుంటే అందరూ మీ అమ్మాయిని గురించి చెప్పారు. ఇంత చిన్న అమ్మాయి అంత ధైర్యంగా మంటల్లోనికి వెళ్ళి బాబుని రక్షించడం అంటే చాలా గ్రేట్. కంగ్రాచ్యులేషన్స్ పాపా! గొప్ప సాహసం చేశావు" అని ఎంఎల్ఏ ప్రశంసించాడు.

ఎంఆర్ఓ, ఆర్డీఓ కూడా కరుణని మెచ్చుకున్నారు. అందరూ కూతుర్ని పొగుడుతుండటంతో శంకరం మహదానంద పడిపోయాడు. వచ్చినవాళ్ళందరికీ కూల్ డ్రింక్స్ తెప్పించి అతిథి మర్యాదలు చేశాడు.

"ప్రతి సంవత్సరం రిపబ్లిక్‌డే రోజున సాహస బాలలకి రాష్ట్రపతి చేతుల మీదుగా అవార్డులు ఇస్తారు. ఈ ఏడాది సాహసబాలల అవార్డ్‌కి కరుణ పేరు పంపిద్దాం. కలెక్టర్‌గారితో మేం ఈ విషయం డిస్కస్ చేసి గవర్నమెంట్‌కి రికమెండ్ చేస్తాం" అన్నాడు ఆర్డీఓ.

వాళ్ళు కరుణని "ఏం చదువుతున్నావు, ఎలా చదువుతుంటావూ? " అంటూ కుశల ప్రశ్నలతో కొంతసేపు మాట్లాడి, మళ్ళీ మరోసారి ప్రశంసించి వెళ్ళిపోయారు.



మరుసటి రోజు ఉదయమే కరుణ స్నానం చేసి బయటకు వెళ్లడానికి సిద్ధమవుతోంది.

"ఎక్కడికి పోవాలే ఇప్పుడు తయారవుతున్నావు? " అమ్మ అడిగింది.

"ఫ్రెండ్ ఇంటికి వెళ్లిరావాలమ్మా!"

"ఏ ఫ్రెండూ? అంత దెబ్బ తిని నిన్నా మొన్నా బాగులేక పడకవేసిన దానివి ఇప్పుడు వెళ్ళకపోతేనేం? ఏ ఫ్రెండో చెప్పు. ఎవరి ద్వారా అయినా పిలిపిస్తాను మన ఇంటికి"

"ఇద్దరు ముగ్గురు ఇళ్ళకి వెళ్ళి రావాల్లే అమ్మా! వెళ్ళి తొందరగా వస్తాకదా"

"నీమతం నీదేనే! అంత పెడసరం పనికి రాదు. పెద్దవాళ్ళు ఎందుకు చెపుతున్నారా అని ఆలోచించు. ఇంటిదగ్గర వుంటే నీకు ఏవి కావాలంటే అవి అన్నీ వండిపెడతా! నీకు ఇష్టమైన వెరైటీలు చెప్పు, చేసిపెడతా! చక్కగా గదిలో కూర్చుని టీవీ చూస్తూ ఒక్క దానివే తిను"

అమ్మ ఆలోచనకి నవ్వొచ్చింది కరుణకి. తను ఒక్కతే తినాలట. ఇంక ఎవరికీ పెట్టకూడదా?

"పనివుందిలేవే, తొందరగా వస్తా అని చెపుతున్నాకదా" అని కరుణ చెప్పుల్లో కాళ్ళు దూర్చి ఇంట్లోనించి బయటపడింది.

"మామాట ఎప్పుడు విన్నావు, ఇప్పుడు వినలేదు అనుకోవటానికి" అని ఆమె నిరసనగా అంది.

కరుణ నేరుగా పార్వతీ వాళ్ళ ఇంటికి వెళ్ళింది.

పార్వతి ఇంటికి ఇంకా ఎగువన రాధా వాళ్ళ ఇల్లు. ఇద్దరూ కలిసి వాళ్ళింటికి వెళ్ళారు.

రాధ, వాళ్ళ అమ్మ ఇద్దరూ విస్తళ్ళు కుట్టుకుంటున్నారు. వీళ్ళని చూసి "రండమ్మా... రండి" అంటూ సాదరంగా ఆహ్వానించింది ఆమె.

చిన్న నులకమంచం గోడవారగా నిలబెట్టి వుంటే వాల్చి " కూర్చోండమ్మా... కూర్చోండి" అంది.

"పర్లేదులే" బిడియంగా అంటూనే మంచంమీద కూర్చున్నారు.

"ఇంత ఉదయమే విస్తళ్ళపని పెట్టుకున్నారేమిటి? " కరుణ అడిగింది.

"ఉదయం ఏముందమ్మా? ముగ్గురి మనుషులకి వంట ఎంత పనీ? వీళ్ళ అన్నయ్య వూరికి వెళ్ళాడు. ఇంక మేం ముగ్గురమేకదా! ఎప్పుడో ఒక అరసోలెడు బియ్యం ఎసట్లో పోసుకుంటే ఎల్లోకొల్ల! ఎప్పుడు ఖాళీ దొరికితే అప్పుడు మాకు



ఇంక ఇదేపని" అంది రాధ అమ్మ.

"మనం రజనీ వాళ్ళ ఇంటికి వెళ్ళొద్దామే" అంటూ రాధని కూడా బయలుదేరతీసింది కరుణ.

ముగ్గురూ ఇంట్లోనించి బయటపడ్డారు.

"మనం హరిజనవాడకి వెళ్ళి చూసొద్దామే! చిన్నపిల్లలు కూడా అదేపనిగా చూసి వస్తున్నారు. మనమే చూడలేదు" అంది కరుణ.

"పోదాం పదండి" అంది రాధ.

"ఎందుకే మనం? చూసి ఏంచేస్తాం? " సంకోచిస్తూ అంది పార్వతి.

అయినా వీళ్ళు ముగ్గురూ, ఇంకా ఇద్దర్ని కలుపుకుని హరిజనవాడకి వెళ్ళారు.

చూస్తే ఏముంది? శ్మశానం.

నల్లగా మసిపట్టిన మొండిగోడలూ, బొగ్గులూ!

కొందరు ఆ మొండి గోడల్లో బొగ్గులు గెలుక్కుంటూ ఏవో ఏరుకుంటున్నారు.

"ఏం చేస్తున్నారు వాళ్ళు అక్కడ? " పార్వతి అడిగింది.

"ఇనుపసామాన్లూ, స్టీలు సామాన్లూ పూర్తిగా బూడిద కావు గదే! అలాంటివేమైనా దొరుకుతాయేమోనని చూసుకుంటున్నారేమో" అంది రాధ.

పల్లెలోని వాళ్లందరూ చెట్లకింద నివాసం ఏర్పాటుచేసుకున్నారు. పల్లెలో వున్న చెట్లే తక్కువ. ఒక్కో చెట్టు కింద ఐదారు కాపురాలు వుంటున్నాయి.

కరుణకి ఎంతో బాధ కలిగింది. "ఇంట్లో వున్న సామాన్లు అన్నీ తగలబడిపోయి వుంటాయి. ఎలా వంట చేసుకుంటారు? ఎలా తింటారు? సామాన్లు ఎక్కడ్నించి వస్తాయి? " అనుకుంది.

తగలబడిపోయిన ఇళ్ళు చూస్తూ, మాట్లాడుతూ ఒక చెట్టుకిందకు వెళ్ళారు.

ఎవర్ని కదిలించినా ఒకటే విషాదం, బాధ! ఆడవాళ్ళకి ఏడుపు మినహా మరో మాట రావడంలేదు.

"ఇదుగో, ఈ అక్కాయేనే మొన్న మన బుజ్జోడ్ని బయటకి తెచ్చింది" పదేళ్ళ పిల్ల వాళ్ల అమ్మకి చెప్పింది.

"నాకు ఎందుకు తెలియదూ? నేను నిన్నా, మొన్నా రెండు రోజులూ వాళ్ళింటికి వెళ్ళి ఆ అమ్మాయిని పలకరించి వస్తినే!" తల్లి ఆ పాపకి చెప్పి, వీళ్ళ దగ్గరకి వచ్చింది.

"నా బిడ్డకి మళ్ళీ జన్మ ఇచ్చావమ్మా! నువ్వు లేకపోతే మా బిడ్డ మాకు దక్కేది కాదమ్మా! నీ చలవవలనే ఇయ్యాల బిడ్డ బతికి బట్టకట్టిందమ్మా!" అంది కరుణవైపు ఆరాధనా పూర్వకంగా చూస్తూ.

"ఇక్కడ వుంటున్నారా మీరు? " కరుణ అడిగింది.

"ఇంక ఎక్కడ వుంటామమ్మా? అంతా బూడిదైపోయే! మంచాలూ, కంచాలూ, చెంబులూ, తపేళాలూ ఏమీ మిగల్లేదు. అన్నీ మాయదారి అగ్గిదేముడు తుడిచిపెట్టి తీసుకపోయాడు. ఉత్త మనుషులం మిగిలేం!" అంది ఆమె బాధతో ముక్కుచీదుకుంటూ.

ఆ చెట్టుకింద వున్న మగవాళ్లూ, ఆడవాళ్ళూ వీళ్ళచెంతకి వచ్చారు.

"ఎవరి పిల్లలూ మీరు? " వాళ్ళలో ఒకరు అడిగారు.

వీళ్ళు చెప్పారు.

"ఇలా చెట్టుకింద ఎంతకాలం వుంటారు? ఎలా వుంటారు? ఇల్లు కట్టుకోవాలి కదా!"

"ఇల్లా, మిద్దెలా? చిన్న పాక వేసుకుంటే అదే పదివేలు! పాక వేసుకోవాలన్నా కనాకష్టమే! బొంగులూ, కప్పుల ధరలు మండిపోతున్నాయి" అన్నాడు బాధగా.

"గవర్నమెంటు ఏమివ్వదా? "

"వాళ్ళు ఏం ఇస్తారు? మొన్న ఇంటికి పది కేజీల బియ్యం ఇచ్చిపోయారు. అవి మా పసిబిడ్డలకి సరిపోవు. రేపు 20 కేజీల బియ్యం ఇస్తారంట! తగలబడిన ఇంటికి ఐదు వందలు ఇస్తారంట! వాళ్ళు ఇచ్చే





డబ్బు ఏ మూలకి సరిపోతుంది? ఆ డబ్బు పెట్టి పందిరి కూడా వేసుకోలేం" అన్నాడు ఒక కుర్రాడు.

"తుపానో, గాలివానో వచ్చి ఇళ్ళూ, గుడిసెలూ కూలిపోయినా ఇన్ని బాధలు పడే వోళ్ళం కాదు. గుడిసెలు పోయినా చెంబులూ, తపేళాలూ గుడ్డలూ, గోచీలైనా మిగిలివుండేవి. ఇప్పుడు ఏం వుంది? సర్వం తుడిచిపెట్టుకుపోయే!" అంది ఒకామె.

వాళ్ళకి ఇల్లులేదు, వాకిలిలేదు, వుండటానికి నీడలేదు. అన్నం వండుకోవటానికి గిన్నె లేదు, తింటానికి కంచంలేదు. తాగడానికి గ్లాసు లేదు. పొయ్యిమీదకి బియ్యం లేవు, పడుకోవటానికి మంచాలు లేవు! దుప్పట్లులేవు! వాళ్ళకి ఏమీ మిగల్లేదు, మనుషులే మిగిలారు!

అగ్ని ప్రమాదం వలన ఎంత కష్టం సంభవించింది. వాళ్ళ జీవితాలే అస్తవ్యస్తం! వాటికి తోడు ఈ ప్రమాదం! కట్టుగుడ్డలతో మిగిలిపోయారు.

ఆకలికీ, హోరుమని వీస్తున్న వడగాలికీ పసిపిల్లలు భోరుమని విలపిస్తున్నారు. వాళ్ళ పరిస్థితి చూసి కరుణ చలించిపోయింది. కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

సాటి మనుషులుగా వాళ్ళకి తాము ఏమీ చేయలేమా? వాళ్ళని కొద్దిగా అయినా ఆదుకుంటే ఎంత బాగుంటుంది!

మిగతా పల్లె కూడా తిరిగి ఇంటిదారి పట్టారు. దారిలో కరుణ ఇదే విషయం వాళ్ళని అడిగింది.

"సహాయం చేస్తే చాలా బాగుంటుంది. అంతకంటే పుణ్యం మరొకటేమీ వుండదు. కానీ కరుణా! మనం ఏం సాయం చేయగలం చెప్పు? మా పరిస్థితి అయితే రెండురోజులు తింటే మూడోరోజు పస్తు! గుడిమీద మానాన్నకి వచ్చే ఆదాయం తెలుసుగా? మా అమ్మ కుట్టే విస్తళ్ళే మాకు ఆధారం. అయినా వాటిమీద ఎంత వస్తున్నాయి? " రాధ బాధ పడుతూ అంది.

"నేను మాత్రం ఏం సాయం చేయగలను రాధా? మనం ఒక్కరం ఇస్తే ఎంత ఇవ్వగలం? మనం ఇవ్వడం కాదు, వూళ్ళో వాళ్ళ చేత ఇప్పించాలి. మనం తొమ్మిదిలో వుండగా ఎక్కడో తుపాను వస్తే స్కూల్లో పిల్లలం, టీచర్లం అందరం ఇల్లిల్లూ తిరిగి వసూలుచేశాం గుర్తుందా? దుప్పట్లూ, పాత బట్టలూ, డబ్బూ చాలా వసూలుచేసి మన స్కూలు పేరుమీద కలెక్టర్‌కి పంపించాం. అలాగే ఇప్పుడు మనం వసూలు చేయలేమా? " కరుణ అడిగింది.

"మనకు ఎవరు ఇస్తారే? అప్పుడయితే టీచర్లు కూడా వున్నారు. వాళ్ళని చూసి మనకి ఇచ్చారు కానీ, మనం ఒక్కళ్లమే వెళ్తే మనకి ఏ మిస్తారే? " పార్వతి అంది.

"అప్పటిమాదిరిగా వేలు వసూలు చేయకపోయినా ఇప్పుడు పదిపైసలు అయినా ఇవ్వరా? ఎక్కడో దూరంగా వున్నవాళ్ళకి చెయ్యడంకాదే, ఎదురుగా మన కళ్ళముందు వున్న వాళ్ళకి చెయ్యాలి!"

"మనం చందాలకి తిరిగితే, పోయినసారి కంటే ఎక్కువే ఇచ్చే వాళ్ళుండవచ్చు. అయినా మనం వసూలుచేసి ఇచ్చేవి వాళ్ళకి ఏం సరిపోతాయి? "

"సరిపోవడానికి పరిమితి ఏముంటుంది రాధా? ఒక పూట ఒక పిల్లవాడికి అన్నం పెట్టగలిగితే చాలదా? అంతకంటే కావాల్సిందే వుంది? " అంది కరుణ.

"కానివ్వండి. రంగంలోకి దిగి వసూలు చేద్దాం. ఇచ్చేవాళ్ళు ఇస్తారు. వచ్చిన వరకే పంచుదాం!" అంది రాధ.

"మనం కొద్దిమందిమేనా? " నిరాశగా అంది పార్వతి.

"కొద్దిమంది పోతే ఏం బాగుంటుందే? ఫ్రెండ్స్‌నీ, తెల్సినవాళ్లనీ అందర్నీ కలుపుకుని పోదాం!" అంది కరుణ.

"మన బ్యాచ్ అందరితో మాట్లాడి రేపు ఉదయమే వూళ్లో తిరుగుదాం. మన జూని

యర్స్‌ని కూడా పిలుద్దాం. ఎక్కువ మందితో తిరిగితే బాగుంటుంది" అంది రాధ.



కరుణ వృధాగా డబ్బు ఖర్చుచేసే అమ్మాయి కాదు. తోటి పిల్లలు అందరూ గాజులూ, రింగులూ, క్లిప్పులూ అంటూ డబ్బు ఖర్చుపెడుతుంటారు. కరుణకి అలాంటివాటిమీద ఆసక్తిలేదు.

ఎప్పుడైనా, ఏదైనా అవసరం వస్తుందని అమ్మనీ, నాన్ననీ అడిగి తీసుకున్న డబ్బులు వాళ్ళకి తెలియకుండా జాగ్రత్తగా దాచిపెట్టు కుంది. ఆ డబ్బు మొత్తం తీసి లెక్కచూస్తే ఐదు వందల యాభైరూపాయలు వున్నాయి. ఇంకా ఐదు వందలు కావాలి.

ముందు తన వంతు చందాగా వెయ్యి రూపాయలు ఇవ్వాలి. మిగతా ఐదు వందలూ ఎలా జమచేయాలి? నాన్నని అడగటం మినహాయించి మరో దారి కనపడ లేదు.

అమ్మకి తెలియకూడదు. తెలిస్తే ఐదువం దలు కాదుగదా, ఐదు పైసలు ఇవ్వడానికి కూడా వప్పుకోదు. ముందు తనని ఇంట్లో నించి బయటకి పోనీయదు.





నాన్న ఏమంటాడో? చాలా విషయాల్లో మంచిగానే వుంటాడు.

ఇది డబ్బు విషయం. మాటలు చెప్పడం వేరూ, డబ్బు ఇవ్వడం వేరూ! డబ్బు దగ్గరకి వచ్చేసరికి చాలామంది అసలు రూపం బయటపడుతుంది.

అమ్మ లేకుండా చూసి అడగాలి. ఏమని అడగాలా అని మనసులో మననం చేసు కుంది. తను అడిగితే కాదనడు అనే ధీమా కూడా కరుణలో వుంది.

సాయంత్రం బిలబిలమంటూ కరుణావా ళ్ళింటికి అమ్మాయిలు వచ్చారు.

రాధ, పార్వతి తెల్సిన అమ్మాయిల్నీ, స్నేహితుల్నీ, ఇళ్ళపక్కన వాళ్లనీ అందర్నీ వెంటపెట్టుకు వచ్చారు.

శంకరం వేపచెట్టుకింద చల్లగాలికి కుర్చీ వేసుకుని సొసైటీ లెక్కలు చూసుకుంటు న్నాడు. ఇంట్లో అమ్మలేదు.

కరుణ శంకరం దగ్గరకి వెళ్ళింది.

"ఏమ్మా... ఏమిటీ వాళ్ళందరూ వచ్చారు?"

"మా ఫ్రెండ్సందరం ఒక ప్రోగ్రాం పెట్టు కున్నాం నాన్నా!"

"ఏమిటో?" నవ్వుతూ ముద్దుగా అడి గాడు.

"మొన్న పాత హరిజనవాడలో గుడిసెలు తగలబడ్డాయి కదా! వాళ్ళకి సాయంచేయడా నికి వూళ్లో తిరిగి ఏమైనా వసూలు చేద్దాం అనుకుంటున్నాం నాన్నా!"

"ఏం వసూలు చేస్తారు?"

"డబ్బులూ, బియ్యం, బట్టలు ఇంకా వూళ్ళోవాళ్లు ఏం ఇస్తే అవి!" అంటూ తం డ్రిని ఒప్పించి 500 తీసుకుంది.

తండ్రి ఇచ్చిన ఐదువందల రూపాయలూ, తన దగ్గర వున్న ఐదు వందలూ కలిపి వెయ్యి రూపాయలతో వసూళ్ళకి పెట్టిన నోట్‌బుక్‌లో మొదటగా తన పేరుతో రాసింది కరుణ.

పార్వతి రెండు వందలు రాసింది. నిజా నికి తను వందరూపాయలే ఇద్దామను

కుంది. కరుణ అంత పెద్ద మొత్తం రాయడంతో తన విరాళం మరీ తక్కువ అవుతుందనే వుద్దేశంతో పార్వతి రెండు వందలు రాసింది.

"మరి నువ్వు రాయి రాధా..." పార్వతి అడిగింది.

"నేనేం రాసేది? నేను రాస్తే తరువాత రాసే వాళ్ళందరూ నన్నే అనుసరిస్తారు. ఇక మనకి వసూళ్ళు అయినట్లే!"

"నీవు ఇస్తున్న డబ్బు ఎంతో అంతే రాయి రాధా..."

"నేను ముప్పయ్ రూపాయలు ఇద్దామనుకుంటున్నానే! ఈ డబ్బు కూడా నిన్న అంతా ఖాళీ దొరికిన సమయంలో నేనూ, మా అమ్మా ఇద్దరం కలసి శ్రమపడితే వచ్చిన డబ్బు!"

"ఆ ముప్పయ్యే రాయి"

"అలా రాస్తే రాధ అన్నట్లు వెనుక ఇచ్చే వాళ్ళందరూ తననే అనుసరిస్తారు. మనం గట్టిగా కూడా అడగలేం" అంది పార్వతి.

మిగతా పిల్లలు ఐదూ, పదీ, ఇరవై రాసి డబ్బులు ఇచ్చారు.

వీళ్ళు వెళ్ళి క్లాసులోనూ, స్కూల్లోనూ చదువుతున్న ఆడపిల్లలందర్నీ కలిసి చందాలు వసూలు చేద్దాం రమ్మని అడిగారు.

కొందరు వచ్చారు. చాలామంది తమకెందుకులే అని తప్పుకున్నారు.

ఆడపిల్లల వెంట మగపిల్లలు కూడా చేరారు. అందరూ ఒక గుంపుగా బయలుదేరారు. ఒక ఇల్లు కానీ, ఒక వ్యక్తినికానీ వదిలిపెట్టకుండా అందర్నీ అడగటం మొదలుపెట్టారు. మొదట్లో అడగటానికి కొంచెం ఇబ్బందిగా అనిపించినా, పదిమందిని అడగటంతో బెరుకు వదిలిపోయింది.

ఆడవాళ్ళు కొందరు ముక్కుమీద వేలేసుకున్నారు. "మీకేం పనీ పాటా లేదూ! మీరు అసలు ఆడపిల్లలేనా? " అని ముఖం మీదనే కొందరు అడిగారు.

మగవాళ్ళు కొందరు ఎగతాళి చేయడానికీ, హేళన చేయడానికీ ప్రయత్నించారు. అయితే వీళ్ళ అంకితభావం, నిస్వార్థత, నిబద్ధత ముందు వాళ్ళ ఆటలు సాగలేదు.

వసూళ్ళకి తిరగడం మొదలుపెట్టిన రెండోరోజు సరస్వతమ్మకి విషయం తెల్సింది. ఊళ్ళోకి వెళ్ళిన కరుణ వచ్చేవరకూ కోపంగానూ, అసహనంగానూ ఎదురు చూసింది.

కరుణ ఇంట్లోకి అడుగుపెట్టడమే ఆలస్యం సరస్వతమ్మ కోపంగా తిట్టడం మొదలుపెట్టింది.

"నీకు ఎందుకే ఈ అడుక్కుతినే పని? నీలాంటి సంఘసేవకులు వూళ్ళో ఎవరూ లేరా? ఆడపిల్లవి, ఆడపిల్ల పద్ధతుల్లో వుండు. మన ఇంటావంటా ఇలాంటి అలగా బుద్ధులూ, దరిద్రపు బుద్ధులూ లేవే! పెళ్ళికావాల్సిన ముండవి, ఇలా కొంపకొంప అడుక్కుతింటూ తిరుగుతావా? నిన్ను కాదే అనేదీ, లోకులు మమ్మల్ని ఆక్షేపిస్తారు. ఇక ఇంట్లోనించి బయటికి వెళ్ళావో కాళ్ళిరగ్గొట్టి మూలన కూర్చోపెడతా!"

కరుణ ఏమీ మాట్లాడలేదు.

"మాటా మూటా లేకుండా వుంటావు, చేసేపని చేసుకుంటూపోతావు. మాదిగోళ్ళ గుడిసెలు తగలబడితే వాళ్ళు ఇళ్ళంట తిరిగి అడుక్కోలేరూ? నీ మాత్రం చేతకాదూ వాళ్ళకి అడుక్కుతింటం, పెద్ద బయలుదేరింది వూరిమీదకి!"

ఇంతలో శంకరం బయటనించి వచ్చాడు.

"చూశారా, ఇది ఎంత పని చేస్తోందో! పోనీలే అని వూరుకుంటుంటే రోజురోజుకీ మరీ అడ్డగోలుగా తయారవుతోందండీ! దీనికెందుకూ ఇళ్ళంట తిరిగి డబ్బులు వసూలు చేయడం! హవ్వహవ్వ!" అని నోటికి చేయి అడ్డంపెట్టి కొట్టుకుంటూ మళ్ళీ అంది.

"పెళ్ళి కావాల్సిన పిల్ల! ఎంత నామర్దా! ఎంత తలవంపులు! నలుగురూ ఏమనుకుంటారు? "

"ఏమనుకుంటారేమిటి? " తాపీగా అడి

గాడు శంకరం.

ఆ అడగటం కరుణని సమర్థించటంగా తోచింది సరస్వతమ్మకి.

"మీరు మాత్రం అమ్మాయి విషయంలో జోక్యం చేసుకుంటే వూరుకోను! మీరు పద్ధతిగా అయినా పెంచండి, లేకపోతే తప్పుకొండి, దీని విషయం నేను చూసుకుంటా! మందలించాల్సింది పోయి వెనకేసుకువస్తారూ? ఏమన్నా అర్థంవుందీ? "

"ఒక్కొక్కరిది ఒక్కో తీరు సరూ! ఒకరు వున్నట్లు ఒకరు ఎలా వుంటారు? మదర్ థెరిస్సా వుంది, ఎవరు చేయమంటే చేసింది జీవితాంతం సంఘసేవ? తనకి అలా చేయడం ఇష్టం కనుక చేసింది. ఆమెని ప్రపంచం గుర్తించిందీ, గౌరవించిందీ, సత్కరించిందీ, కీర్తించింది! నోబెల్ ప్రయిజ్ కూడా వచ్చింది"

"నీ కూతురికి కూడా వస్తుంది ప్రయిజు, ఎందుకు రాదూ? రేపు ఆ మాదిగోళ్ళు ఇస్తారు!"

"ఏమో... రేపు రాష్ట్రపతి చేతులమీదుగా ఢిల్లీలో అవార్డ్ అందుకుంటుందేమో!"

"మనకి అవార్డులు వద్దూ, ఏం వద్దూ! ఇది మాత్రం బయటికి పోతే ఇక వూరుకోను! పెళ్ళి కావాల్సిన పిల్ల వూరిమీదపడి ఇల్లిల్లూ తిరగడమేనా? "

సరస్వతమ్మ రుసరుసలాడుతూనే వుంది. కరుణ తన పని చేసుకుపోతూనే వుంది. మూడు రోజులు వూళ్లో తిరిగారు.

మూడోరోజు సాయంత్రం వసూళ్ళకి తిరగడం ఆపుచేశారు.

అప్పటికి వసూలైనవి లెక్కచూస్తే పదహారువేల రూపాయల డబ్బూ, మూడుబస్తాల బియ్యం, నలభై ఐదు పాత దుప్పట్లూ వసూలు అయ్యాయి.

అనేక అనుభవాలు కూడా వీళ్ళకి కలిగాయి.

"అయ్యో పాపం!" అని బాధితులమీద సానుభూతి వ్యక్తంచేసిన వాళ్ళు కొందరు వుంటే, "జరగాల్లే, అంతమాత్రం జరక్కపోతే అసలు వాళ్ళు మాట వింటారూ? " అని ఈసడించిన వాళ్ళూ వీళ్ళకి తగిలారు.

కొందరు అడిగిన వెంటనే తమకి తోచింది ఇచ్చారు. కొందరు సవాలక్ష ప్రశ్నలు వేసి, సవాలక్ష సందేహాలతో ఇచ్చారు. వాళ్ళు ఎన్ని ప్రశ్నలు వేసినా అన్నిటికీ ఓపికగా, సహనంగా జవాబులు చెప్పారు.

"మనం అనుకున్నదానికంటే ఎక్కువగానే వసూలు అయ్యాయి. ఇవి ఎలా పంచాలి?" కరుణ అడిగింది.

"వసూలు చేయటమే సులభం, పంపిణీ చేయటమే కష్టం! అందరికీ న్యాయం జరగాలి. సమంగా పంపిణీ చేయాలి. కొందరికి పంచి, కొందరికి పంచకపోతే మాట వస్తుంది. మాట రాకుండా, ఎవరూ వేలెత్తి చూపెట్టకుండా పంచాలంటే ఇబ్బందే!"

"అవును... పక్కవాడికి వచ్చి తనకి రాకపోతే వాడికి కోపం వస్తుంది. నోటికి వచ్చినట్లు మాట్లాడవచ్చు కోపంలో! మొన్న మనం చూశాం కదా గవర్నమెంటు బియ్యం కొందరికి ఇచ్చి, కొందరికి ఇవ్వకపోతే ఎలా బూతులు తిడుతున్నారో!"

"పల్లెలో వాళ్ళు మనకి పూర్తిగా తెలియదు. పంపిణీ సమయంలో నోరున్న వాళ్ళే ముందుగా తీసుకుపోయే అవకాశం వుంది. ముందుగా మనం ప్లాన్‌చేసుకుని, ఆచి తూచి జాగ్రత్తగా పంచాలి" కరుణ అంది.

"కొద్దిగా ఆస్తిపాస్తులు కలిగిన వాళ్ళు కొందరు వున్నారు. వాళ్ళకి ఇప్పుడు పెద్దగా సమస్య వుండదు. అసలు ఏమీలేని నిరుపేదలు చాలామంది వున్నారు. ఇప్పుడు వాళ్ళకి తిండి సమస్య! పస్తులు వుంటున్న వాళ్ళు వున్నారు. అలాంటి వాళ్ళని గమనించి న్యాయంగా పంచాలి. ముందు మనం పల్లెలోనికి వెళ్ళి చిన్న సర్వేచేసి, కొన్ని విషయాలు తెలుసుకోవాలి" పార్వతి

ప్రతిపాదించింది.

ఆరోజు సాయంత్రం అందరూ పల్లెలోనికి వెళ్ళారు. వివరాలు మొత్తం సేకరించారు. దాని ప్రకారం అన్ని పంపకాలు న్యాయంగా జరిగేలా చేశారు.

★ ★ ★

"కరుణా... సరూ... ఇలా రండి తొంద రగా!" బాగా ఉదయమే బయట వున్న కుర్చీ మీద కూర్చున్న శంకరం పిలిచాడు, అరిచి నట్లుగానే.

లోపల పనిచేసుకుంటున్న సరస్వతమ్మ, మంచంమీదనించి కిందకి దిగని కరుణ ఆ పిలుపుకి పరిగెత్తినట్లే బయటకి వచ్చారు.

"ఏమైందండీ, ఎందుకు పిలిచారు? " సర స్వతమ్మ అడిగింది.

"ఏంకాలేదులే, ఆందోళన పడకండి. సంతోషకరమైన వార్తే" అంటూ పేపర్ చేతికి ఇచ్చాడు. రోజూ ఆయనకి నిద్రలేచి పేపర్ చూడటం అలవాటు.

ఆరోజు దినపత్రిక జిల్లా ఎడిషన్‌లో మొదటి పేజీలో బాక్స్ కట్టి పెద్ద వార్త రాశారు. ఫొటోలు కూడా వేశారు.

"ప్రాయం చిన్న... పరోపకారం మిన్న" అనేది శీర్షిక. అందులో కరుణ కలర్ ఫొటో ఒకటీ, కరుణతో పాటు చాలామంది పిల్లలు వూళ్ళో చందాలు వసూలు చేస్తూ తిరుగు తున్న కలర్ ఫొటో వేసి వార్త రాశారు.

"చూడు అమ్మాయి గురించి ఎంత గొప్పగా రాశారో! ఫొటో కూడా వేశారు" అన్నాడు ఆయన ఆనందంగా.

"ఇదేనా సంబడం? వాళ్ళు ఎవరో ఏదో రాస్తే మనకి ఏమైనా ఒరిగిందా? ఏదో రాస్తారు! రాసినంత మాత్రాన మనకి ఏమైనా ఒరుగుతుందా? " అంది సరస్వ తమ్మ నిరసనగా.

"ఒరగాలేమిటి? వూళ్ళో మన అమ్మా యిని గూర్చి చెప్పుకుంటే చాలదూ? "

"ఇవ్వాళ ఏంఖర్మ? రోజూ చెప్పుకుం టూనే వున్నారు. ఇవ్వాళ ఏమైనా కొత్తా? పెళ్ళి కావాల్సిన పిల్ల. ఇలా నలుగురి నోళ్ళలో నానితే బాగానే అవుతుంది పెళ్ళి"

"అబ్బ సరూ... మాట్లాడితే పెళ్ళీ పెళ్ళీ అంటావు. జీవితంలో పెళ్ళి తప్ప మరో అంశం ఏమీ వుండదా? మంచిపని చేసినా పెళ్ళికాదా? చెడ్డపని చేస్తే ఎలాగూ కాదని అంటావనుకో! నువ్వు పెళ్ళి గూర్చి తప్ప ఇక దేన్ని గురించీ ఆలోచించవా? " శంకరం కోపంగా అన్నాడు.

సరస్వతమ్మ తగ్గింది. "మీతో వాదన ఎందుకుగానీ ఆ పేపర్ ఇలా పడెయ్యండి, చూద్దాం ఏం రాశారో" అని పేపర్ తీసు కుంది.

కరుణ ఫొటో చక్కగా వుంది. ఫొటో కింద సాహసబాలిక అని రాశారు.

వార్తలో అగ్ని ప్రమాదంలో పిల్లవాడ్ని కాపాడిన దగ్గర్నించీ, చందాలు వసూలుచేసి పేదలకు పంచిపెట్టడం వరకూ వివరంగా రాశారు. కరణామయి అనీ, సాహసబాలిక అనీ, ధీరవనిత అనీ ఇలా అనేక రకాల పొగడ్తలతోనూ, అభినందనలతోనూ ముంచెత్తారు. వార్తకంటే అందులో కరుణని ప్రశంసించిన పాలు ఎక్కువగా ఉంది..

"ఫొటో చాలా చక్కగా తీశారమ్మాయి. అచ్చులో కూడా ఫొటో బాగా వచ్చింది" అన్నాడు శంకరం.

కరుణ తల్లి మీదకి వంగి పేపర్ చూస్తోంది.

"పేపర్‌లో ఇలా వార్త వస్తుందని ఎందుకు చెప్పలేదమ్మా? "

"ఏమో... ఎప్పుడు వస్తుందో, అసలు వస్తుందో, రాదో నాకేం తెల్సు నాన్నా? మొన్న ఫొటో కావాలన్నారు. తీసుకోమ న్నాను. అంతకుమించి నాకేం తెలియదు"

"నిన్న సాయంత్రం బస్టాండు దగ్గర శ్రీకాంత్ కనిపించి నాతో మాట్లాడాడు అమ్మాయి. అతనే ఈ పేపర్ విలేకరి. కనీసం అతనయినా మాటమాత్రం ఇలా వార్తవస్తుందని నాతో చెప్పలేదమ్మా!"

"అలా చెప్పవచ్చో చెప్పకూడదో పేపర్ వాళ్ళ రూల్స్ ఎలా వున్నాయో మనకేం తెల్సు నాన్నా? ఫొటో తీసుకుని కూడా మూడు రోజులైంది. ఇవ్వాళ వచ్చింది వార్త!"

"ఈ ఫొటోలో వాళ్ళంతా ఎవరే? నాకు పార్వతి తప్ప ఇంక ఎవరూ గుర్తుచిక్కడం లేదు!"

చందాలకి తిరుగుతున్న ఫొటోలో వాళ్ళు ఎవరో చెప్పింది కరుణ.

"రాములవారి గుడి పూజారి కూతురు రాధ కూడా వూళ్ళో తిరిగిందన్నమాట! వాళ్ళ నాన్న వూరుకునే వాడు కాదే! తెలిసి నట్లు లేదు. తెలిస్తే నాలికమీద వాతపెట్టే వాడు"

"లోకంలో రకరకాల మూర్ఖులు వుంటా రమ్మా! అలాంటి మూర్ఖుల్ని గూర్చి చెప్పుకో వడం టైంవేస్ట్! చక్కగా చదువుకునే అమ్మా యిని చదువు మానుకో మానుకో అని రోజూ గొడవేనట ఇంట్లో!"

"అలాగామ్మా? "

"అవును నాన్నా! వాళ్ళ అమ్మ తన ప్రాణం పోయినా వప్పుకుంటా కానీ అమ్మా యిని మాత్రం చదువు మాన్పించే ప్రసక్తి లేదని గట్టిగా చెప్పింది. రాధ కూడా ఎంత బాగా చదువుతుందో నాన్నా. చదువులో చాలా శ్రద్ధ చూపిస్తుంది.!"

"ఇదేం దేశనాయకురాలా, గొప్పదనా పేపర్‌లో రాయడానికి! వాళ్లకి ఇంకో పని లేదు గాబోలు!" అంటూ సరస్వతమ్మ నిరస నగా పక్కనే వున్న కుర్చీమీదకి పేపర్ విసి రివేసినట్లు వేసి విసవిసా ఇంట్లోకి వెళ్ళిపో యింది. పైకి డాంబికంగా అలా మాట్లా డినా, కూతుర్ని గూర్చి పేపర్‌లో ఘనంగా రాయడంతో ఆమెకి మనసులో సంతో షంగానే వుంది.

శంకరం పేపర్ అందుకుని మళ్ళీ మరో సారి ఆ వార్తని చదివాడు. అందులో తన పేరు కూడా రాశారు. ఫలానా శంకరం కుమార్తె కరుణ అనీ, చేసే ప్రతి పనికీ తండ్రి ప్రోత్సాహం, సహాయసహకారాలు వుంటాయని కరుణ చెప్పినట్లు రాశారు.

"ఈ న్యూస్ బాగా రాశారమ్మాయి. కవి తాత్మకంగా కూడా వుంది!" అన్నాడు శంకరం.

ఇంతలో ఆయన స్నేహితుడు ఆంజనే యులు నోట్లో వేపపుల్ల పెట్టుకుని, ఒక చేత్తో పేపర్ పట్టుకుని "ఏమోయ్ శంకరం... మన అమ్మాయిని గురించి ఇవ్వాళ న్యూస్ పేపర్‌లో వేశారోయ్!" అంటూ వచ్చాడు. అది మరో దిన పత్రిక. అందులో కూడా కరుణని గురించి రాశారు.

ఆ వార్తకంటే ఈ వార్త చాలా చక్కగా వుందనీ, బాగా రాశారనీ చెప్పుకున్నారు.

పేపర్‌లో వార్తలు కూడా రావడంతో కరుణ వూళ్ళో చర్చనీయాంశం అయింది. ఎక్కువ మంది కరుణని గురించి మెచ్చు కుంటూ మాట్లాడారు. చాలాకొద్దిమంది మాత్రం "ఆ అమ్మాయి మగరాయుడేరా! అన్నీ మగ బుద్ధులే! ఆడపిల్లకి వుండాల్సిన లక్షణాలు లేవు" అన్నారు.

కరుణ ఎవరి మాటల్నీ పట్టించుకోలేదు.

★ ★ ★

పదవతరగతి ఫలితాలు వచ్చాయి.

అనుకున్నట్లుగానే కరుణ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యింది. మంచి మార్కులు వచ్చాయి.

రాధకి జిల్లాలో మూడవ ర్యాంకు వచ్చింది.

రాధకోసం రెసిడెన్షియల్ కాలేజీల వాళ్ళు తమ కాలేజీలో చేరమని తిరగడం మొదలు పెట్టారు. చదువుతోపాటు భోజన వసతులు కూడా ఉచితంగా సమకూరుస్తామని చెప్పారు.

రాధ తండ్రి ససేమిరా కాదన్నాడు. ఆయన పూర్తి ఛాందసుడు. చాదస్తంతో పాటు భయంకర మూర్ఖత్వం కూడా మూర్తీభవించిన వాడు. ఇతరులు చెప్పేది ఆలకించడు. తన ధోరణే తనది. తను




పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అని బండగా, మొండిగా వాదించడంలో వెను కంజ కూడా వేయడు.

"ఆడముండలకి చదువు ఎందుకండీ అసలు? కాలం మారిపోయింది కాబట్టి, ఏదో నాలుగు అక్షరం ముక్కలు నేర్పించా నుకానీ అంతకుమించి మాకు కుదరదు. అదీ ఆడపిల్ల పొరుగూళ్ళో వుండి చదువుకో వడం అంటే మాటలా? అసలు అది జరిగే పని కాదు" అన్నాడు.

"చదువుకుంటా నాన్నా! రెసిడెన్షియల్ కాలేజ్ వాళ్ళు బాగా చెపుతారు. వాళ్ళు డబ్బు కూడా ఇవ్వొద్దంటున్నారు కదా! భోజనం కూడా వాళ్ళే పెడతారు. మీకు నా ఖర్చుకూడా తగ్గిపోతుంది. నన్ను పంపించు నాన్నా!" అని బతిమాలింది.

"నిన్ను ఎక్కడికో పంపించి చదివిస్తా! మరి తరువాత ఏం చేసేదీ? పెళ్ళి చేసే పని లేదా? నువ్వు బియ్యేలూ, ఎంయేలూ చదివితే రేపు నీ అంత చదివినవాడ్ని తీసు కురావాలంటే అది మాకు అయ్యే పనేనా?"

"అది కాదండీ..." అని భార్య నోరు తెరి చింది.

"ఛత్... నోరుముయ్... మీకేం? చెపు తారే. రేపు పెళ్ళీ పేరంటం చేయాలంటే అంత తేలికకాదు. ఇప్పుడు బాగానే వుంటుంది. దేనికైనా ముందు ఆలోచన వుండాలి!" అని ఆయన భార్య నోరు తెరిచీ తెరవకముందే గర్జించాడు.

మూడు రెసిడెన్షియల్ కాలేజీల వాళ్ళు రాధని తమ కాలేజీలో చేర్పించమని అడిగి, ఆయన ధోరణికి నిరాశతో వెనుదిరిగిపో యారు.

ఊళ్లో జూనియర్ కాలేజీ వుంది. అది గవర్నమెంట్ కాలేజీ.

తరువాత నాలుగు రోజులకి రాధ ఊళ్ళో కాలేజీకి వెళ్తాననీ, పొరుగూరు పంపించక పోయినా కనీసం వూళ్లోకి అయినా పంపిం చమనీ, ఇంటర్మీడియట్ వరకైనా చదువు చెప్పించమనీ తండ్రిని బతిమాలింది. ఏడ్చింది. అన్నం తినకుండా ఒక రోజు నిరా హారదీక్ష చేసింది.

రాధ తల్లి కూడా కూతుర్ని సమర్థిస్తూ భర్తతో తగాదా పెట్టుకుంది. ఆమెకి కూతుర్ని బాగా చదివించాలని గట్టికోరిక.

చివరికి ఆయన వూళ్ళో కాలేజీలో కూతుర్ని చేర్పించడానికి అంగీకరించక తప్ప లేదు.

కరుణ స్నేహితురాళ్ళలో ఇద్దరు మాత్రం పట్టణంలో వున్న రెసిడెన్షియల్ కాలేజీల్లో చేరారు. కొందరు మానుకున్నారు. ఎక్కువ మంది వూళ్ళో కాలేజీలో చేరారు.

"ఏమ్మా... నువ్వు ఏ కాలేజీలో చేరు తావు?" అని మొదట్లో కరుణని అడిగాడు శంకరం

ఆయనకి కూతుర్ని ఏదైనా మంచి కాలే జీలో చేర్పించాలని వుంది. అందుకే అడి గాడు.

"నీ ఇష్టం నాన్నా! ఏ కాలేజీలో చేరినా ముందు మనం బాధ్యతతో చదువుకోవాలి. మన వూరి కాలేజీలో కూడా బాగానే చెపు తున్నారు. ఇక్కడ కూడా చాలామందికి బాగానే మార్కులు వచ్చాయి!"

"అది కాదమ్మా... ఏదైనా మంచి కాలే జీలో చేర్రాదూ? ఇంటర్మీడియట్ అంటే చాలా ముఖ్యం. ఇది కీలకం అన్నమాట!"

"మన కాలేజీలో మంచి స్టాఫ్ వున్నారు నాన్నా! దూరపు కొండలు నునుపులనీ, దూరంగా వున్న ఏ రెసిడెన్షియల్‌లోనో చేరి వేలకి వేలు ఫీజులు కట్టడం అనవసరం అనిపిస్తోంది. రెసిడెన్షియల్స్‌లో చదివిన వాళ్లు చాలామంది ఫెయిలయ్యారు కూడా!" అని ఎవరెవరు ఆ కాలేజీల్లో చదివి ఫెయి లయ్యారో ఆ వివరాలు చెప్పింది. ఊళ్ళో కాలేజీలో చదివి మంచి మార్కులు తెచ్చు కున్న వాళ్ళ విషయం కూడా చెప్పింది.

కరుణని ఎలాగైనా డాక్టర్ కోర్స్ చదివిం చాలని శంకరం కోరిక. పెద్ద అమ్మాయి

కాపురం అలా అయింది. ఇక కొడుకు వున్నాడంటే వాడు ఎందుకూ పనికిరాని వాడు. ఒక్క అక్షరం ముక్క రాదు. ఒక పనికి బాధ్యుడుకాదు. కరుణ మీదే ఆయన ఆశలు అన్నీ వున్నాయి.

"అది కాదమ్మా..." అని నసిగాడు శంకరం.

"నీ ఇష్టం అని ముందే చెప్పాను కద నాన్నా! నీ ఇష్టప్రకారమే వెళ్తా! నువ్వు ఏ కాలేజీలో చేరమంటే ఆ కాలేజీలో చేరి చదువుకుంటా! నాదేం లేదు" అంది కరుణ.

"ఊరు వదిలిపెట్టి ఎక్కడికో వెళ్ళడం ఎందుకండీ, తిన్నది అరగలేదూ! ఇక్కడ కూడా చదువు బాగానే వుందంటోంది కదా అమ్మాయి. ఇక్కడే చేర్పిస్తే సరిపోతుంది. దానికోసం ఆలోచనలూ, తర్జనభర్జనలూ ఎందుకు?" అని తేల్చిపారేసింది సరస్వతమ్మ.

అలా కరుణ వూళ్ళో కాలేజీలోనే చేరింది. రాధ కూడా చేరింది.

కరుణ రాధా వాళ్ళ ఇంటికి వెళ్తోంటే రాధ నాన్న చిర్రుబుర్రులాడుతున్నాడు. కరుణమీద ఆయనకి మంచి అభిప్రాయంలేదు. కరుణ ఎదురుగా మాట్లాడే ధైర్యం లేకపోయినా చాటుమాటుగా చిందులు వేస్తున్నాడు.

"ఆ అమ్మాయితో నీకేం పనే అసలు? ఆ అమ్మాయి ఎలాంటిదనుకుంటున్నావు? మనకి సరిపోయేవాళ్ళతో మనం స్నేహం చేయాలికానీ ఇలాంటివాళ్లతో స్నేహాలు చేస్తే త్వరగానే బాగుపడతావు" అని ఆయన రాధమీద కోప్పడ్డాడు చాలాసార్లు.

వీళ్ళు చందాలు వసూలు చేసే సమయంలో .ఆయన వూళ్ళో లేడు. ఆయన అన్న మరో వూళ్ళో దేవాలయంలో పూజారి. ఆ వూళ్ళో వేసవికాలంలో దేవుడి సంబరాలు జరుపుతుంటే, తోడుగా వుంటాడనీ, రమ్మని కబురుచేస్తే అప్పుడు ఈయన అక్కడికి వెళ్లాడు.

అక్కడ్నించి వచ్చిన తరువాత కూతురు కరుణతో కలిసి తిరిగిన విషయం తెల్సింది. హరిజనవాడకి పోయినందుకూ, ఊళ్ళో తిరిగి చందాలు వసూలు చేసినందుకూ కూతుర్ని తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టాడు.




కరుణది స్నేహ స్వభావం. ఎవరితో అయినా ఇట్టే కలిసిపోతుంది. అందరితోనూ మంచిగానూ, గౌరవంగానూ వ్యవహరిస్తుంది.

ఎవరికి ఏ ఆపద, ఏ అవసరం వచ్చినా వెనకా ముందాలోచించకుండా తక్షణం తనకి చేతనయినంతలో సాయపడాలని చూస్తుంది. ఇలాంటి మంచి ప్రవర్తన వలనే కరుణకి కాలేజీలో ప్రత్యేకమైన గుర్తింపూ, గౌరవం లభించింది.

ఫీజులు తక్కువ, మంచి కాలేజీ, మంచి అధ్యాపకులు వుండటంతో చుట్టుపక్కల గ్రామాలనించే గాకుండా దూరపు గ్రామాలనించి కూడా చాలామంది విద్యార్థులు కాలేజీలో చేరారు. మగపిల్లలు ఎంతమంది వున్నారో ఆడపిల్లలు కూడా అంతమందీ వున్నారు.

మగబిడ్డలకి వేలాది రూపాయలు ఫీజులు చెల్లించి రెసిడెన్షియల్స్‌లో చది




వించే మధ్యతరగతి తల్లిదండ్రులు ఆడపిల్లల వద్దకి వచ్చేసరికి గవర్నమెంటు కాలేజీలవైపు చూడటం సహజమైపోయింది. అందువలనే ఆ కాలేజీలో ఆడపిల్లలు అంత ఎక్కువమంది వున్నారు. ఆ పిల్లలు అందరికీ కరుణ అంటే అభిమానం ఏర్పడింది.

కాలేజీకి ఎన్నికలు వచ్చాయి.

కొద్దిమంది మగపిల్లలకి విద్యార్థి సంఘం పదవులు చేజిక్కించుకోవాలనే కోరిక వుంది.

సీనియర్ విద్యార్థులు చాలామంది, జూనియర్ విద్యార్థులు అందరూ ప్రెసిడెంట్ పదవికి కరుణని పోటీ చేయమని ప్రతిపాదించ్చారు. కరుణకి పోటీ చేయాలని అంతగా ఆసక్తిలేదు.

ప్రిన్సిపాల్ తన రూంకి కరుణని పిలిపించి, ప్రెసిడెంట్ పదవికి పోటీకి నిలబడమని వ్యక్తిగతంగా అడిగాడు.

"నువ్వయితే బాగుంటుందమ్మాయి. సేవాదృక్పథం కలిగిన దానివీ, సమర్థురాలివీ! విద్యార్థుల్లో పలుకుబడి వుంది నీకు. నువ్వు పోటీ చేస్తే ఏ సమస్యా లేకుండా వుంటుంది"

"ఆలోచించి చెపుతాను సార్"

కరుణ ఇంటికి వచ్చి వాళ్ళ నాన్నకి విషయం చెప్పింది.

"క్లాస్‌మేట్స్ అందరూ వుండమంటున్నారు కదా! ప్రిన్సిపాల్ కూడా అడిగాడు. ప్రెసిడెంట్‌గా వుండరాదూ, ఏమవుతుంది? " అన్నాడు శంకరం.

తరువాతరోజు కరుణ ప్రెసిడెంట్‌గా ఏకగ్రీవంగా ఎన్నికైనట్లుగా ప్రకటించారు. కరుణ వద్దని వారిస్తున్నా స్నేహితుల బృందం కాలేజీలో స్వీట్లు పంచారు.

అది కాలేజీ విద్యార్థి సంఘ ఎన్నికల చరిత్రలో అపూర్వం. ఒక ఆడపిల్ల ప్రెసిడెంట్‌గా ఎన్నికకావడం కాలేజీ చరిత్రలో అదే తొలిసారి. పోటీలేకుండా ఏకగ్రీవంగా ఆ పదవిని స్వంతం చేసుకోవడం కూడా అదే తొలిసారి. అలాగే సీనియర్స్‌ని కాదని జూనియర్ పదవిని కైవశం చేసుకోవడం కూడా అదే తొలిసారి.

ఈ మూడు రికార్డులతో కరుణమీద విద్యార్థుల అభిమానం రెట్టింపైంది.

★ ★ ★

స్వర్ణ గ్రామం కాలేజీకి 12 కిలోమీటర్ల దూరంలో వుంది.

ఆ వూరినించి 22 మంది విద్యార్థులు కాలేజీకి వస్తున్నారు. వాళ్ళలో ఎనిమిది మంది మగ పిల్లలయితే, 14 మంది ఆడపిల్లలు.

వాళ్ళలో వనజ, రాజారావు కూడా వున్నారు. ఇద్దరూ ఒకటే సెక్షను. ఎప్పుడూ మాట్లాడుకుంటూ వుంటారు. ఇరువురివీ వేరువేరు కులాలు.

రాజారావు ఎక్కువగా సినిమాలు చూస్తుంటాడు. ఒక సినిమా హీరోకి అభిమాని. ఆ హీరో ఎన్ని రకాల వేషాలు వేస్తుంటాడో రాజారావు కూడా అన్ని రకాల వేషాలు వేస్తుంటాడు వస్త్రధారణతోసహా.

వనజతో బాగా చనువుగా వుండాలని ప్రయత్నిస్తున్నాడు.

"ఐ లవ్ యూ వనజా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే పెళ్ళిచేసుకుంటాను!" అన్నాడు ఒకరోజు రాజారావు చనువుగా.

"ఇప్పుడు పెళ్ళేమిటి? చదువులు పూర్తికావాలి కదా!"

"చదువుకుంటూనే ప్రేమించుకుందాం. తరువాత పెళ్ళి చేసుకుందాం"

"ఇంట్లో తెలిస్తే ఇద్దర్నీ కాళ్ళిరక్కొట్టి మూలన కూర్చోపెడతారు. చదువులు మానుకుని గొడ్లు కాసుకోవాల్సిందే"

"ఇంట్లో ఎందుకు తెలుస్తుంది? తెలియకుండానే ప్రేమించుకుందాం"

"ఇప్పుడు కాదులే రాజారావు. ముందు చదువుకోవాలి. చదువు అయిపోయిన తరువాత వుద్యోగం చేయాలి. నాకు చిన్నప్ప

ట్నించీ వుద్యోగం చేయాలని గట్టికోరిక. ఎందుకో నాకు వుద్యోగం అంటే చెప్పలేనంత ఇష్టం. ముందు ఉద్యోగం సంపాదించటమే నా జీవితాశయం అనుకో! అప్పటివరకూ మాట్లాడవద్దు. ఉద్యోగం వచ్చిన తరువాతనే ఏ విషయం అయినా!" ఉద్వేగంగా చెప్పింది వనజ.

సమాజం దృష్టిలో వనజకంటే రాజారావుది పెద్దకులం. కొద్దోగొప్పో ఆస్తిపాస్తులు వున్నాయి. రాజారావు నాన్న డబ్బు మూటకి ముడిమీద ముడివేసి జాగ్రత్తగా కూడబెట్టే రకం.

రాజారావుతో వనజ ఎప్పటిలా మామూలుగానే మాట్లాడుతోంది. అతను మధ్యలో చాలాసార్లు తన ప్రేమ విషయం గుర్తుచేశాడు. వనజ అంతకుముందు చెప్పిన విషయమే స్పష్టంగా చెప్పింది.

రాజారావు వదిలిపెట్టకుండా అడుగుతుండటంతో చివరికి వనజ సందిగ్ధంలో పడింది.

అతని ప్రేమని తిరస్కరించాలో, అంగీకరించాలో అర్థంకాలేదు. అయితే తొందరపడదలుచుకోలేదు. అతని ప్రవర్తన ఎలా వుంటుందో, స్వభావం ఎలాంటిదో పరిశీలించి మంచిచెడ్డలు విచారించాలనుకుంది. అతనికంటే తక్కువ కులంలో వున్న తనని చేసుకోవడానికి ఎంత ధైర్యం కలిగినవాడో గమనించి తన అభిప్రాయం చెప్పాలని వనజ భావించింది.

రాజారావు విసుగులేకుండా అడుగుతుండటంతో మనసులో కలిగిన అభిప్రాయం వలన వనజ మౌనం వహించింది.

తిరస్కారం లేకుండా మౌనం వహించడంతో రాజారావు ఉత్సాహ పడిపోయ్యాడు. వనజ తనని ప్రేమిస్తున్నట్లే ఆనందంలో తేలిపోయాడు.

ఒకరోజు ఉత్సాహం పట్టలేక తన వూరి క్లాస్‌మేట్స్‌కి చెప్పాడు. "వనజా, నేనూ ప్రేమించుకుంటున్నాంరా! వనజ నన్ను గాఢంగా ప్రేమిస్తోంది. నేను కూడా వనజని గాఢంగా ప్రేమిస్తున్నారా!"

"శుభం! శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు!" దీవించాడొక మిత్రుడు.

"గాఢంగా అంటే ఎలాగురా?" మరో కోణంగి ప్రశ్న.

"నీ ముఖం, వనజ నిన్ను ప్రేమించడం ఏమిట్రా?" మరొక మిత్రుడు హేళనగా అన్నాడు.

"ఏం... దానికేమైనా కొమ్ములు వచ్చాయేమిటి? నాకు ఏం తక్కువ? అందంలేదా, ఆస్తిలేదా, చదువులేదా?"

"నేటి ప్రియురాలిని, రేపటి భార్యని పట్టుకుని అదీ ఇదీ అనకూడదురా! కళ్ళు పోతాయి!"

"బైట వాళ్ళని అంటే కళ్ళుపోతాయికానీ, భార్యని అంటే పోవులేరా! అది తరతరాల భారతీయ సాంప్రదాయం కదా!"

మిత్రుల మాటని పట్టించుకోకుండా "నాకేంరా? ఏం నాకు?" రెట్టించాడు రాజారావు.

"నీకు అన్నీ వున్నాయి. వాళ్ళకేమున్నాయి? ముందు మీ అయ్యకి తెలిస్తే నీకు వనజతో కాదు, బడితెతో చేస్తాడు పెళ్ళి! అసలే ఆయన పిసినిగొట్టు పేరయ్య! లెట్రిన్‌గుంటలో పదిపైసల బిళ్ళ పడితే వంగి కుడిచేత్తో తీసుకుని కళ్ళకద్దుకునే రకం!"

"నువ్వు వనజని ప్రేమించడం నిజమే కానీ, నిన్ను వనజ ప్రేమించడం మాత్రం బుస్సే!"

"వనజ అసలు అలాంటిది కాదురా! మనకి వీడు చెవుల్లో పువ్వులు పెడుతున్నాడ్రోయ్"

"నిజంరా!" అన్నాడు రాజారావు.

మిత్రులు కిసుక్కున నవ్వారు.

"సరే నమ్మకపోతే పోండ్రా! మీరు నమ్మితే ఎంతా, నమ్మకపోతే ఎంతా?"

"నువ్వు వనజని ప్రేమిస్తున్నట్లు మేం




నమ్ముతాం కానీ, వనజ నిన్ను ప్రేమిస్తు న్నట్లు మాకు రుజువు ఏమిట్రా? "

"ఏం రుజువు కావాలిరా? "

మిత్రులు ఆలోచించారు.

"నువ్వు ఆ అమ్మాయిని ముద్దుపెట్టుకోవాలిరా! వనజ కూడా ప్రేమిస్తోంది కాబట్టి ఏం అనదు కదా!"

"అంతేనా? ఇప్పటికి ఎన్నోసార్లు ముద్దు పెట్టుకున్నారా? ఇదేం పెద్దలెక్కా! క్షణంలో పని!"

"ఆ క్షణంలో పనే, మేం చూసేటట్లు పెట్టుకోవాలి. అదీ మాకు సాక్ష్యం!"

"అవును... అంతేకానీ నువ్వు మాట్లాడి వచ్చి, నేను ముద్దుపెట్టుకున్నానంటే మాకు నమ్మకం ఏమిటీ? "

"సరే కానివ్వండ్రా, మీరు చెప్పినట్లే పెట్టుకుంటాను. అయితే మీరు దూరంగా అయినా వుండాలి, చాటుగా అయినా వుండాలి? "

"ఒకవేళ నువ్వు ముద్దుపెట్టుకోలేక పోతే? "

"పెట్టుకుంటానంటున్నా కదా! పెట్టుకోలేక పోతే... పందెం పెట్టుకుందాం"

"అంతేరా! పందెమే. ఎంత పెట్టుకుందాం"

"నేను ఓడిపోతే మీకు వెయ్యి రూపాయలిస్తా! మీరు ఓడిపోతే నాకు ఐదువందలు ఇవ్వండి చాలు!" రాజారావు అన్నాడు.

"మరి మాటమీద నిలబడతావుగా? "

"నేను మాట అంటే మాటేరా! డబ్బులు ఎప్పుడు కలుపుదాం? "

"మేం ఐదు వందలే కదా! ఒక్కొక్కరం వంద రూపాయలు వేసుకుంటే సరిపోతాయి. నీదే మరి ఆలస్యం!"

"నేను రేపు కానీ, ఎల్లుండి కానీ డబ్బు చూస్తాలేరా! డబ్బు కలుపుకున్న తరువాతనే పందెం!"

"అంతేరా మరి!"

"నాకు ఐదువందల రూపాయలు వస్తున్నాయి. మీరు చూస్తూ చూస్తూ డబ్బు పోగొట్టుకుంటారు. మీరు ఓడిపోతారు. పందెం మానుకోండి!" బెదిరించాడు రాజారావు.

"మాకు వందరూపాయలు లెక్కలోనివి కాదులేరా! ముందు నువ్వు వెయ్యి రూపాయలు చూసిపెట్టుకో!" అన్నారు మిత్రులు.

ఆరోజునించీ రాజారావు వనజతో స్నేహం ఎక్కువ చేశాడు.

హోటల్‌నించి నాలుగులడ్లు, బూంది కొనుక్కుని టిఫిన్ బాక్స్‌లో పెట్టుకుని తెచ్చి ఇచ్చి అన్నాడు, "మా అమ్మ చేసింది వనజా... తీసుకో".

"నాకెందుకు రాజారావు! నువ్వు తినరాదూ!"

"నీకోసమే తెచ్చా! తిను"

"ఎప్పుడూ ఇలా తీసుకురావద్దు రాజారావు! బాగుండదు" అంది వనజ.

"దప్పికగా వుంది. కూల్‌డ్రింక్ తీసుకుందాంరా!" అని వనజ వద్దని వారిస్తున్నా, అక్కడే వున్న షాపు వద్దకి తీసుకుపోయాడు.

"నాకు ఇవి తాగడం అసలు ఇష్టం వుండదు. ఏముంటాయి ఇందులో చక్కెర నీళ్ళు తప్ప!" అని వనజ వద్దు, వద్దంటున్నా ఆ నీళ్ళు తాగే వరకూ బలవంతపెట్టాడు.

వనజకి పందెం విషయం చెప్పాలని శత విధాలా ప్రయత్నిస్తున్నాడు. అయితే ధైర్యం చాలడంలేదు.

తనని ప్రేమిస్తున్నట్లు ఒక్కమాట చెబితే చాలు! కాబోయే భార్యని ముద్దుపెట్టుకుంటే తప్పేముంది?

రాజారావు వంకర్లు తిరిగిపోతున్నాడు. చెప్పాలని చూస్తున్నాడు. మళ్ళీ భయంతో గుటకలు మింగుతున్నాడు.

ముందు పందెం విషయం చెబితే, ఇప్పుడు కాదూ కూడదని కోప్పడినా తరువాత గొడవ అయినా జరక్కుండా వుంటుంది.

  

"ఏరా... వెయ్యి రూపాయలు చూళ్లేదూ ఇంకా? పందెం క్యాన్సిల్ చేసుకున్నట్లేనా?" మిత్రులు అడగటం మొదలుపెట్టారు.

"ఒరేయ్... నేను మాట అంటే మాటేరా! పందెమంటే పందెమేరా!" అన్నాడు పైకి బింకంగా. మనసులో భయంగానే వుంది. గుండెలు లబ్ డబ్ అంటూ పెద్ద శబ్దంతో కొట్టుకుంటున్నాయి. దడ పుడుతోంది.

వనజ తనని ప్రేమిస్తున్నట్లు ఒక్కసారి కూడా చెప్పలేదు. ప్రేమిస్తే... అడ్వాన్స్‌గా ఒక ముద్దు... ఒక్క ముద్దు... ఐదు వందలు వస్తాయి! అవి తనకి కాదు. వనజకే ఇస్తాడు. చక్కగా ఒకటో, రెండో డ్రెస్సులు తీసుకుంటుంది!

తన పని ముందు చూస్తే నుయ్యి, వెనుక చూస్తే గొయ్యిలా వుంది!

ఏం చేయాలిరా భగవంతుడా, ఎంత జటిల సమస్య సృష్టించావురా భగవంతుడా అని మనసులో భగవంతుడ్ని ఓ రెండు సార్లు తిట్టాడు.

కాలేజీలో ఫీజు కట్టాలనీ, కొనుక్కోవాల్సిన పుస్తకాలు చాలా వున్నాయనీ, బస్‌పాస్‌తో పాటు ఇతర చిల్లర ఖర్చులకి కావాలని వాళ్ళ నాన్నతో రెండు రోజులు పోరాడి వెయ్యి రూపాయలు తీసుకున్నాడు రాజారావు.

చేతికి డబ్బులు వచ్చిన తరువాత పందెం మానుకుంటే బాగుంటుందనుకున్నాడు. కానీ స్నేహితులు తక్కువ వాళ్ళు కారు. తాటాకులు కట్టి మంటపెట్టి మరీ ఎగతాళి చేసేరకం.

వనజ తనతో బాగానే వుంటుంది. ఏం అనకపోవచ్చు! కానీ మళ్ళీ భయం!

పోసుకోలుతనంగా అసలు వుండకూడదు. అలా వుండబట్టే ఇవ్వాళ తనకి ఇన్ని తిప్పలు వచ్చాయి! ఏం పందెమో, ఏమో! వనజ తనతో స్నేహంగానే వుంటుందీ, మంచిగానే వుంటుందీ? అయినా తనకి గుండె నిబ్బరం తక్కువ!

రాజారావు వెయ్యి రూపాయలూ, మిత్రుల ఐదువందల రూపాయలూ విద్యార్థుల్లో పెద్దమనిషి అనుకోదగ్గవాడి దగ్గర డిపాజిట్ చేశారు. పందెంలో ఎవరు గెలిస్తే వాళ్ళకి 15 వందలు ఇవ్వాలి.

మరుసటిరోజు సాయంత్రం కాలేజీ వదిలే లోపు పందెం అమలు జరగాలి. అమలు జరగకపోతే రాజారావు ఓడిపోయినట్లే!

పందెం పెట్టుకున్న వాళ్ళలో ఒకడికి ఎప్పుడెప్పుడు తమాషా చూద్దామా అని ఉత్సాహంగా వుంది. ముందు కడుపు వుబ్బరం పట్టలేకపోతున్నాడు. ఆ ఉబ్బరాన్ని ఆపుకోలేక ప్రక్కన వున్న వాడికి విషయం నెమ్మదిగా వెల్లడిచేశాడు. వాడు పక్కన వున్నవాడికి... అలా...అలా...అలలా తేలిపోతూ విషయం చాలామందికి తెలిసిపోయింది.

అలా తెలిసిపోయినట్లు రాజారావుకి తెలియదు. వనజతో కూడా ఎవరూ మాట మాత్రం చెప్పలేదు.

కరుణకి విషయం తెల్సింది. ఆగ్రహోదగ్రురాలైంది. భరించరాని కోపంతో కంపించిపోయి పళ్ళు పటపటకొరికింది.

ఏమిటీ... ఆడపిల్ల అంటే తమాషానా? నవ్వులాటా? పందెమా?

ఆడపిల్లలకి శరీరాలూ, ఆత్మలూ, ఇష్టాలూ, గౌరవాలూ, మర్యాదలూ, పరువులూ, అభిమానాలూ ఏమీ వుండవా?

ఒక బొమ్మా, రెమ్మనా చెప్పకుండానూ, అభిప్రాయం తెలుసుకోకుండానూ ముద్దుపెట్టుకోవడానికి?

కరుణ వనజకి విషయం చెప్పదలుచుకోలేదు. వనజ రాజారావుతో స్నేహంగా వుండటం, ఎప్పుడూ మాట్లాడుకుంటూ వుండటం క్లాసులో చాలామందికి తెలుసు.

వాళ్ళ ఇద్దరిదీ ఒకేవూరు! వనజకి తను చెప్పినా నిజంగాకపోతే తను నవ్వులపాలు కావాల్సివుంటుంది. వనజ అతన్ని ప్రేమిస్తున్నదేమో! అలా అయితే తనమీద దురభి





ప్రాయం కూడా ఏర్పడుతుంది.

చూద్దాం, ఏం జరుగుతుందో! నిజంగా జరిగితే వనజ ప్రతిస్పందన ఎలా వుంటుందో, ఎలా రియాక్ట్ అవుతుందో తెలుసుకోవచ్చు.

తనకి ఆత్మీయులు అనుకున్న ఇద్దరు స్నేహితుల్ని పిలిచి, రెండురోజులు వనజకి తెలియకుండానే వనజని వెన్నంటి కనిపెట్టి వుండమని చెప్పింది.

తెల్లవారింది! పందెం అమలు జరగాల్సిన రోజు!

క్లాసులో ఖాళీదొరికిన సమయంలో రాజారావు వనజ దగ్గరకి కాలుకాలిన పిల్లిలా వచ్చిపోతున్నాడు.

ఫలానా నోట్స్ వుందా, ఫలానా పాఠం వచ్చిందా, మనకి ఎగ్జామ్స్ ఎప్పుడు వుంటాయో అంటూ తలాతోకా లేని ప్రశ్నలు వేస్తూ, నీళ్ళు నములుతూ, చేతులు వత్తుకుంటూ వున్నాడు.

ఉదయం మూడో పీరియడ్. లెక్చరర్ రాలేదు. విద్యార్థులు చాలామంది ప్రాంగణంలో వున్న చెట్లకిందకి వెళ్ళిపోయారు. నోట్స్‌లు రాసుకునేవాళ్ళూ, చదువుకునే వాళ్ళూ, కబుర్లు పెట్టుకుని కూర్చున్నవాళ్ళూ ఇలా మిగిలిన విద్యార్థులు ఎవరిగొడవలో వాళ్ళు వున్నారు.

వనజ లైబ్రరీకి వెళ్దామని లేచింది. రాజారావు అనుసరించాడు.

ఎవరూ లేరు. వనజ ఒక్కతే వుంది.

"నీతో ఒక మాట మాట్లాడాలి!" కొద్ది దూరం వెళ్ళిన తరువాత అన్నాడు.

"చెప్పు ఏమిటో?"

"నువ్వు ఒంటరిగా వున్నప్పుడు చెప్పాల్సిన విషయం"

"చెప్పు రాజారావు. ఇప్పుడు నేను ఒంటరిగానే వున్నాను కదా!"

వాళ్ళకి కొంచెందూరంలో కొద్దిమంది మగపిల్లలూ, ఆడపిల్లలూ వున్నారు.

"అది కాదు వనజా... ఒంటరిగా అంటే ఎవరూ లేకుండా చూసి..."

"పిచ్చి పట్టిందేమిటి రాజారావు? ఎవరూ లేకుండా చూసి ఏం మాట్లాడుతావు? ఒంటరిగా చెప్పాల్సిన రహస్యాలు ఏమున్నాయి?" కోపంగా ప్రశ్నించింది వనజ.

"నువ్వు అపార్థం చేసుకోవద్దు వనజా! ఒంటరిగా అంటే మంచి విషయమే, చెడ్డ విషయం కాదు. నువ్వు తప్పుగా అనుకోవద్దు"

"ఇప్పుడు ఒంటరిగానే వున్నాను కదా, చెప్పరాదూ?"

"అదీ...అదీ... సరే, ఇప్పుడు కాదులే" అంటూ వెళ్ళిపోయాడు.

వనజకి ఐదారు బారల దూరంలోనే కరుణ నియమించిన ఇద్దరు స్నేహితులు వున్నారు. వనజ నిలబడితే, వాళ్ళూ మాట్లాడుకుంటున్నట్లు నిలబడ్డారు.

రాజారావు మిత్రులు కూడా కొంచెం దూరంనించి గమనిస్తూనే వున్నారు పందెం అమలు జరుపుతాడని!

రాజారావుకి తల తీసేసినట్లయ్యింది. వనజ కొద్దిగా అనుకూలంగా మాట్లాడినా బాగుండేది! ఆమెతో ఒంటరిగా మాట్లాడాలని తను తొందరపడి అన్నాడా? జుట్టు పీక్కున్నాడు! వెయ్యి రూపాయలమీద ఆశ వదులుకోవాల్సిందేనా?

కొద్దిసేపు ఆలోచించిన రాజారావు లైబ్రరీ లోనికి వెళ్ళి మళ్ళీ వనజకి చెప్పాడు.

"క్లాసు వదిలేవరకూ క్లాసులో వుండు వనజా! నీతో చాలా ముఖ్యమైన విషయం ఒకటి మాట్లాడాలి. కాదనకు. ప్లీజ్!"

వనజ ముఖం చిట్లించి "సరే" అంది.

ఉదయంపూట నాలుగు పీరియడ్స్ వుంటాయి. నాలుగో పీరియడ్ లెక్చరర్ కూడా లేడు.

విద్యార్థులు ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

పందెం విషయం తెల్సిన వాళ్ళు మాత్రం దరిదాపుల్లోనే కాచుకుని పచార్లు చేస్తు

న్నారు.

వనజ క్లాసులోనే కూర్చుని లెక్కలు చేసుకుంటోంది.

ఇదే మంచి అవకాశం అనుకున్నాడు రాజారావు. దగ్గరకి వెళ్ళాడు.

"వనజా... నాకు ఉదయం లెక్చరర్ చెప్పిన మాథ్స్ సరిగా అర్థంకాలేదు. నీకేమైనా అర్థమైందా? అర్థమైతే నాకు ఈ ప్రాబ్లం చెపుతావా? "

"అర్థంకావటానికి ఇందులో ఏముంది? "

"ఏమో, నాకు సరిగా అర్థంకాలేదు!"

వనజ ప్రాబ్లం వివరించి చెపుతుండగా పక్కన కూర్చున్నాడు.

ఉన్న నలుగురు విద్యార్థులు దూరంగా ఎవరి దారిన వాళ్ళు నోట్స్ రాసుకోవటం, చదువుకోవటం చేస్తున్నారు తలలు వంచుకుని. తమని ఎవరూ గమనించడం లేదనుకున్నాడు రాజారావు.

తెగించాలి. క్షణంలో ముద్దెట్టుకుని వదిలిపెట్టాలి! పక్కన ఎవరూ లేరు.

ఇంకేం ఆలోచించలేదు.

దగ్గరగానే వుంది వనజ. సడెన్‌గా ముఖం పట్టుకుని, బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు.

ఊహించని ఈ హఠాత్సంఘటనకి వనజ భీతిల్లింది. గజగజా వణికిపోయింది. చుట్టూ చూసింది. అప్పటికే వనజ చెంతకి ఇద్దరు అమ్మాయిలు వచ్చారు.

వనజకి అవమానంతో తల భూమిలోనికి కుంగిపోతున్నట్లనిపించింది.

కళ్ళంట నీళ్ళు వచ్చాయి. కొన్ని క్షణాలు నోటిలోనించి మాట కూడా రాలేదు. అంతగా హడలిపోయింది.

తరువాత తేరుకుని కాలి చెప్పుతీసింది. "ఏమిటి నువ్వు చేసిన పని? "

"అది కాదు వనజా... పందెం..." రాజారావు కూడా ఏం జరుగుతుందో అనే భయంతో వణికిపోతూ అన్నాడు.

"ఏం పందెం? " అంటూనే చెప్పుతో చెంప మీద లాగి ఫట్‌మని కొట్టింది.

"వనజా... వూరుకోకూడదు. పద, ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ చేద్దాం!" అని ఆ ఇద్దరు ఆడపిల్లలు తొందర చేశారు.

వనజకి ఆలోచించే వ్యవధి కూడా ఇవ్వలేదు. వనజ వాళ్ళని అనుసరించింది.

రాజారావు మిత్రులతో సరదాగా, ఏదో పోసుకోలుతనంగా పందెం కాశాడు. అయితే ఇది పెద్ద సమస్యగా, గొడవగా అవుతుందని భావించలేదు.

వాళ్ళు రిపోర్ట్ చేయడానికి ప్రిన్సిపాల్ రూంలోనికి వెళ్ళడంతో భయంతో వణికిపోయాడు.

"ఎంత తప్పు పని చేశానురా భగవంతుడా! ఇప్పుడు ఏది దారి? ఎలాచేయాలి? ఈ గండంనించి ఎలా బయటపడాలి? ఈ గండం గట్టెక్కితే చాలు" అని భయంతో పదేపదే అనుకున్నాడు.

వీళ్ళు వెళ్ళి ప్రిన్సిపాల్‌కి వివరంగా రిపోర్ట్ రాసి ఇచ్చారు. ప్రిన్సిపాల్ తన రూంలోనికి రాజారావుని పిలిపించాడు.

"ఏరా రాస్కెల్... ఇది కాలేజీ అనుకున్నావా, ఇంకేమనుకున్నావురా? ఆడపిల్లని పబ్లిక్‌గా, క్లాస్‌రూంలో ముద్దుపెట్టుకున్నావంటే నీకు ఎంత పొగర్రా? ఏమనుకుంటున్నావు నువ్వు! స్టుపిడ్... ఎంత అహంకారం, ఉన్మాదంరా నీకూ! నీలాంటి రోగ్ ఈ కాలేజీలో ఒక్కక్షణం వుండటానికి వీల్లేదు!" అంటూ కోపంతో లేచి ఇన్‌షర్ట్ చేసిన బెల్ట్ విప్పి, అది తీసుకుని ఐదారు దెబ్బలు వేశాడు.

"తప్పయిపోయింది సార్! క్షమించండి సార్!"

"తప్పు తెలియకుండానే జరిగిందిరా? ఇడియట్... మీ అమ్మా, అయ్యా ఏంపని చేస్తుంటార్రా? వాళ్ళు ఇంటిదగ్గర చాకిరీ చేసుకుని డబ్బు ఇచ్చి కాలేజీకి పంపిస్తుంటే ఇదంట్రా మీరు చేసేపనీ? నీకు అసలు బుద్ధివుందా? "





తను మామూలుగా పందెం పెట్టుకున్నాడు. ఇంత గొడవ, రభస జరుగుతుందని వూహించలేదు.

"నేను వనజని ప్రేమిస్తున్నాను సార్!" ఎలాగో గొంతు పెగల్చుకుని భయంభయంగానే చిన్నగా అన్నాడు రాజారావు.

బెల్ట్‌తో మళ్ళీ రెండు దెబ్బలు పడ్డాయి.

"ప్రేమిస్తున్నావురా? వేలెడంతలేవు. ముడ్డిమీదకి పద్ధెనిమిదేళ్ళు రాలేదు! అప్పుడే నీకు ప్రేమ కావాల్సి వచ్చిందిరా? అసలు ప్రేమంటే ఏమిట్రా? ప్రేమిస్తే ఇలా బహిరంగంగా ముద్దుపెట్టుకోవాలా? ప్రేమంటే ఇదేరా?" అంటూ మరి రెండు దెబ్బలు వేశాడు.

ప్రిన్సిపాల్ రుద్రావతారం చూసి, ఆ దెబ్బలకి ప్యాంట్‌లోనే పాస్‌పోసుకున్నాడు రాజారావు.

"నీతో పందెం పెట్టుకున్నవాళ్ళెవర్రా? పిలవండ్రా వాళ్ళని" అని ప్యూన్‌ని కసిరాడు.

ప్రిన్సిపాల్ ఆగ్రహాన్ని చూసి తత్తరపడిపోతూ, ప్యూన్ వాళ్లని పిలుచుకురావడానికి పరిగెత్తి పోయాడు.

రాజారావుతో పందెం కాసిన వాళ్ళలో ముగ్గురు వున్నారు. నాలుగోవాడు అప్పటికే తప్పించుకుని పారిపోయాడు.

"ఏరా రోగ్స్... ఏమనిరా మీరు పందెం పెట్టుకోవడం? ఇది కాలేజీ అనుకున్నారా, మీ ఇల్లు అనుకున్నార్రా? ఆడపిల్ల విషయంలోనా మీరు పందెం పెట్టుకునేదీ!" అంటూ వాళ్ళని కూడా బెల్ట్‌తో వాతలు తేలేలా కొట్టాడు.

"నేను కాదు సార్... వీడు సార్... వీడే సార్ పందెం పెట్టింది!" అని ఎవరికి వాళ్ళే పక్కవాడిమీద నెపం పెట్టడం మొదలుపెట్టారు.

"మీ ఐదుగురూ ఇక నా కాలేజీలో అడుగుపెట్టడానికి వీల్లేదు. మీరు ఇక ఈ కాలేజీ దరిదాపుల్లో కనపడ్డారా, నా చేతుల్లో చచ్చిపోతారు! మీకు సర్టిఫికేట్స్ కూడా ఇవ్వను. వెళ్ళి మీకు దిక్కున్నచోట చెప్పుకోండి" అన్నాడు ఆయన. తర్వాత ఆ ఐదుగుర్నీ భయంకరమైన బూతులు తిట్టాడు.

"వీడ్ని ఇలా విడిచిపెట్టకూడదు సార్! పోలీస్ కంప్లయింట్ ఇద్దాం!" అంది కరుణ.

"మీ ఇష్టం అమ్మాయ్!. ఆలోచించి చేయండి ఏదైనా! వీళ్ళని మాత్రం ఇక ఈ కాలేజీ గడప తొక్కనివ్వను"

"మీరు ఇవ్వండి సార్ పోలీస్ కంప్లయింట్!"

"నేనా? కంప్లయింట్ ఇస్తే కొంత రిస్క్ ఫేస్ చేయాల్సివుంటుందమ్మాయి! పోలీసులూ, కేసులూ, ప్లీడర్లూ, కోర్టులూ, చాలా గందరగోళం అవుతుంది. కేసు త్వరగా తెమలదు. వనజ కూడా కోర్టు చుట్టూ తిరిగాల్సివుంటుంది. ఇబ్బంది పడుతుంది"

"మరేంచేద్దాం సార్?"

"మీరే ఇవ్వండి ఏదో పనిష్మెంట్"

ప్రిన్సిపాల్ గొడవ కాలేజీలోనే సమసిపోతే బాగుంటుందని కోరుకుంటున్నాడు. పోలీస్ కంప్లయింట్ ఇచ్చి, పత్రికలలో వార్త వస్తే, కాలేజీకి చెడ్డ పేరు వచ్చే అవకాశం వుంది. ఫలానా కాలేజీలో ఇలా జరిగిందంటే కాలేజీకి అప్రతిష్ట! వీలైనంతవరకూ ఈ విషయాన్ని బైటకి పొక్కకుండా చేయాలనేది ప్రిన్సిపాల్ ప్రయత్నం!

"బహిరంగంగా ఒక అమ్మాయితో ఇంత నీచంగా ప్రవర్తించాడంటే వీడికి సభ్యమానవ లక్షణాలు ఏమీలేవని అర్థమౌతోంది సార్! వీడ్ని వూళ్లో వూరేగించి వదిలిపెడదాం సార్! అంతమాత్రం శిక్షపడక తప్పదు!" అంది కరుణ.

"మీ ఇష్టం అని చెప్పాను కదా! కాలేజీకి అప్రతిష్ట తీసుకువచ్చాడు. నిర్ణయం మీదే"

"మానవ లక్షణాలు లేవు. మనిషి అవతారం లోని కుక్క"

అని అప్పటికే ఎవరో ఒక అట్టముక్క మీద రాశారు. ఆ అట్టముక్కని రాజారావు

మెడలో వేలాడదీశారు.

అక్కడనించి నడిపించుకుంటూ, అప్పుడప్పుడు నాలుగు దెబ్బలు వేస్తూ బస్టాండువరకూ వూరేగించి వదిలిపెట్టారు.

★ ★ ★

రాజారావు, అతనితో పందెం పెట్టిన నలుగురు కాలేజీ మానేశారు. వాళ్ళు కాలేజీ గేటు దాటి లోనికి ప్రవేశిస్తే పోలీసుల్ని పిలిపించి జైల్లో పెట్టిస్తానని ప్రిన్సిపాల్ హెచ్చరించాడు.

వాళ్ళే కాదు, వనజ కూడా కాలేజీకి రావడంలేదు.

వనజ వూరి వాళ్ళని కరుణ అడిగింది. "ఏమిటే, వనజ కాలేజీకి రావడంలేదు. ఏమైంది? "

"ఇక వనజ కాలేజీకి రాదక్కా! చదువు మానుకొమ్మని వాళ్ళ నాన్న చెప్పాడు. వాళ్ళు ఇక కాలేజీకి పంపించరట! ఇంటి దగ్గరే వుంది!" అని చెప్పారు.

కరుణకి చాలా బాధ కలిగింది. ఏమిటి వనజ చేసిన నేరం?

ఎవడో దుష్టుడు ఒక దుష్కృత్యానికి పాల్పడితే దానికి వనజ బాధ్యత పడాలా? తన జీవితాన్నీ, భవిష్యత్‌నీ పాడుచేసుకోవాలా?

ఇంటిదగ్గర వుండి ఏంచేస్తుంది? చదువుకుంటే రేపు పెద్ద ఆఫీసర్ కావచ్చు డాక్టర్ కావచ్చు ఇంజినీర్ కావచ్చు లేదా కనీసం ఎలిమెంటరీ స్కూల్ టీచర్ అయినా కావచ్చు ఏమీ కాకపోయినా పర్లేదు, చదువుకుంటే కనీసం జ్ఞానం అయినా వస్తుంది.

చదువుకోకుండా ఏంచేయాలి? రేపు పెళ్ళిచేసుకుని, వచ్చే భర్తకి వంటచేసి పెడుతూ, అంట్లు తోముకుంటూ, ఇల్లు చిమ్ముకుంటూ తన శక్తి సామర్థ్యాలూ, ప్రతిభాపాటవాలూ అన్నీ ఇంటి నాలుగు గోడలకి పరిమితం చేయాలా?

వనజ తప్పు ఏమీ లేకపోయినా, ఎవడో చేసిన తప్పుకి వనజ చదువు మధ్యలో ఎందుకు ఆపాలి?

వనజ చదువు మానుకోవడానికి వీల్లేదు. పంతంగా అయినా చదువుకుని తీరాలి!

మూడురోజుల తరువాత ఆదివారం వచ్చింది. కరుణ ఇద్దరు స్నేహితురాళ్ళని వెంటపెట్టుకుని స్వర్ణ గ్రామం వెళ్ళింది.

ఊరి పక్కగా బస్‌పోతుంది. వీళ్ళు బస్ దిగి వూళ్ళోకి వస్తూ, వనజా వాళ్ళ ఇల్లు ఎక్కడో ఎవరినైనా అడుగుదామనుకుంటుండగా, వీళ్లకి రాజారావు ఎదురువస్తూ కనిపించాడు.

తల వంచుకుని వస్తున్నాడు, వీళ్లని చూసి గిర్రున వెనక్కి తిరిగి దగ్గరలో వున్న సందులోనికి వెళ్ళి మాయమైపోయాడు.

అది చూసి కరుణకి నవ్వూ, బాధా రెండూ కలిగాయి.

అలా తప్పించుకోవాల్సిన అవసరం ఏమొచ్చింది? బహిరంగంగా ముద్దుపెట్టుకోవడం ఎంత తప్పు! ఎవరు ఇచ్చారు అధికారం? ప్రేమించాడట! ప్రేమ ఒకవైపు వుంటుందా? ప్రేమించు ప్రేమకోసం! ఎదుటి వ్యక్తి మనల్ని ప్రేమించాలంటే మనం అంతకంటే గాఢంగా ప్రేమించాల్సి వుంటుంది కొన్ని సందర్భాల్లో! అంతేకానీ, బహిరంగంగా ముద్దుపెట్టుకోవడం ప్రేమించడమా?

ఒక చెట్టు కింద నలుగురు కూర్చుని, పులిజూదం ఆడుకుంటుంటే వనజ ఇల్లు ఎక్కడో వాళ్ళని అడిగారు.

"ఏ వనజా? ఎవరి అమ్మాయి? " అని, మళ్ళీ వాళ్ళే ఫలానా అని గుర్తుచేసుకుని ఎక్కడో చెప్పారు.

వీళ్ళు వెళ్ళేసరికి వనజ, వాళ్ళ అమ్మా ఇంటిముందు బట్టలు వుతుక్కుంటూ కనిపించారు.

వీళ్లని చూసి, వనజ పని ఆపి నవ్వుతూ ఆహ్వానించింది.

చిన్న ఇల్లు. పొయ్యిలో పొగవలన ఇంటి కప్పు అంతా నల్లగా, మసిగా వుంది.




వనజ అమ్మ వచ్చి, మంచం వాల్చి దుప్పటి పరిచి "కూర్చోండమ్మా... కూర్చోండి" అంది.

"ఎక్కడికి వచ్చారు? మీకు ఈ వూళ్లో బంధువులు ఉన్నారా? " వనజ అడిగింది ఆశ్చర్యంగా.

"బంధువులు ఉన్నారు. ఏం వుండకూడదా? "

"ఎందుకు వుండకూడదు కానీ, ఎవరూ? "

"మీరే! ఏం మీరు బంధువులు కారా? "

వనజ నవ్వింది. వాళ్ళు ఆ వూరు బంధువుల ఇంటికి వచ్చి, తరువాత తమ ఇంటికి వచ్చారనే అనుకుంటోంది. ఎందుకు వచ్చారో తెలియదు.

"మేం నీకోసమే వచ్చాం వనజా! నువ్వు కాలేజీకి రావడంలేదు ఎందుకూ? "

"ఇంకా ఏంకాలేజీ అమ్మా... వాడి పాడె కట్ట... వాడికి మా పిల్లతో ఏంపనీ... వాళ్ళ అయ్యి గడ్డితినీ, గాదం తినీ సంపాయించాడు. డబ్బు వుందని మదంపట్టి ఇంతపనిచేశాడు! అసలు వాడి కులం ఏందీ, మా కులం ఏందీ? మా పిల్ల జోలికి ఎందుకు రావాలీ? " అని ఆమె బాధపడుతూ, కళ్లంట నీళ్ళు పెట్టుకుంటూ మాట్లాడింది.

"అయిపోయింది కదా! వాడికి తగిన బుద్ధి చెప్పాం. ఇప్పుడు వనజని చదువు మానిపించి ఏం చేస్తారు? "

"ఇంత పని జరిగిన తరువాత అమ్మాయిని బడికి పంపించటానికి మాకే మనసొప్పడంలేదు! ఏ ముఖం పెట్టుకుని వస్తుంది!"

"అదేంటమ్మా? వనజ తప్పేం లేదుగదా! వాడు ఏదో చేశాడని వనజ చదువు ఎందుకు మానిపించాలి? మీరు తప్పకుండా వనజని కాలేజీకి పంపించండి"

"వీళ్ళ నాన్న కూడా వద్దంటున్నాడులే అమ్మా!"

తరువాత కొంతసేపటికి ఆయన ఇంటికి వచ్చాడు.

"కాలేజీలో స్నేహితులు నాన్నా! ఈమె కాలేజీ స్టూడెంట్స్ ప్రెసిడెంట్! చాలా మంచి అమ్మాయి. అందరూ ఈమె అంటే కలవరిస్తుంటారు" వాళ్ళ నాన్నకి వనజ, కరుణ వాళ్ళని పరిచయం చేసింది.

"వనజని కాలేజీ మాన్పించటానికి వీల్లేదండి! కాలేజీకి పంపించమని అడగటానికి వచ్చాం" అంది కరుణ.

చాలా సేపు ఆయనతో మాట్లాడారు. తనకి కూడా కూతుర్ని చదివించాలనే వుందనీ, కానీ జరిగిన సంఘటనకి బాధపడుతూనే కాలేజీ మాన్పించినట్లు చెప్పాడు.

"మన తప్పు లేని వాటిలో మనం బాధపడటం అనవసరమండీ! కానీ ఒక్కోసారి ఇతరుల తప్పుకి కూడా మనం బలి కావాల్సి వుంటుందనుకోండి"

"నిజమేనమ్మా!"

"ఆ రోజు ప్రిన్సిపాల్ అతన్ని బాగా కొట్టాడు. మేం కూడా తన్నుకుంటూ బస్టాండుదాకా వూరేగించాం! అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడేమో, నింద మనమీదకు వస్తుందేమో అని మేం భయపడ్డామండీ" కరుణ స్నేహితురాలు చెప్పింది.

"వాళ్లకి ఆత్మలు కూడా వుంటాయా, హత్యలు చేసుకోవడానికి! ఇతరుల పిల్లల్ని ఏడ్పించే దుర్మార్గులూ, మూర్ఖులూ అయితే" అన్నాడు ఆయన.

"వనజని రేపట్నించీ కాలేజీకి తప్పనిసరిగా పంపించండి. ఏమైనా ఇబ్బంది అయిన రోజు మా ఇంట్లో వుంటుంది" అంది కరుణ.

"అది కాదమ్మాయి"

"ఇంకో ఆలోచనవద్దు. మన తప్పులేనప్పుడు అవమానంగా కూడా మనం ఫీల్ కాకూడదు. వనజకి ఏమీకాదు, రేపట్నించీ పంపించండి" అని స్పష్టంగా చెప్పింది కరుణ.

"సరే కానివ్వండి. మా అమ్మాయి కోసం వచ్చి మీరు అంత గట్టిగా అడుగుతున్నప్పుడు కాదని ఎందుకు అంటాను. రేపట్నించీ వెళ్లమ్మా కాలేజీకి" అన్నాడు ఆయన.



సాయంత్రం కరుణ ఇంటిముందు ఆవరణలో చిన్న గడ్డ పలుగుతో గుంట తవ్వుతోంది. వేపచెట్టుకింద కుర్చీ వేసుకుని సొసైటీ లెక్కలు రాసుకుంటున్నాడు శంకరం. ఇంతలో గేటు తీసుకుని ఐదుగురు కుర్రవాళ్లు లోపలికి వచ్చారు.

"రండి రండి.... ఏమిటీ ఇలా వచ్చారు? " అంటూ కరుణ వాళ్లని ఆహ్వానించి "మా కాలేజీ స్టూడెంట్స్ నాన్నా!" అని తండ్రికి పరిచయం చేసింది.

"మీతో ఒక విషయం మాట్లాడాలని వచ్చామండీ!" చెప్పారు వాళ్లలో ఒకరు.

వేపచెట్టుకింద మంచం వాల్చి కూర్చోమంది కరుణ. వాళ్లు కూర్చోవడానికి సందేహిస్తున్నారు.

"కూర్చోండి... ఫర్లేదు" కరుణ అంది.

"మేం ఎస్సీలమండీ! మీతో స్కాలర్‌షిప్పుల విషయం మాట్లాడుదామని వచ్చాం!"





"అలాగే మాట్లాడుదాం. ముందు మీరు కూర్చోండి"

"నిలబడదాంలెండి! ఏమవుతుంది? " అన్నాడు ఒకతను వినయంగా.

"కూర్చోండి బాబూ! తప్పేంలేదు. చదువుకునే పిల్లలు మీరు కూడా కూర్చోవడానికి సంకోచిస్తే ఎలా? " అన్నాడు శంకరం.

వాళ్లు బిడియపడుతూనే ఒదిగి మంచం అంచులమీద కూర్చున్నారు.

"మాకు కాలేజీలో నిరుడూ, ఈ ఏడూ స్కాలర్‌షిప్పులు ఇవ్వలేదండీ!"

"ఎందుకు ఇవ్వలేదు. మీరు అడక్కపోయారా ఎందుకు ఇవ్వలేదో? "

"అడిగామండీ, రాలేదంటున్నారు"

"రాలేదేమో! రాకపోతే ఎలా ఇస్తారు? "

"నిరుడూ, ఇయ్యేడూ రెండేళ్లూ స్కాలర్‌షిప్పులు వచ్చాయండీ! మా బంధువుల పిల్లలు వేరే వూళ్లో ఇలాగే గవర్నమెంట్ జూనియర్ కాలేజీలోనే ఇంటర్ చదువుతున్నారు. వాళ్లకి అక్కడ స్కాలర్‌షిప్పులు వచ్చాయి. అక్కడ ఆ వూళ్లో రావడం ఏమిటీ, మనకి రాకపోవడం ఏమిటీ అని మాకు అనుమానం వచ్చిందండీ! మా ఇద్దరికీ పని వుండి మొన్న జిల్లా సెంటర్‌కి వెళ్లి ఎస్సీ వెల్ఫేర్ ఆఫీసులోనూ, డిఇవో ఆఫీసులోనూ ఎంక్వయిరీ చేశామండీ! మన కాలేజీకి స్కాలర్‌షిప్పుల చెక్కు పంపించినట్లు చెప్పారు"

"వస్తే ఎందుకు ఇవ్వలేదు? ఒకవేళ ఎవరైనా తిని వుంటారని మీ అనుమానమా? "

"అవునండీ! తినకపోతే ఎందుకు ఇవ్వలేదు? కాలేజీలోనే ఎవరో మాకు రావాల్సిన సొమ్ము నొక్కేశారు"

"గవర్నమెంట్ స్కాలర్ షిప్పులు పంపించిందని మీకు గట్టిగా తెలుసా? ఒకవేళ ఆ ఆఫీసులో వాళ్లు పొరబడి మీకు రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చారేమో!"

"కాదండీ, కరెక్ట్ ఇన్ఫర్మేషనే! అక్కడ ఒక గుమస్తాకి వంద రూపాయలు లంచం ఇచ్చాం. అతను మాకు పూర్తి సమాచారం

ఇచ్చాడు. ఏ డేట్‌న చెక్ పంపించిందీ, ఏ బ్యాంక్ చెక్కూ, చెక్కు నంబర్‌తో సహా స్లిప్ మీద వేసుకుని మేం ఆఫీసు బయట క్యాంటిన్‌లో వుంటే మాకు తెచ్చి ఇచ్చాడు" అని అతను జేబులో దాచి వుంచిన స్లిప్ తీసి ఇచ్చాడు.

కరుణ స్లిప్ చూసి "జాగ్రత్తగా వుంచండి. రేపు మనకి అవసరం కావచ్చు" అని వాళ్ళకి తిరిగి ఇచ్చింది.

"అయితే ఇప్పుడు ఏం చేద్దామంటారు? "

"అదే మీ సలహా కోసం వచ్చామండీ! మీరు స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్. మీరు ఎలా చెబితే అలా చేస్తాం. మేం మాత్రమే కాదు, మరీ నిరుపేద పిల్లలు కూడా కాలేజీలో చదువుకుంటున్నారు. కాలేజీ లేని సమయంలో కూలికి వెళ్ళే పిల్లలం కూడా చాలామందిమి వున్నాం!"

"ఇలాంటి నిరుపేదల సొమ్ము కూడా కొట్టేశారంటే వాళ్లు చాలా దుర్మార్గులమ్మా! వాళ్ల స్కాలర్‌షిప్పుల డబ్బు ఎవరు కొట్టేశారో తేల్చుకోండి. డబ్బు ఇచ్చేవరకూ వూరుకోవద్దు" అన్నాడు శంకరం.

"మీరు ప్రిన్సిపాల్‌ని అడిగారుకదా! ఆయన సమాధానం ఏమిటీ? "

"గవర్నమెంట్ స్కాలర్‌షిప్పులు మన కాలేజీకి ఇవ్వడంలేదు, మనకి రాలేదు, ఇక రావు" అని చెపుతున్నాడండీ! మరి రానప్పుడు ప్రతి ఏడూ వాటికోసం మేం అప్లయ్ చేసుకోవడం ఎందుకండీ? "

"సరే, రేపు అందరం వెళ్లి ప్రిన్సిపాల్‌గారితో మాట్లాడదాం. ఆయన ఏమంటారో తెలుస్తుంది. ఆయన జవాబుని బట్టి మనం ఏం చేస్తే బాగుంటుందో తరువాత ఆలోచిద్దాం!"

"మంచిదండీ! మీరు ఏం చెబితే అదే చేస్తాం. మాకు మాత్రం స్కాలర్‌షిప్పులు కాలేజీలోనే ఎవరో తినేశారనే విషయం తెల్సింది." కాలేజీకి హెడ్ ప్రిన్సిపాల్ ఆయనకి తెలియకుండా కుంభకోణం జరిగే అవకాశం లేదనీ, ప్రిన్సిపాల్‌కి అందులో వాటా వుండటమో, మొత్తం ఆయనే మింగి వుండటమో జరిగి వుంటుందని విద్యార్థులు అనుకోవడం మొదలుపెట్టారు.

తరువాత రోజు స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంట్ కరుణ ఆధ్వర్యంలో ప్రిన్సిపాల్‌ని అడగాలని ఎస్సీ, ఎస్టీ విద్యార్థులు ముందే నిర్ణయించుకుని కాలేజీ ఆవరణలో గుంపు కూడారు.

"మీరందరూ వస్తే బాగుండదు. ముందు నలుగురం వెళ్లి అడుగుదాం. ప్రిన్సిపాల్ మనకి విషయం చెపుతారుకదా! గొడవ చేయటం, తొందరపడటం మంచిదికాదు" అని కరుణ ముఖ్యులనుకున్న నలుగుర్ని వెంటపెట్టుకుని ప్రిన్సిపాల్ రూంలోకి వెళ్లింది.

ప్రిన్సిపాల్‌కి అంతకుముందే విషయం తెల్సింది. విద్యార్థులు అందరూ ఒక ముఠాగా ఏర్పడటం కూడా ఆయన దృష్టికి వచ్చింది.

ప్రిన్సిపాల్ పేపర్ చూస్తూ వీళ్లరాకని పట్టించుకోనట్లు తల కూడా తిప్పి చూడ లేదు. వీళ్లు విష్ చేశారు.

కొంతసేపు ఆగి ప్రిన్సిపాల్ పేపర్ చూస్తూనే వీళ్లవైపు ఒక సెకన్ తల తిప్పి చూసి "ఏమిటి? " అన్నట్లు తల ఎగరేశాడు.

"ఎస్సీ, ఎస్టీ స్టూడెంట్స్‌కి లాస్ట్ ఇయరూ, ఈ ఇయరూ స్కాలర్‌షిప్పులు రాలేదు సార్. వాటి విషయం అడుగుదామని వచ్చాం"

"రాలేదమ్మా! గవర్నమెంట్ మన కాలేజీకి ఎలాట్ చేయలేదు" సౌమ్యంగా చెప్పాడు ప్రిన్సిపాల్.

"అన్ని కాలేజీలకీ ఇవ్వగా, మన కాలేజీకి ఎందుకు ఇవ్వలేదు సార్? "

"అది గవర్నమెంట్ ఇష్టమమ్మా! మనం అడగటానికి వీల్లేదు. వాళ్లకి వచ్చిన బడ్జెట్ నిబట్టి వాళ్లు కేటాయిస్తారు"

"కాదు సార్! మన కాలేజీకి ఆ డబ్బు

వచ్చినట్లు మాకు తెల్సింది సార్"

"నాకు తెలియకుండా ఎలా వస్తాయి? రాలేదమ్మా"

ఒక విద్యార్థి కరుణ చేతికి స్లిప్ ఇచ్చాడు. ఆ స్లిప్‌ని మౌనంగా ప్రిన్సిపాల్ చేతికి ఇచ్చింది కరుణ. అది చూస్తూనే తన సీటు కింద ఎవరో బాంబు పెట్టి పేల్చబోతున్నట్లు ఎగిరిపడ్డాడు ప్రిన్సిపాల్.

"ఏమిటి ఇదీ? ఎవరు ఇచ్చారు మీకు లెక్క? " కోపం వెళ్లగక్కుతూ అడిగాడు ప్రిన్సిపాల్.

"మాకు ఎవరు ఇచ్చినా అది కరెక్టా, రాంగా సార్!"

"పూర్తిగా రాంగ్, ఎవరో మిమ్మల్ని కావాలని తప్పుదారి పట్టిస్తున్నారు. ఇలాగైతే మీరు ఎందుకూ పనికి రాకుండా పోతారు. మనం కాలేజీకి ఎందుకు వస్తున్నామో, మనం చేయాల్సిన పని ఏమిటో దానిమీదనే దృష్టి పెట్టాలికానీ ఇలాంటి అనవసర విషయాల్లో జోక్యం చేసుకుంటే మీ ఫ్యూచర్ దెబ్బతింటుంది!"

"అనవసర విషయం ఏమిటి సార్! వాళ్లకి రావాల్సిన డబ్బు అడుగుతున్నారు"

"రాలేదని చెప్పానుకదా! నా మాట మీద మీకు విశ్వాసం లేదా? "

"విషయాన్ని మీరు సూటిగా, డైరెక్ట్‌గా మాట్లాడండి సార్! వాళ్లకి స్కాలర్‌షిప్పులు వచ్చాయి. అవి ఇవ్వలేదు. మధ్యలో ఎవరో తిన్నారు. ఇదీ సమస్య! అంతేకానీ మా భవిష్యత్ పాడుకావటం, మీ మాట మీద మాకు విశ్వాసం వుండటం ఇవన్నీ అనవసర విషయాలు! వాళ్ల స్కాలర్‌షిప్స్‌ని గురించి మాట్లాడండి. సమస్యని పట్టించుకోండి. ఆ డబ్బులు ఏమయ్యాయి? అవి ఎవరు మింగారో ప్రిన్సిపాల్‌గా మీరు తేల్చాలి. ఆ మింగిన వాటిని కక్కించాలి" చాలా చిన్నగానూ, నెమ్మదిగానూ తన వాదన వినిపిస్తూ నిర్భయంగా, నిర్మొహమాటంగా వున్న కరుణ మాట తీరుకి విద్యార్థులు విస్మయం చెందారు. ప్రిన్సిపాల్ జంకాడు.

కరుణ తను వూహించినంత మెతక మనిషి కాదని ప్రిన్సిపాల్‌కి మొదటిసారిగా స్పష్టంగా అర్థమైపోయింది.

చాలా దూరదృష్టితో ఆలోచించి కరుణని యూనియన్ ప్రెసిడెంట్‌గా చేయటంలో ప్రిన్సిపాల్ కీలకపాత్ర పోషించాడు.

విద్యార్థుల్లో కరుణ మీద క్రేజ్ వుంది. ఫాలోయింగ్ వుంది. ఆ రెంటినీ వుపయోగించి కరుణని ప్రెసిడెంట్ చేస్తే తనకి ఉపయోగపడుతుంది. ఆడపిల్ల ఎదురు మాట్లాడదు. తను చెప్పినట్లు వింటుంది. మగపిల్లలు అయితే చాలా తలనొప్పులు ఎదుర్కోవాలి. గ్రామస్తుల జోక్యంతో తనకి ఎదురు మాట్లాడే అవకాశం ఎక్కువగా వుంది. కరుణ అయితే గ్రామస్తుల జోక్యం వుండదు. గ్రామ రాజకీయాలతో కరుణకి సంబంధంలేదు... ఇలా చాలా రకాలుగా యోచించే కరుణని ప్రెసిడెంట్‌గా చేయటంలో ప్రిన్సిపాల్ ప్రయత్నించి సఫలమయ్యాడు. అలాంటి కరుణ ఇప్పుడు ఏకు మేకు అయ్యేలా వుంది.

"సరే! ఇప్పుడు నేను బిజీలో వున్నాను. ఈ విషయం తరువాత మాట్లాడదాం. తరువాత కనపడండి"

"తరువాత అంటే ఎప్పుడు సార్? "

"చెపుతానుకదా! ఇప్పటికిప్పుడు మాట్లాడాలంటే ఇది తెగే సమస్యకాదు? "

"అలాగే సార్! కానీ వీలయినంత త్వరగా ఈ సమస్యని పరిష్కరించమని కోరుతున్నాం సార్. ఆలస్యం జరగడం మంచిదికాదు" వినయంగా చెప్పి కరుణ, మిగతావాళ్లు బయటికి వచ్చారు.

"ఏం జరిగింది? ఏమన్నాడు? ఏం చేద్దాం? " అని లోపలనించి వచ్చిన వాళ్ల చుట్టూ విద్యార్థులు కూడి ఆతృతగా ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఏమీ జరగలేదు. ఇప్పుడు ఏమీ చేసేది




లేదు. ప్రిన్సిపాల్ తరువాత మాట్లాడదామన్నారు. తరువాత అయినా ఆయన చెప్పే జవాబుని బట్టే మనం ప్రొసీడ్ కావాలి. గవర్నమెంట్‌నించి వచ్చిన డబ్బులు మీకు ఇవ్వకుండా ఎక్కడికీ పోవు! అవి సాధించుకు తీరుతాం" స్పష్టంగా చెప్పింది కరుణ.

తరువాత నాలుగు రోజులు చూశారు. ప్రిన్సిపాల్‌నించి ఉలుకూ పలుకూ లేదు. ఏమీ జరగనట్లే ఏమీ తెలియనట్లే మౌనంగా మామూలుగానే ప్రవర్తిస్తున్నాడు.

ఐదో రోజు మళ్లీ ప్రిన్సిపాల్ చెంతకి వెళ్లారు.

"స్కాలర్‌షిప్పుల విషయం తరువాత మాట్లాడదామన్నారు. మళ్లీ ఆ ప్రస్తావన తీసుకురాలేదు సార్!"

"సోషల్ వెల్ఫేర్ ఆఫీసుకి లెటర్ రాశాను. వాళ్లనించి ఇంకా రిప్లయ్ రాలేదు. రిప్లయ్ రాకుండా నేను ఏం మాట్లాడేది! ఒకటీ, రెండు రోజుల్లో రావచ్చని అనుకుంటున్నాను. రిప్లయ్ వచ్చిన తరువాత మాట్లాడదాం. ఆ రోజు మీరు చూపెట్టిన డేట్స్, చెక్ నంబర్లూ అన్నీ మోసం! అవి కల్పన!"

"సరే సార్! మన కాలేజీకి స్కాలర్‌షిప్పులు రాలేదు అని మాకు ఒక లెటర్ రాసివ్వండి సార్! దాన్ని ఆధారం చేసుకుని మాకు స్కాలర్‌షిప్పులు రావాలనీ, ఇవ్వాలనీ! మేం గవర్నమెంట్‌తో ఫైట్ చేస్తాం"

"ఏమిటీ... నేను మీకు లెటర్ రాసివ్వాలా? తమాషాగా వుందా? అసలు నేను ఎందుకు రాసిస్తాను? ఎలా రాసిస్తాను? అలా రాసిస్తే గవర్నమెంట్ వూరుకుంటుందా? మా మీద సీరియస్ యాక్షన్ తీసుకుంటుంది? "

"వాళ్లనించి రిప్లయ్ రాకపోతే? "

"రాకపోతే నన్ను ఏం చేయమంటారు? దానికీ నేను బాధ్యుడ్నేనా? రెండు రోజుల్లో వస్తుందంటున్నాకదా! ముందు ఇక్కడ్నించి మీరు వెళ్లండి. చదువు అయితే వుండదు కానీ అనవసర తెలివి తేటలు వుంటాయి. ఆ చూపెట్టే తెలివితేటలు ఏవో చదువుమీద చూపెట్టండి" అంటూ అర్థం లేకుండా ఆగ్రహంతో వీరంగం చేయడం మొదలుపెట్టాడు.

చాలా చిరాకుపడుతూ నిప్పులు వెదజల్లినట్లు కోప్పడ్డాడు. ఏం చేయాలో తోచక తన అధికార హోదాని అడ్డుపెట్టుకుని విద్యార్థుల్ని చీదరించుకుంటూ ఆ క్షణంలో తన రూంనించి బయటకు పంపించాడు.

"మీరు కంట్రోల్ చేసుకుని మాట్లాడాలి సార్!" అంటూ కరుణ బయటకు వచ్చింది.

విద్యార్థులు బయటకు వెళ్లిన తరువాత ప్రిన్సిపాల్ ఈ గొడవనించి ఎలా బయటపడాలా అని తల పట్టుకు కూర్చున్నాడు. ప్రిన్సిపాల్‌తో సన్నిహితంగా వుండే ఓ లెక్చరర్ లోపలకి వచ్చాడు.

లెక్చరర్లు తనకి వ్యతిరేకంగా గ్రూపు కట్టకుండా వారిలో ముగ్గురు లెక్చరర్లని ప్రిన్సిపాల్ తనకి అనుకూలంగా మలుచుకున్నాడు. వాళ్లకి అన్ని విషయాలూ తెలుసు. తను స్కాలర్‌షిప్పులు తిన్నందుకు ప్రతిఫలంగా ఆ లెక్చరర్లకి డబ్బు రూపేణా గాకపోయినా వేరే రకంగా ప్రిన్సిపాల్ సాయపడుతుంటాడు.

తన ఆఫీసులోకి వచ్చిన లెక్చరర్‌తో ప్రిన్సిపాల్ విషయం మొత్తం చెప్పాడు. "కరుణతోనే పెద్ద ప్రాబ్లం అయ్యేలా వుంది. వాళ్లకంటే ముందు ఈ అమ్మాయే గట్టిగా మాట్లాడుతోంది" అన్నాడు ప్రిన్సిపాల్.

"కరుణ ఒకరకంగా ఎంత మంచిదో మరో రకంగా అంత మొండిఘటం సార్! తను పట్టుకుందంటే అమీతుమీ తేలేవరకూ విశ్రమించదు. తాడోపేడో తేల్చుకుంటుంది. ఈ అమ్మాయి మాత్రం సామాన్యమైన వ్యక్తి కాదు!"

"అంతేనంటారా? "

"అంతేసార్! విషయం ఇంకా ముదిరి నలుగురికి తెల్సి రచ్చ కాకముందే గుట్టుగా

పరిష్కరించుకోవటం మంచిది. మీరు ఇలాగే జాప్యం చేస్తే వాళ్లు ఇంకా రాటుతేల్తారు" అన్నాడు ఆయన.

ప్రిన్సిపాల్ ఆలోచనలోపడ్డాడు. తను తాత్సారం చేసినా వాళ్లు ఇక వూరుకునేలా లేరు. పైఅధికార్ల వరకూ వెళ్తే తన మనుగడకే ముప్పు రావచ్చు అనుకొని జాగ్రత్త పడ్డాడు.

★ ★ ★

మూడో రోజు కాలేజీలో కరపత్రాలు ప్రత్యక్షమయ్యాయి.

"స్కాలర్‌షిప్పుల దొంగలు ఎవరు?" అనే హెడ్డింగ్‌తో విద్యార్థులందరి చేతుల్లోనూ అవి దర్శనమిచ్చాయి.

రాష్ట్రంలోనూ, జిల్లాలోనూ ఉన్న సంబంధిత ఉన్నతాధికారులకి విన్నవించటంతో పాటు ఫలానా రోజునించీ నిరవధిక నిరాహారదీక్షలు జరుపుతామనీ, విద్యార్థుల్ని అవమానకరంగా తూలనాడిన ప్రిన్సిపాల్ క్షమాపణ చెప్పాలని కరపత్రం సారాంశం.

అది చూడటంతోనే ప్రిన్సిపాల్‌కి గంగవెర్రులెత్తిపోయాయి. సమస్య పీటముడి ఇంకా బిగుసుకుంటోందనీ, త్వరగా పరిష్కరించుకుంటేనే మంచిదని భావించాడు. విద్యార్థుల్ని తన రూంలోకి పిలిపించాడు.

"నేను మిమ్మల్ని తూలనాడాలని మాట్లాడలేదమ్మా! ఏదో కోపంలో అన్నాను. కరపత్రాలు పంచడం ఆపెయ్యండి. వారం రోజుల్లోనే మీ సమస్య పరిష్కరిస్తాను. ఇక గొడవ మానుకోండి!"

"మీరు వారం రోజుల్లో పూర్తిగా సమస్యని పరిష్కరిస్తారా సార్?" కరుణ అడిగింది.

"పరిష్కరిస్తాననే కదమ్మా చెప్పడం"

"వారం రోజుల తర్వాత కూడా సమస్య ఇలాగే వుంటే ఉద్యమాన్ని ఉధృతం చేస్తాం సార్. తరువాత ఇరువైపులా బాధపడాల్సి వుంటుంది" అంది కరుణ.

మిగతా విద్యార్థులకి కూడా ప్రిన్సిపాల్ నచ్చచెప్పాడు. వాళ్లు శాంతించారు.

విద్యార్థుల స్కాలర్‌షిప్ డబ్బు మొత్తం తనే స్వంత అవసరాలకి వినియోగించుకున్నాడు. ఇప్పుడు వున్న పరిస్థితిలో అది మొత్తం చెల్లించాలంటే తనకి తలకి మించిన బరువే అవుతుంది.

మాట్లాడటానికి కరుణని తన రూంలోకి పిలిపించాడు.

"ఈ ఏడాది స్కాలర్‌షిప్పులు మొత్తం వచ్చేవారం పంచుతాం కరుణా! లాస్ట్ ఇయర్‌వి ఇప్పుడు ఇవ్వాలంటే కుదరదు"

"ఎలా సార్ మరి?"

"లాస్ట్ ఇయర్ డబ్బు కాలేజీ డెవలప్‌మెంట్ కింద ఖర్చు అయిపోయింది. నువ్వు చేరింది ఇయ్యేడేకదా! ఇప్పటి విషయం పరిష్కరిస్తే సరిపోతుంది"

"కాదుసార్! లాస్ట్ ఇయర్ స్కాలర్‌షిప్పులు కూడా ఇవ్వాల్సిందే. అది పేదపిల్లల సొమ్ము"

"లాస్ట్ ఇయర్ వచ్చిన స్కాలర్‌షిప్పులు మొత్తం కాలేజీకి వినియోగించాం. ఇప్పుడు అవి ఇవ్వాలంటే నా స్వంత డబ్బు ఇచ్చుకోవాల్సిందే! ఆ డబ్బు డెవలప్‌మెంట్ క్రింద ఖర్చు పెట్టడం పొరపాటే! నువ్వు విద్యార్థులకి చెప్పి వప్పించాలి!" కరుణకి నచ్చచెప్పడానికి ప్రిన్సిపాల్ చాలా విధాలుగా ప్రయత్నించాడు.

"లాస్ట్ ఇయర్ సీనియర్ స్టూడెంట్స్ వెళ్లిపోయారు. వాళ్లు లేరుకదా ఇప్పుడు. ఆ డబ్బు మేం అడగం. లాస్ట్ ఇయర్ జూనియర్స్ ఇప్పుడు సీనియర్స్. అప్పుడు జూనియర్స్‌కి వచ్చిన డబ్బు మొత్తం పంచాల్సిందే" గట్టిగా అంది కరుణ.

రెండు రోజులు సెలవు పెట్టి ప్రిన్సిపాల్ ఇంటివద్దనే వున్నాడు. ఆయన రాజధాని నగరంలో బిల్డింగ్ కట్టించుకుంటూ డబ్బు మొత్తం దానిమీద పెట్టాడు. అదీ అసలు విషయం.

ఇపుడు గత్యంతరం లేక డబ్బు అప్పు




తీసుకువచ్చి స్కాలర్‌షిప్పులు వచ్చిన విద్యార్థులు అందరికీ ఇచ్చాడు. అంతకుముందు సంవత్సరానివీ, ఈ సంవత్సరానివీ మొత్తం పంచారు.

స్కాలర్‌షిప్పులు వచ్చిన విషయం ఇద్దరు విద్యార్థులు జిల్లా కేంద్రానికి వెళ్లి తెల్సుకుని వచ్చామని చెప్పడం అంతా నాటకమే! కాలేజీలో పనిచేసే ఒక రికార్డ్ అసిస్టెంట్ ద్వారానే ఈ విషయం బయటకు వెల్లడైంది. నమ్మకస్తులైన ఇద్దరు ఎస్సీ విద్యార్థులకి తన పేరు బయటకి చెప్పం అని గట్టి హామీ తీసుకుని ప్రిన్సిపాల్ మీదవున్న వ్యతిరేకతతో అతను సమాచారం మొత్తం అందించాడు.

ఈ విషయంలో కరుణని మౌనం వహింపచేలా చేయటానికి ప్రిన్సిపాల్ వాళ్లు సామ దానభేద దండోపాయాలు ప్రయోగించారు. అయినా కరుణ వాళ్ల బెదిరింపులకి లొంగిపోకుండా ఎల్లాంటి వెనుకంజా వేయకుండా చివరంటా నిలబడింది. సమస్య పరిష్కారంలో ముందు వరుసలో ఉంది. ప్రిన్సిపాల్‌ని ఎదిరించి ధైర్యంగా, నిర్భయంగా మాట్లాడింది. దీనితో కరుణ అంటే విద్యార్థులందరికీ వున్న మంచి అభిప్రాయం మరింత బలపడింది.

ప్రిన్సిపాల్‌కి మాత్రం కరుణ మీద గొంతు వరకూ ద్వేషం, కసి, ఆగ్రహం ఏర్పడిపోయింది. ఒక స్టూడెంట్ తనని ఎదిరించడమే గాకుండా, డబ్బు కక్కించడాన్ని జీర్ణించుకోలేకపోతున్నాడు. తీవ్రమైన అవమానంగా భావించాడు. సమయంచూసి కరుణని గట్టిదెబ్బ కొట్టాలనుకున్నాడు.

★ ★ ★

మిట్టమధ్యాహ్నం వేళ.

సంక్రాంతి సెలవలు కావడంతో కరుణతో పాటు అందరూ ఇంట్లో వున్నారు. కరుణ అక్క, బావ కూడా పండక్కి వచ్చారు. వాళ్లకి ప్రతి పండుగకీ ఆహ్వానమే! పిల్లవాడితో సహా దిగిపోవాల్సిందే.

ఆ సమయంలో వేగంగా వచ్చిన ప్రభుత్వ వాహనం ఒకటి వారి ఇంటిముందు ఆగింది. అందులోనించి ముందుగా భుజానికి పట్టీలాంటి బెల్టు వేలాడతీసుకున్న బిళ్ల బంట్రోతు దిగాడు. వెనుక గ్రామ విఏఓ కూడా దిగాడు.

ఇద్దరూ గేటుదాటి లోపలకి వచ్చి "శంకరంగారు వున్నారా? " అంటూ అడిగారు.

శంకరంతోపాటు అందరూ బయటకి వచ్చారు.

"ఎంఆర్‌ఓగారు వచ్చారు మీ కోసం" చెప్పాడు గ్రామ విఏఓ.

హడావుడిగా బయటకు వచ్చిన శంకరాన్ని చూసి ఎంఆర్‌ఓ కారు దిగింది.

"లోపలికి రండి మేడం" అంటూ సాదరంగా ఆహ్వానించాడు శంకరం.

ఎంఆర్‌ఓ లోనికి వచ్చి కూర్చుంటూ అడిగింది. "కరుణ మీ అమ్మాయేకదా? "

"అవునండీ!" వినయంగా చెప్పాడు శంకరం నిలబడి.

"మమ్మల్ని కలెక్టర్‌గారు పంపించారు. కరుణకి గవర్నమెంట్ స్పెషల్ అవార్డ్ ఇచ్చింది. రేపు 26వ తేదీ రిపబ్లిక్‌డే రోజున జరిగే ఫంక్షన్‌లో అమ్మాయికి కలెక్టర్‌గారు అవార్డు ఇస్తారు. ఆ రోజున మీరు జిల్లా కేంద్రానికి వెళ్లి కలెక్టర్‌గారి చేతులమీదుగా అవార్డు తీసుకోవాలి"

సరస్వతమ్మకీ, శంకరానికీ సంతోషంతో మాట రాలేదు.

"అవార్డు దేనికీ? " కొంతసేపు తరువాత అడిగాడు శంకరం.

"ఎందుకూ, ఏమిటీ అనే విషయాలు మాకు తెలియచేయలేదండీ! మీకు ఇన్‌ఫాం చేయమన్నారు. డ్యూటీ మేం చేశాం. అంతకు మించి మాకు తెలియదు. రేపు మళ్లీ మీకు కలెక్టర్‌గారి నించి కూడా లెటర్ ఇంటిమేషన్ రావచ్చు"

"అగ్ని ప్రమాదం సమయంలో అమ్మాయి చేసిన సేవకి అవార్డు ఇచ్చివుండవచ్చు"

అన్నాడు శంకరం.

"కంగ్రాట్సమ్మా కరుణా! ఇంత చిన్న వయసులో ప్రత్యేక అవార్డు తీసుకోవడం అంటే చాలా గ్రేట్! నాకు రెవిన్యూ డిపార్ట్ మెంట్‌లో చాలా సర్వీసుంది. నాకు తెలిసి మన జిల్లాలో ఇంత చిన్న వయసులో అవార్డు రావడం నీకేనమ్మా! కంగ్రాట్స్" అని అభినందిస్తూ లేచి కరుణకి షేక్ హ్యాండ్ ఇచ్చింది.

కొద్దిసేపు కరుణకి సంబంధించిన చదువు, ఇతర విషయాలు మాట్లాడుకు న్నారు.

"వస్తామండీ!" అని లేచింది ఎంఆర్ఓ.

"ఉండండి వెళ్దురు! టిఫిన్ చేయకుండా ఎలా వెళ్తారు? " అని సరస్వతమ్మ పట్టుప ట్టింది.

అరుణ వాళ్లకి ప్లేట్స్‌లో ఇంట్లోనించి స్వీట్లూ, హాట్లూ తీసుకొచ్చి పెట్టింది. మరో వైపు తమ్ముడ్ని కూల్‌డ్రింకులు తీసుకుర మ్మని బజారుకి పంపించింది.

వాళ్లు అవి తిని, డ్రింకులు తాగి వెళ్లిపో యారు.

"ఇదేంటి నాన్నా! ఎప్పుడో ఏడెనిమిది నెలల క్రితం జరిగిన విషయానికి ఇప్పుడు అవార్డు ఇవ్వడం ఏమిటీ? " అని కరుణ వాళ్ల నాన్నని అడిగింది.

"ఎప్పుడంటే అప్పుడు ఇవ్వరు కదమ్మా! సమయం, సందర్భం రావాలి. రిపబ్లిక్‌డే రోజున ఏదో చేస్తారుకదా! అప్పుడే ఇస్తుం టారు ఇలాంటి అవార్డులు సహజంగా! పైగా గవర్నమెంట్ అంటే దున్నపోతు నడక చందమే!! అదిగో అంటే ఆర్నెల్లు" చెప్పాడు శంకరం.

కరుణకి ప్రత్యేకమైన అవార్డు వచ్చిందనీ, రిపబ్లిక్‌డే రోజున కలెక్టర్ చేతులమీదుగా అవార్డు అందుకుంటుందనీ వూళ్లో చాలా మందికి అప్పటికే తెల్సింది. పరిచయ స్తులూ, స్నేహితులూ వచ్చి కరుణని అభి నందించారు.

కాలేజీ తెరిచిన తరువాత కాలేజీలో కూడా ప్రిన్సిపాల్‌తో సహా లెక్చరర్లు అందరూ కరుణని ప్రశంసించారు. కొందరు లెక్చరర్లు క్లాసరూంలో కరుణని బాగా పొగిడారు. అలా ఎదురుగా పొగుడు తుంటే కరుణకి సిగ్గనిపించి తల దించు కుంది.

ప్రిన్సిపాల్ కరుణని పైకి అభినందిం చినా మనసులో రాకుండా వుంటే బాగుండే దని పదేపదే బాధపడ్డాడు. కరుణ అంటే ఆయన కోపంతోనూ, ద్వేషంతోనూ రగిలి పోతున్నాడు.

జనవరి 26న కరుణ కుటుంబం అంతా జిల్లా కేంద్రానికి వెళ్లారు.

పోలీస్ గ్రౌండ్‌లో భారీ ఎత్తున సభని ఏర్పాటు చేసింది ప్రభుత్వం. వీళ్ల కుటుం బానికి విఐపి గ్యాలరీలో కుర్చీలు కేటాయిం చారు.

సభకి జిల్లాలోని ఎంఎల్ఏలూ, ఇద్దరు ఎంపీలూ హాజరయ్యారు. ఉత్తమసేవలు అందించిన ప్రభుత్వ అధికారులకీ, ధైర్యసా హసాలు ప్రదర్శించిన పోలీస్ అధికారులకీ కలెక్టర్ నగదు బహుమతులూ, ప్రశంసా పత్రాలు వేదిక మీదకి పిలిచి ఇచ్చారు.

చివరగా కరుణని వేదిక మీదకి పిలి చారు. భయపడుతూనే వేదిక ఎక్కింది కరుణ.

సభను నిర్వహిస్తున్న డిఆర్‌డిఏ అధికా రిణి కరుణని గురించి నాలుగు నిముషాలు సభికులకి చెప్పింది.

తరువాత కలెక్టర్ ఐదు వేల రూపాయల చెక్కూ, ప్రశంసాపత్రం ప్రదానం చేశాడు.

అద్దె జీపు మాట్లాడుకుని సభకు వెళ్లిన శంకరం కుటుంబం, సభ ముగిసిన తరు వాత అదే జీపులో ఇంటికి తిరిగి వచ్చారు.

★ ★ ★

చాలా కాలేజీల్లో ఆడ పిల్లల్ని అల్లరి చేయడం, గొడవ చేయడం, వేధించడం, అవమానకరంగా ప్రవర్తించడం, ఈవ్‌టీ





జింగ్ చేయడం సర్వసాధారణం. అంతకు ముందు అలాంటి సంఘటనలు ఎన్నో ఆ కాలేజీలో జరిగాయి.

కరుణ కాలేజీలో చేరడం, ప్రెసిడెంట్‌గా గెలవడం, అల్లరచిల్లరగా వుండే కొందరు విద్యార్థుల్ని హెచ్చరించడం, రాజారావుని సత్కరించడం ఇలాంటి సంఘటనలతో దాదాపు కాలేజీలో అలాంటి అరాచకాలు జరిగే అవకాశం లేకుండా పోయింది. ఆడ పిల్లలు స్వేచ్ఛగా వుండగలుగుతున్నారు.

★ ★ ★

"కరుణా... నీకు వచ్చిన అవార్డ్ డబ్బులూ, నాన్నగారిని అడిగి ఇంకో పది వేలు తీసుకుని చంద్రహారం చేయించు కోవే! నీకు అవార్డ్ వచ్చిన గుర్తుగా బాగుం టుంది" అంది సరస్వతమ్మ.

"చంద్రహారం చేయించుకుని నేనేం చేసు కునేదే! నేనేం ముసలమ్మనా? గొలుసులూ, ఆభరణాలూ అలంకరించుకుని తిరగడానికి"

"ముసలమ్మలేనా గొలుసులూ, ఆభర ణాలూ వేసుకోవటం? చదివిస్తే వున్న మతిపోయిందట. మెడలో ఒక చిన్న చైన్ వుంటే ఏమీ తప్పులేదు. ఎంతో బావుం టుంది కూడా"

"అయినా నాకు అలా చెయిన్ వేసుకో వడం ఇష్టం వుండదమ్మా?"

"ఇష్టం వుండేదేమిటే తిక్కల ముఖమా? ఈ కాలపు ఆడపిల్లలు అందరూ ఎలా వుంటున్నారూ, నువ్వు ఎలా వుంటున్నావూ! నువ్వే ముసలమ్మలా వుంటున్నావు. ఒక అందం, చందం లేకుండా"

"గొలుసు వేసుకుంటే అందం వస్తుందే మిటి?"

"రాదూ! ఇవ్వాళ పిల్లలు నాకు అవి చేయించండీ, ఇవి చేయించండీ అని ఇంట్లో గొడవ చేయనివాళ్ళు ఎవరైనా వున్నారా? నువ్వేమిటే చేయిస్తామంటే వద్దంటున్నావు! ఒక వస్తువు ఏర్పడుతుంది కదా?"

"చేయించుకోమ్మా కరుణా... బావుం టుంది" శంకరం అన్నాడు.

"ముందుచూపు వుండాలే దేనికైనా! భవి ష్యత్‌లో నీకే ఏదైనా అవసరానికి పనికివ స్తుంది. వస్తువు వుంటే దండగేముం టుంది? వెనుకటివాళ్ళు తెలివితక్కువ వాళ్ళయితేనేనా వస్తువులు చేయించుకు న్నది?"

"ఏమో... గొలుసు వేసుకోవాలని నాకు వుండదు"

"దీని మాటలకేంగానీ, రేపు పదివేలు చూడండి. ఆ డబ్బూ, దీనికి వచ్చిన అవార్డ్ డబ్బూ కలిపి ఒక వస్తువు చేయిస్తాను. తరువాత డబ్బు వుండవచ్చూ, లేకపోవచ్చూ డబ్బు లేనప్పుడు వస్తువు కావాలంటే రాదు గదా! ఏదయినా డబ్బు వున్నప్పుడే అమర్చు కోవాలి. పైగా జీవితపర్యంతం అవార్డ్ వచ్చిన గుర్తుగా వుంటుంది"

"చెక్ బ్యాంక్‌లో ఇచ్చావు కదూ కరుణా! క్యాష్ వచ్చిందో రాలేదో! ఇన్ని రోజులు రాకుండా ఎందుకు ఉంటుంది? వచ్చే ఉంటుంది."

"రేపు డబ్బు డ్రా చేసి తీసుకురావే! నాన్న కూడా పదివేలు ఇస్తారు. వస్తువు చేయి స్తాను"

"నేను ఈ డబ్బు నా అవసరాలకి వాడు కోనమ్మా! ఇప్పుడు ఆ డబ్బుని కదిలించను"

"అవసరాలకి వాడుకోకుండా, కదిలించ కుండా ఏంచేస్తావే?" అంది సరస్వతమ్మ ఆశ్చర్యంగా.

"నీ ఇష్టం కరుణా. ఆ డబ్బు నీ దగ్గిరే వుంచుకో. రేపు నీ పేరుతో ఫిక్స్‌డ్ డిపా జిట్ చేయి. సేవింగ్స్‌లో వుంటే ఇంట్రెస్ట్ రాదు. ఫిక్స్‌డ్‌లో వేసుకుంటే కొంత ఇంట్రెస్ట్ వస్తుందీ, రేపు నీ అవసరాలకి తీసుకోవచ్చు"

"ఆ డబ్బు నా స్వంత అవసరాలకి ఖర్చు పెట్టదలుచుకోలేదు నాన్నా! హరిజనులవ లన వచ్చిన డబ్బు అది. ఆ డబ్బు వాళ్ళకే ఖర్చు పెట్టడం మంచిదని నా అభి

ప్రాయం!"

"ఏమిటే నువ్వనేదీ? నీకేమైనా పిచ్చిపట్టిందేమిటి? మనం ఏమైనా లక్షాధికారులమా? రూపాయీ, రెండ్రూపాయలూ కాదుగదా వాళ్ళకి ఇవ్వడానికి! ఇలాంటి పిచ్చిపన్లు ఏంచేయవద్దు. వస్తువు చేయించుకోకపోతే నాన్న చెప్పినట్లు బ్యాంక్‌లో ఫిక్స్‌డ్‌లో వేసుకో!" అంది సరస్వతమ్మ కోపంగా.

కరుణ అవార్డ్ చెక్కు చేతికి అందుకోకముందే, అవార్డ్ వచ్చినట్లు తెల్సినప్పుడే అనుకుంది, ఆ వచ్చే డబ్బు హరిజనుల సంక్షేమం కోసమే వినియోగించాలనీ, తన స్వంత అవసరాలకి ఖర్చు పెట్టకూడదనీ!

"దీనిని నమ్మడానికి వీల్లేదు. ఇది ఇవాళ కాకపోతే రేపు అయినా ఆ డబ్బు తీసుకుపోయి వాళ్ళకి ఇచ్చి వచ్చినా రాగలదు. అప్పుడు మనం చేయగలిగిందేమీలేదు. పద, ఇప్పుడు నీ పేరుతోనే ఫిక్స్‌డ్‌లో వేయించుకుందువు!" అని సరస్వతమ్మ కదిలింది బ్యాంక్‌కి రావడానికి.

"అమ్మా... అది మన కష్టార్జితంకాదు. ఆ డబ్బుమీద ఆశపెట్టుకోవటం పూర్తిగా అనవసరం. ఆ డబ్బు నాకు ఎవరివలన వచ్చాయో, వాళ్ళకే వినియోగిస్తాను. ఇంకో మాట వద్దూ, ఇంకో ఆలోచన చేయవద్దు!" అంది కరుణ స్పష్టంగా.

"పెద్దవాళ్ళమాట అంటే లక్ష్యం వుందంటే నీకూ! అన్నీ తెల్సినదానివనుకోవద్దు. అంత మిడిసిపాటు పనికిరాదు. డబ్బులేం చిల్లపెంకులుకాదు. వూరికే రావు. పెద్దవాళ్ళు ఎందుకు చెపుతున్నారా అని ఆలోచించు" అని సరస్వతమ్మ హితబోధనలు చేస్తూ తిట్లకు లేచింది.

కరుణ ఏమీ మాట్లాడలేదు. కరుణ మౌనం వహించిందంటే ఒక నిర్ణయం తీసుకున్నట్లే!

"కనీసం మీరయినా చెప్పండి. మీరు చెబితే వింటుందేమో" అంది సరస్వతమ్మ భర్తతో.

"అమ్మాయి ఇష్టం సరూ! తను వృధాగా ఏమీ ఖర్చు పెట్టదు. అది మనం ఇచ్చిన డబ్బు కాదుగదా అడగటానికి? అమ్మాయి డబ్బూ, అమ్మాయి ఇష్టం. ఏదయినా ఆ డబ్బుని అమ్మాయి మంచిపనికే వినియోగిస్తుంది" అన్నాడు శంకరం భరోసాగా.

"తోడుపొయ్యారు ఇద్దరూ! అసలు దాన్ని ఒక్కదాన్నీ అనుకుని ఏంప్రయోజనం లెండి? దాన్ని మీరు అలా తయారుచేశారు, ముందు మిమ్మల్ని అనుకోవాలి" అంది సరస్వతమ్మ కోపంగా.

తరువాత కూడా కరుణకి రెండుమూడు సార్లు నచ్చచెప్పటానికి ప్రయత్నించింది. కానీ తల్లి మాటల్ని వినలేదు.

కరుణ ఆ డబ్బు హరిజనులకే ఖర్చుపెట్టాలనుకున్నా ఎలా, ఏ రూపంలో ఖర్చుపెట్టాలో అర్థంకాలేదు.

ఫ్రెండ్సుందర్నీ అడిగింది. వాళ్ళ నాన్నని అడిగింది. ఒక్కొక్కరు ఒక్కోరకమైన సలహా చెప్పారు. అవేమీ కరుణకి సమంజసంగా అనిపించలేదు.

ఆలస్యం జరిగినా పర్లేదూ, ఎంతకాలమైనా మంచి విషయం అని తనకి పూర్తిగా సంతృప్తికలిగేవరకూ ఆ డబ్బు బ్యాంక్‌లోనే వుంచి తను అనుకున్న మంచిపనికి వినియోగించాలని కరుణ నిశ్చయించుకుంది.

★ ★ ★

ఇంటర్మీడియట్ పరీక్షలు దగ్గరకి వచ్చాయి. కరుణ పుస్తకాలమీద శ్రద్ధ పెట్టింది. నిద్రాహారాలుమాని చదువుతోంది.

ముందుకాలంలో తను ఏమైనా మంచి పని చేయాలన్నా మంచి కార్యక్రమం చేపట్టాలన్నా తనకి మంచి భవిష్యత్ వుండాలన్నా ప్రధానంగా చదువు వుండాలనే విషయాన్ని గ్రహించింది కరుణ. అందుకే చాలా శ్రద్ధగా, బాధ్యతగా ఒక నిముషం కూడా వృధా పోనివ్వకుండా అహర్నిశలూ




చదువుతోంది.

పరీక్షలు మొదలయ్యాయి. ఫిజిక్స్ పరీక్ష ఆరోజు. శ్రద్ధగా చదవటంతో కరుణకి పేపర్ సులభంగా వుంది. తల ఎత్తకుండా పరిసరాల్ని విస్మరించి దీక్షగా పరీక్ష రాస్తోంది కరుణ.

పరీక్షలకి చీఫ్ కాలేజీ ప్రిన్సిపాల్ విద్యార్థులు పరీక్షలు రాసే సమయంలో రోజూ అన్నిరూములూ ఒకటీ, రెండు రౌండ్లు తిరిగి చెక్ చేస్తాడు.

కరుణా వాళ్ళ రూంలోనికి వచ్చాడు ప్రిన్సిపాల్. ఇన్‌షర్ట్ చేసి, వెనుక చేతులు పెట్టుకుని బూట్లు టకటకలాడించుకుంటూ అన్ని బెంచ్‌ల వద్దకూ తిరిగిపోతున్నాడు.

బెంచ్‌కు ఇద్దరు విద్యార్థులు కూర్చుని పరీక్ష రాస్తున్నారు.

కరుణ కూర్చున్న బెంచ్ సమీపంలో స్లిప్ ఒకటి కిందపడి వుండటం ఆయన దృష్టిలో పడింది. స్లిప్ దగ్గరకి వచ్చి, వంగి దానిని అందుకున్నాడు. అది ఫిజిక్స్ ప్రశ్నే.

వెనుక బెంచ్‌కీ, కరుణ కూర్చున్న బెంచ్‌కీ మధ్యలో స్లిప్‌పడి వుంది. అది నలుగురికీ సమదూరంలోనే వుంది.

"వాటీజ్ దిస్?" స్లిప్‌ని చూపెడుతూ కరుణని ప్రశ్నించాడు ప్రిన్సిపాల్.

ప్రిన్సిపాల్‌కి కరుణ అంటే కసి వుంది. తన కసిని తీర్చుకోవాలని చాలా రోజుల్నించీ చూస్తున్నాడు. అయితే అవకాశం దొరకడంలేదు. ఇంటర్మీడియట్ అయిపోయేలోపు ఎలాగైనా కరుణని ఒక్కసారి అయినా ఇన్సల్ట్‌చేసి తన ఆధిక్యాన్నీ, గౌరవాన్నీ, హోదానీ నిలుపుకోవాలని ఆయన కోరిక. అవకాశం దొరికిందనుకున్నాడు. మళ్ళీ అడిగాడు.

"నాకు తెలియదు సార్!" అంది కరుణ మామూలుగానే.

"నీకు తెలియకుండా నీ ప్లేస్‌లోనికి ఎలా వచ్చింది? ఇక్కడ ఎందుకు పడివుంది?"

"ఏమో... తెలియదంటున్నాకదా!"

"సరే, ఆఫీసులోనికి పద, ఈ స్లిప్‌కీ, నాకూ సంబంధంలేదని రాసివ్వడానికి!"

"అది అసలు నా ప్లేసేకాదు. నాకు సంబంధం లేదు. అయినా మీరు రాసి ఇవ్వమంటున్నారు కాబట్టి ఎగ్జాం కాని వ్వండి. వచ్చి రాసిస్తాను"

"ఇప్పుడే రాయాలి"

"కుదరదు... నాకు టైం సరిపోదు"

"ఎగ్జామినేషన్స్ చీఫ్‌ని. నా మాట అంటే లక్ష్యం లేదా?"

"మీమాట అంటే లక్ష్యం వుంది కాబట్టే నాకు సంబంధం లేకపోయినా ఎగ్జాం అయిన తరువాత వచ్చి రాసిస్తానని చెప్పడం! కరెక్ట్‌గా మాట్లాడితే నాకు రాసి ఇవ్వాల్సిన అవసరం కూడా లేదు"

"ఆన్సర్ షీట్ ఇలా ఇవ్వు!"

"ఇవ్వను... రాయటం ఇంకా కాలేదు"

ప్రిన్సిపాల్ బలవంతంగా కరుణ చేతిలో నించి ఆన్సర్‌షీట్ లాక్కోవడానికి ప్రయత్నించాడు. కరుణ గట్టిగా పట్టుకుంది. చివరికి కొంత చిరిగిపోయి ఆన్సర్‌షీట్ ప్రిన్సిపాల్ చేతిలోనికి వచ్చింది.

"నువ్వు ఇక హాలులోనించి బయటికి పోవచ్చు"

"మీరు నన్ను ఎగ్జాం రాయనివ్వరా?"

"రాయనివ్వను. ఏం చేసుకుంటావో, ఎవరికి చెప్పుకుంటావో చెప్పుకో"

"చెప్పుకుంటాను"

"నువ్వు నన్ను ప్రశ్నిస్తావా? నాకు ఎదురు తిరుగుతావా?"

"నిన్ను ఏమిటీ, ఎవరినైనా ప్రశ్నిస్తాం. ఎవరికైనా ఎదురుతిరుగుతాం! తప్పు లేనప్పుడు ఎవరికీ జంకాల్సిన అవసరంలేదు. నీవు ప్రిన్సిపాల్‌వి అయితే కావచ్చు గొప్పవాడివి అనుకుంటున్నావేమో! పిల్లల ఫీజులూ, స్కాలర్‌షిప్పులూ కొట్టేసిన ఘనుడివి నువ్వు! నువ్వు నా ప్లేస్‌లో స్లిప్ పడి వుందని నాకు ధర్మపన్నాలు చెపుతావా?"

"అనవసరంగా మాట్లాడకుండా వెళ్ళిపో

ముందు"

"వెళ్ళిపోతాను. ఇప్పుడు నాకు పోయేదే మీలేదు. రేపు సెప్టెంబర్‌కి ఎగ్జామ్స్ రాసుకుని పాస్ కాగలను. కానీ ఇక నీ విషయం ఆలోచించుకో!"

"ఏం చేస్తావు ఏమిటి? "

"ఏ చేస్తానో చేసి చూపిస్తాను. నిన్ను ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించకపోతే నా పేరు కరుణే కాదు! ఖబడ్దార్! గుర్తుంచుకో" ప్రిన్సిపాల్‌తో సవాల్ చేసి కరుణ వేగంగా ఎగ్జాం హాలులోనించి బయటకు వచ్చింది.

ప్రిన్సిపాల్‌కి అవమానంతో తల తీసేసినట్లయింది.

కరుణ తప్పు ఏమీలేదని హాలులో వున్న విద్యార్థులు అందరికీ స్పష్టంగా తెలుసు. కానీ వాళ్ళకి మాట్లాడే అవకాశం దొరకలేదు.

కరుణ నేరుగా ఇంటికి వచ్చింది. ఇంటి దగ్గర వాళ్ళ నాన్న శంకరం వున్నాడు. ఆయనకి విషయం అంతా చెప్పింది.

"మరి ఇప్పుడు ఏం చేద్దాం? "

"అదే ఆలోచించాలి నాన్నా!" తండ్రీకూతుళ్లు ఇద్దరూ చాలాసేపు ఆలోచించారు.

"వెళ్ళి కలెక్టర్‌కి రిపోర్ట్ చేద్దాం నాన్నా! కలెక్టర్‌కి విషయం అంతా చెబుదాం! నాకు చాలా అన్యాయం జరిగింది. నామీద కక్ష తీర్చుకోవడానికే ప్రిన్సిపాల్ నా పేపర్ తీసుకుని అవమానించాడు. ఊరుకోకూడదు"

"కలెక్టర్‌కి చెబితే ఆయన ఏంచేస్తాడమ్మా? "

"వెళ్ళి మాట్లాడదాం నాన్నా! ఆయన ఏంచేస్తాడో తరువాత విషయం"

అప్పటికప్పుడే ప్రయాణమై ఇద్దరూ జిల్లా కేంద్రానికి వెళ్ళారు. కలెక్టర్ ఆఫీసుకి వెళ్ళారు. కలెక్టర్ ఆఫీసులోనే వున్నాడు.

వీళ్ళు వెళ్ళిన తరువాత కొంతసేపటికి ఇంటర్వ్యూ ఇచ్చాడు.

కరుణ కలెక్టర్‌కి విషయం అంతా చెప్పింది. ప్రిన్సిపాల్ పిల్లల ఫీజులూ, స్కాలర్ షిప్పులూ తినడం, అవి తమ విద్యార్థుల తరపున అడిగి పోరాడి తిరిగి ఇప్పించడం, తనమీద పగ పెంచుకోవడం, పగని తీర్చుకోవడంలో భాగంగానే తన పేపర్ తీసుకుని తనని బయటకి పంపించడం అన్నీ సమగ్రంగా చెప్పింది. ప్రిన్సిపాల్‌కి వ్యతిరేకంగా స్కాలర్‌షిప్పుల విషయంలో తాము వేసిన కరపత్రం కూడా చూపించింది.

"సరే, ఎంక్వయిరీ చేసి యాక్షన్ తీసుకుంటాను!" అన్నాడు కలెక్టర్.

"మీరు నాకు న్యాయం చేయాలి సార్" అంది కరుణ.

"తప్పకుండా" అని కలెక్టర్ విద్యాశాఖాధికారిని అప్పటికప్పుడే తన ఛాంబర్‌కి పిలిపించాడు.

వీళ్ళ సమక్షంలోనే కలెక్టర్ ఆయనకి విషయం మొత్తం చెప్పి అన్నాడు. "ఎంక్వయిరీ చేసి రేపు సాయంత్రంలోపు నాకు రిపోర్ట్ ఇవ్వండి!"

ఒకరోజు సీనియర్ ఇంటర్ వాళ్ళకి పరీక్షలు జరుపుతుంటే తరువాత రోజు జూనియర్ ఇంటర్‌వాళ్ళకి పరీక్షలు జరుపుతున్నారు. మరుసటిరోజే డి.ఇ.ఓ. ఎగ్జామినేషన్ సెంటర్‌కి స్క్వాడ్‌గా వచ్చాడు.

అంతకుముందురోజు జరిగిన సంఘటనని గూర్చి ప్రిన్సిపాల్‌తోనూ, అందుబాటులో వున్న కొంతమంది విద్యార్థులతోనూ మాట్లాడాడు. అనంతరం విద్యాశాఖాధికారి వెళ్ళి కలెక్టర్‌కి ఉన్న విషయం వున్నట్లే రిపోర్ట్ చేశాడు.

సాయంత్రానికి ప్రిన్సిపాల్‌ని చీఫ్ బాధ్యతల్నించి తప్పిస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు వచ్చాయి. వైస్ ప్రిన్సిపాల్ ఎగ్జామ్స్ అయ్యేవరకూ చీఫ్‌గా వుండాలనీ, తక్షణం బాధ్యతలు స్వీకరించాలని ప్రభుత్వం ఆదేశించింది.




కరుణావాళ్ళకి కెమిస్ట్రీ చివరి పరీక్ష. కరుణ తరువాత మళ్ళీ పరీక్షకి వెళ్ళేసరికి ఎగ్జామ్స్ పాత చీఫ్ స్థానంలో కొత్త చీఫ్ వున్నాడు.

తనని అవమానించి బయటకి పంపించిన ప్రిన్సిపాల్‌ని, అందుకు తగినట్లే తను ఎదుర్కొని దెబ్బతీసి విజయం సాధించిన ఉత్సాహంతో విజయదరహాసం చేసింది కరుణ.




సెలవులు అనంతరం కాలేజీ తెరిచారు.

ఈ కాలేజీ మానుకుందామా, వద్దా అని తర్కించుకునీ, తండ్రీ, కూతురూ ఇద్దరూ చర్చించుకునీ, చివరికి అదే కాలేజీలోనే ఇంటర్ ద్వితీయ సంవత్సరంలో చేరింది కరుణ.

కొద్దిరోజులకి విద్యార్థి సంఘం ఎన్నికలు వచ్చాయి.

విద్యార్థులు అందరూ ఈసారి కూడా ఎవరూ పోటీపడకూడదనీ, కరుణని ఏకగ్రీవంగా గెలిపిద్దామనీ నిర్ణయించుకున్నారు.

"పోటీ మాటేలేదు కరుణా! నువ్వు నామినేషన్ వేయి. ఏకగ్రీవంగా ఎన్నికవుతావు" అని ముఖ్యులైన విద్యార్థులు కరుణ దగ్గరకి వచ్చి చెప్పారు.

"లేదు. పోటీవున్నా, లేకపోయినా నేను నిలబడదలుచుకోలేదు. నాకు ఆ పదవిమీద పెద్ద ఇంట్రస్ట్‌లేదు. సారీ, ఇంకెవరినైనా చూద్దాం" అంది కరుణ.

విద్యార్థులు చాలా విధాలుగా అడిగారు. బతిమాలారు. నచ్చ చెప్పడానికి ప్రయత్నించారు. ఎస్సీ, ఎస్టీ విద్యార్థులు కొందరు కరుణే వుండాలని గట్టిపట్టుపట్టారు. వాళ్ళు ఎంతగా అడిగినా కరుణ కాదని సున్నితంగానే తిరస్కరించింది.

"ఉపయోగంలేని పదవి అది. ఆ పదవిలో వుండి సాధించేది కూడా ఏమీలేదు. పేరుకోసం పదవే అది. మనం అందరం ఒకమాట మీద వుండటమే మనకి బలం. సంఘటితశక్తే మన బలం, అదే మన ఆయుధం కూడా! అందరం కలిసి పోటీ లేకుండా ఒకరిని చూసి నిలబెడదాం. ఏకగ్రీవంగా ఎన్నికవుతారు" చెప్పింది కరుణ.

చాలామంది పేర్లు ప్రతిపాదనలోనికి వచ్చాయి. చివరకు కరుణ నర్మద అనే అమ్మాయిని సూచించింది. మిగతావాళ్లు కూడా నర్మద అయితే పర్లేదు అన్నారు. అందరూ నర్మదతోనే నామినేషన్ వేయించి ఏకగ్రీవంగా గెలిపించుకున్నారు.

మొదటి సంవత్సరం పరీక్షల ఫలితాలు వచ్చాయి.

కరుణ పాసయ్యింది. అయితే ఫిజిక్స్‌లో చాలా తక్కువ మార్కులు వచ్చాయి. మొత్తంమీద కరుణకి 70 శాతం మార్కులు వచ్చాయి. పేపర్ తీసుకోకుండా చివరి అరగంట కూడా ఫిజిక్స్ పేపర్ రాయనిచ్చినట్లయితే కరుణకి ఇంకా ఎక్కువ మార్కులు వచ్చి వుండేవి. ఫిజిక్స్‌లో 35 మార్కులు తగ్గిపోయాయి.

ఆశ్చర్యకరంగా రాధకి కూడా 70 శాతం మార్కులే వచ్చాయి. పదిలో 92 శాతం మార్కులు సాధించి జిల్లాలో తృతీయ స్థానం పొందిన రాధకి తక్కువ మార్కులు



రావడంతో విద్యార్థులు అందరూ ఆశ్చర్యపో యారు.

"ఏమిటే, ఇలా మార్కులు తగ్గిపో యాయి? " కరుణ అడిగింది రాధని.

"అవును... తగ్గిపోయాయి" అంది రాధ చాలా నిర్లిప్తంగా, ముక్తసరిగా, బాధగా.

"రీ కౌంటింగ్‌కానీ, రీవాల్యూయేషన్‌కానీ పెట్టిద్దామా? "

"పనిలేదు. ఇంతకంటే మార్కులు ఎక్కువ రావు కరుణా!"

"ఎందుకు తగ్గిపోయాయే? ఇంత దారుణం ఏమిటే? "

"దారుణం ఏముంది? చదవకుండా, బాగా రాయకుండా మార్కులు రమ్మంటే ఎలా వస్తాయే? "

"ఎందుకు చదవలేదు? "

"ఇష్టంలేక చదవలేదు"

"ఏమైందే? "

"ఏంచెప్పేది కరుణా? ఇంట్లో అమ్మా నాన్న మధ్య నిత్యం యుద్ధమేనే! రోజూ గొడవలే, కొట్లాటలే! ఈ హింసని భరించ లేక ఎటైనా వెళ్ళిపోదామనిపిస్తోంది కరుణా! పైగా పేదరికం. ఇంట్లో గొడ వలూ, అశాంతితో మా నాన్న అర్చకత్వం, అమ్మ విస్తళ్ళు కుట్టేపనీ రెండూ మూలనప డ్డాయి. అవి రెండూ వుంటేనే జరుగుబాటు అంతంత మాత్రం. అయితే, వాళ్ళు ఆ పస్తు కూడా మానుకోవటంతో రోజూ పస్తులే" అంటూ కళ్ళు తుడుచుకుంది రాధ.

★ ★ ★

బాగా చీకట్లు అలుముకున్నాయి. కరుణ ఇంట్లో టీవీ ముందు ఆసీనురాలై ప్రోగ్రాం వీక్షిస్తున్న సమయంలో రాధ వచ్చింది.

"రా రాధా... స్త్రీలకి సంబంధించిన సీరి యల్ బాగుంది చూడు!"

రాధ కూర్చోలేదు. చాలా అసహనంగా, దిగులుగా నిలబడి అంది, "కొంచెం ఇటు రా కరుణా..."

ఏదో ముఖ్యమైన పని మినహా రాధ రాదని కరుణ లేచింది.

"ఏమిటి రాధా... అంత దిగులుగా వున్నావేమిటి? ఏమైనా జరిగిందా? "

"నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లా డాలి కరుణా!"

"డాబా మీదకి వెళ్దామా? "

"అక్కడికి ఎవరూ రారా? "

"తమ్ముడు ట్యూషన్‌కి వెళ్లాడు. నాన్న మీటింగ్ వుందని ఏదో వూరు వెళ్లాడు. అమ్మ వంటగదిలో ఏదో చేస్తోంది. ఒక్కతే వుంది. ఎవరూ రారులే" అని ఇరువురూ డాబామీదకి వెళ్ళారు.

"ఏమిటే అంత రహస్యం? "

"నీకు ఎలా చెప్పాలో అర్థంకావడంలేదే!" అంది. తరువాత గోళ్లు గిల్లుకుంటూ సన్నగా ఏడుపు ప్రారంభించింది.

"ఏంజరిగిందే? ఎందుకు ఏడుస్తున్నావు? నువ్వు చెప్పకుండా ఎలా తెలుస్తుందే? "

"నేను పెద్ద ఆపదలో వున్నాను కరుణా! నాకు ఇప్పుడు చావే శరణ్యమనిపిస్తోంది"

"ఛ... అవేంమాటలు రాధా! ఎంత పిరి కిదానివి అయిపోయావే! నేను వున్నాను. ఎలాంటి సమస్యనైనా ఎదుర్కొందాం. భయపడకుండా జరిగిందేమిటో చెప్పు!"

"నేను చచ్చిపోతాను కరుణా!"

"రాధా... ఏంమాటలే! ఏమైందో చెప్పు? "

రాధ ఎక్కిళ్లు పెడుతూ, భయపడుతూ, సంకోచిస్తూ, చాలా నెమ్మదిగా చెప్పింది.

"నాకు ఇప్పుడు మూడోనెల!"

ఆమాట వినడంతోనే పిడుగుపడినట్లూ, మిన్ను విరిగి మీదపడినట్లూ స్థాణువైపో యింది కరుణ.

"ఏమిటి రాధా నువ్వంటున్నది? " విభ్రాం తినించి తేరుకుని అడిగింది.

రాధనించి ఎక్కిళ్లు పెరిగాయి తప్ప జవా బులేదు.

"ఎంతపని చేశావు రాధా... అయితే ఎవరూ? ఎలా జరిగిందే ఇంతపనీ? " రాధ భుజం పట్టుకుని వూపేస్తూ అడిగింది




కరుణ.

రాధనించి మాట రావడంలేదు.

"ఇప్పుడు ఏడ్చి ఏమీ ప్రయోజనంలేదు రాధా! ఏడిస్తే వచ్చిన ఆపద తొలిగిపోదు. ఇప్పుడు జరగాల్సిన విషయం ఏమిటో చూద్దాం" ఆవేశాన్ని తగ్గించుకుని, నెమ్మది గానే స్పష్టంగా అంది కరుణ.

"చచ్చిపోవటం తప్ప నాకు మరోమార్గం కనబడటంలేదు కరుణా!"

"మరోసారి అలాంటిమాట అన్నావంటే వూరుకోను రాధా. చచ్చి ఏంసాధిస్తావు? చచ్చిపోయేదానివి ఎందుకు ఇంత మూర్ఖపు పనిచేశావే! ఒకవేళ నువ్వు చచ్చిపోయినా నీకు జనం సానుభూతి లభిస్తుందనుకుంటు న్నావేమో! జనం కూడా నీ గురించి హీనంగా చెప్పుకుంటారు తప్ప గొప్పగా చెప్పుకుంటారనుకోవద్దు. మీ అమ్మా నాన్నా జీవితాంతం కుమిలికుమిలి విలపిస్తారు. నిన్ను కన్న నేరానికి వాళ్ళకి కడుపుశోకం మిగిల్చిన దానివవుతావు! ఎంతో తెలివికలిగి నదానివి, ఇంత తెలివితక్కువపని ఎలా చేస్తావే? "

"పెళ్లి చేసుకుంటానని చెప్పాడే!"

"అవునూ, చేసుకొమ్మను పెళ్లిచేసుకున్న తరువాతనే ఆ ఏడ్చే ఏడుపు ఏదో ఏడవక పోయారూ? పెళ్లికి ముందు ఎందుకు తొందరపడ్డావు? "

"ఇంత మోసగాడు అనుకోలేదు కరుణా!"

"ఎంత మోసగాడు అనుకున్నావూ! అసలు మోసగాడు కానివ్వూ, కాకపోనివ్వూ, నీ జాగ్రత్తలో నువ్వు వుండాల్సిన అవసరం లేదా? దారినపోయేవాడో ఇంకొకడో, మరొ కడో ఏమాట చెబితే ఆమాట నమ్మెయ్యడ మేనా? నమ్మినా, తొందరపడటం తప్పుకదే! మనకి రక్షణ ఏముంది? "

"ఇంత పరిస్థితి వస్తుందనుకోలేదు"

"ఏంమాటలు రాధా? ఇలాంటి పరిస్థితి రాకుండా వుంటేనే ఆశ్చర్యపోవాలి కానీ, వస్తే ఆశ్చర్యం ఏముంది? నీటిలోపడిన తరువాత మునిగిపోకుండా ఎలా వుంటారే? ఆడవాళ్లు, ముఖ్యంగా పెళ్ళికావా ల్సిన ఆడపిల్లలు నిప్పులా వుండాలి రాధా! నిప్పు పట్టుకుంటే ఎలా కాల్తుందో, నిప్పు ఎలా దహనం చేస్తుందో అలాగే ఆడపిల్లల్ని తాకితే దహనమై పోతామనే భయం మగ జాతికి వుంటే ఈ పరిస్థితి వచ్చివుండేది కాదు!"

"నన్ను నిలువునా గొంతు కోశాడు కరుణా!"

"అవును. గొంతు కొయ్యడానికి కసాయి వాడికి కత్తి ఇచ్చినట్లు నువ్వే వాడికి కత్తి ఇచ్చావే, గొంతు కొయ్యమనీ! దొరికిన మేకని వదలకుండా గొంతు కోశాడు. వాడి తప్పు ఎంత వుందో, ఇందులో నీ తప్పు కూడా అంతే వుంది రాధా! ఇంతకీ ఎవరా మనిషి!"

"......."

"చెప్పు రాధా... నిండా మునిగినదానికి చలి ఎందుకే? నాతో చెప్పడానికి సంకోచి స్తున్నావెందుకు? "

"ఇంక వాణ్ణి మరచిపోవటం మంచిది కరుణా!"

"మరచిపోదాంలే, ఎవరూ? "

"బోటనీ లెక్చరర్... శాంతారాం..."

"వాడా? ఓరి భ్రాష్టుడా! ఎంతపని చేశాడూ! వాడికి ఎప్పుడో పెళ్లి కూడా అయిందే. భార్య కూడా వుంది. వాడి భార్య ఏదో వూళ్లో ఎలిమెంటరీ స్కూల్లో టీచర్"

"వాడికి పెళ్ళి అయినట్లు నాకు తెలి యదు. నాతో పెళ్లికాలేదని చెప్పాడు. నేను నమ్మాను. తరువాత తెల్సింది వాడికి పెళ్ల యినట్లూ, ఇద్దరు బిడ్డలు వున్నట్లూ!"

"నక్కేనేవాడు! గుంటనక్క! దొంగచూ పులూ, వాడూ! వాడ్ని వదిలిపెట్టకూడదు"

"నేను లేకుండా ఒక్కక్షణం బతకలేనని చెప్పాడే! నిద్రపోయినా, నిద్రలేచినా ఎప్పుడూ నన్ను గురించి ఆలోచన్లే చుట్టు ముడుతున్నాయట. ఎన్ని అబద్ధాలు

చెప్పాడో కరుణా!"

"నువ్వు బాగా నమ్మేవూ!"

"నమ్మితేనే కదా ఇవ్వాళ ఈ దౌర్భాగ్య స్థితి ఏర్పడింది. తూర్పున ఉదయించే సూర్యుడు పడమర అయినా ఉదయిస్తాడేమో కానీ, నన్ను పెళ్లిచేసుకోకుండా తను వుండలేనన్నాడే! ఎప్పుడెప్పుడు పెళ్లాడుదామా అని తొందరపడిపోతున్నాట్ట!"

"మరి నువ్వెందుకు అభ్యంతర పెట్టావు? "

"నేనేం అభ్యంతరపెట్టలేదు కరుణా పెళ్లి చేసుకుందామనే చెప్పాను. మా నాన్నని ఒప్పిస్తాను. ఆయనని వప్పించేవరకూ ఆగా లన్నాను. ఇప్పుడిప్పుడే చెప్పొద్దులే మీ నాన్నకి, సమయం వచ్చినప్పుడు నేనే పెద్ద మనుషుల్ని తీసుకువస్తానని చెప్పాడు. అవన్నీ తాత్కాలికంగా తప్పించుకోవడానికి చెప్పిన మాటలేననీ, అన్నీ అబద్ధాలేననీ తేలింది కరుణా!"

"మరి ఇప్పుడేమంటాడూ? పెళ్ళి విషయం అడక్కపోయావూ? "

"అడిగాను. చాలా అవమానకరంగా మాట్లాడాడు. నన్ను అబార్షన్ చేయించుకో మన్నాడు. అబార్షన్ కాదు, పెళ్లిచేసుకుందాం అన్నాను. ఇప్పుడు కాదు, తరువాత చేసుకుందాం అన్నాడు. నాకు అప్పటికే వాడికి పెళ్లయిన విషయం తెలిసింది. నీకు ఇంతకుముందే పెళ్లయిందటకదా, ఎందుకు మోసం చేశావు అని అడిగాను. స్టన్నయిపోయాడు. భార్యకీ తనకీ సంబంధం లేదని చెప్పాడు. భార్యని ఎప్పుడో వదిలేశాట్ట"

"ఓరి కిలాడీ..."

"పెళ్లి చేసుకోకపోతే పబ్లిక్‌లో నిలబెట్టి గొడవ చేస్తానని బెదిరించాను. నా బెదిరింపులకు. వాడు లొంగుతాడా? రచ్చ చేసుకో మన్నాడు. నా వలనే నువ్వు తల్లివి అవుతున్నావని నమ్మకం ఏమిటీ? పెళ్లి కాక ముందే గర్భం చేయించుకున్నదానివి, ఇంకా ఎవరితో అయినా గర్భం వచ్చివుండొచ్చు అన్నాడు. ఇంకా నీకు ఎంత మందితో సంబంధాలు వున్నాయో అని కూడా అన్నాడు" ఏడుస్తూనే ఎక్కిళ్లు పెడుతూనే చెప్పింది రాధ.

"చూశావా రాధా... ఒక్కమాటలో వాడి ప్రేమ ఏమిటో వెల్లడైపోయింది. వాడి బండారం బయటపడింది. ఏదయినా నువ్వు తొందరపడటం చాలా తప్పు రాధా! నువ్వే కాదు, ఏ ఆడది కూడా ఇలాంటి విషయాల్లో తొందరపడితే భంగపడక తప్పదు"

"వాడు చాలా దుర్మార్గుడు అని ఇప్పుడు పూర్తిగా అర్థమైంది కరుణా!"

"కానీ ఇప్పుడు మనం వాడ్ని ఏంచేయ గలం? అన్యాయం, అక్రమం అంతా నీకే జరిగిపోయింది. నువ్వే పూర్తిగా మునిగిపోయావు. వాడు ఇప్పుడు ఒడ్డున నిలబడి ఆనందిస్తున్నాడు. వాడికి వినోదంగా వుంటుంది"

"పబ్లిక్‌లోనికి వెళ్ళి గొడవచేసి, వాడ్ని కోర్టుకి ఈడిస్తే ఎలా వుంటుంది? వాడ్ని జైల్లో పెట్టిద్దాం!" ఆవేశపడిపోతూ అంది రాధ.

"రాధా... ఆవేశం పనికిరాదు. ఇలాంటి ఆవేశం వల్లనే లేనిపోని అనర్థాన్ని కొనితెచ్చుకున్నావు. పబ్లిక్‌లోనికి ఏమని వెళ్తాం? వెళ్తే వాడి కంటే ముందు నువ్వు తలదించుకోవాలి. జైల్లో పెట్టిద్దామా, వాడ్ని కాదు, వాడు మనల్ని జైల్లో పెట్టిస్తాడు, పరువుపోయిందని! అన్నీ అంత తేలికగా జరిగిపోతే రోజూ వందలమందీ, వేలమందీ ఆడవాళ్ళు ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు? "

"అయితే వాడ్ని ఏమీ చేయలేమా? " అంది రాధ బాధగా.

"ఎందుకు చేయలేం? చాలా ఖచ్చితంగా వాడికి తగిన శిక్ష వెయ్యాలి. వాడ్ని వదిలిపెడితే వాడు ఇంకా రెచ్చిపోతాడు. ఇవ్వాళ నిన్ను బలిచేశాడూ, రేపు మరొకర్ని బలిచే




స్తాడు. నమ్మించి గొంతు కోయడంలో వాడు కాకలు తీరినవాడు! మాయమాటలు చెప్పి రేపు మరొకర్ని వలలో వేసుకోడని నమ్మకం ఏమిటి? ఎలాంటి పరిస్థితిలో కూడా వాడ్ని విడిచిపెట్టకూడదు"

"అయితే ఏంచేద్దాం? "

"అదే నెమ్మదిగా ఆలోచిద్దాం. ఇప్పుడిప్పుడు మనం చేయగలిగింది ఏమీలేదు. ముందు నువ్వు ఈ గండంనించి బయటపడాలి!"

"ఇప్పుడు ఏంచేద్దాం కరుణా? "

"మనం తక్షణం చేయాల్సిన పని నీ కడుపులో పెరుగుతున్న పిండాన్ని తొలగించాలి. ఒకరోజు కూడా ఆగడానికి వీల్లేదు. రోజురోజుకీ అది పెరుగుతుందే కానీ తగ్గదు. ఎంత త్వరగా అబార్షన్ చేయించుకుంటే అంత మంచిది రాధా!"

"మరి ఎలా చేద్దాం? "

"రేపు ఇద్దరం టౌనుకి వెళ్తున్నాం. ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసులో ఇద్దరం రిజిస్టర్ చేయించి వద్దాం. ఆర్టీసి కండక్టర్ పోస్టులు పడతాయంటున్నారు. నీకు గ్యారంటీలేవే! కండక్టర్స్ పోస్టుల లిస్టులో మొట్టమొదట నీ పేరే వుంటుంది. నైంటీటూ పర్సెంట్ నీకు ఇవ్వకుండా ఎవరికీ ఇవ్వరులే! ఇదీ మనం చెప్పాల్సిన విషయం"

"అది కాదు కరుణా..."

"మాట్లాడకుండా పద. మీ ఇంటివరకూ వస్తాను" అంటూ రాధను ఇంటివద్ద దింపింది కరుణ. మరుసటిరోజు ఉదయమే రాధ, కరుణ ఇద్దరూ జిల్లా కేంద్రానికి వెళ్లారు.

హాస్పిటల్లో అవసరం రావచ్చని, కరుణ తన దగ్గర వున్న డబ్బు వెయ్యి రూపాయలు తీసుకువచ్చింది.

టౌన్‌లో వున్న పెద్ద పెద్ద హాస్పిటల్స్‌కు కాకుండా, లేడీ డాక్టర్‌కి చెందిన చిన్న నర్సింగ్ హోంకి వెళ్లారు.

హాస్పిటల్ ఓపీలో వాళ్ల వూరు పేరు రాయించలేదు. వేరేవూరు పేరు, వాళ్ళ స్వంత పేరు కాకుండా మరోపేరు చెప్పారు.

రాధని డాక్టర్ పరీక్షచేసి, వివరాలు అన్నీ అడిగి తెలుసుకుంది. రాధ భయపడుతూ, బాధపడుతూ, సిగ్గుపడుతూ అన్ని వివరాలూ చెప్పింది. నిజాలతోపాటు కొన్ని అబద్ధాలు కూడా చెప్పారు.

"ఎప్పుడు చేయమంటారు అబార్షన్? " అడిగింది డాక్టర్.

"ఇవ్వాళే చేయండి డాక్టర్. హాస్పిటల్లో ఏమైనా వుండాలా మేము? " అడిగింది కరుణ.

"అవసరంలేదు. చేసిన తరువాత రెండు గంటలు రెస్ట్ తీసుకుంటే సరిపోతుంది. సాయంత్రానికి వెళ్ళిపోవచ్చు" చెప్పింది డాక్టర్.

"వెంటనే చేయండి డాక్టర్"

"చేస్తానుకానీ మీరు ఇలాంటిపన్లు చేయడం తప్పమ్మా! మీ వయసు ఎంత? జాగ్రత్తగా వుండాలి. అందరికీ తెలిస్తే మీరే కదా నవ్వుల పాలయ్యేది! ఎంత ఇన్సల్ట్" డాక్టర్ సౌమ్యంగా చెప్పింది.

వీళ్లు మళ్ళీ వాళ్ల వూరు వెళ్ళాల్సి వుంటుందని, అవసరమైన సామాను రెడీచేసుకుని అప్పుడే అబార్షన్ చేసింది డాక్టర్.

ఆపరేషన్ రూంలో అబార్షన్ చేసే సమయంలో బాధ భరించలేక రాధ గిలగిలా కొట్టుకుంది.

"ఏమ్మా... అప్పుడు తెలియదూ, ఇంత బాధ వుంటుందనీ... అప్పుడు సంతోషంగా వుందీ! ఏంపిల్లలే తల్లీ" అంటూ డాక్టర్ బయటకు వెళ్ళినప్పుడు నర్స్ అసభ్యకరంగా మాట్లాడింది. బాధలో నర్స్ మాటలకి రాధ మరింత కుంచించుకుపోయింది.

హాస్పిటల్‌లోనే సాయంత్రం వరకూ రెస్ట్ తీసుకుని, ఇద్దరూ వాళ్ళవూరు వెళ్లిపోయారు. ఊరివాళ్ళు ఎవరి దృష్టిలో కూడా వీళ్ళు పడలేదు. "అమ్మయ్యా... బతికిపోయాం" అని వూపిరి పీల్చుకుంది కరుణ.

బాగులేదని అమ్మా నాన్నకి చెప్పి, వారం రోజులు ఇంటివద్దే రెస్ట్ తీసుకుంది రాధ.

తరువాతవారంనించీ యథావిధిగా కాలే జీకి వెళ్ళడం మొదలుపెట్టింది.



ఆదివారం సాయంత్రం కరుణా వాళ్ళ ఇంటికి వచ్చింది రాధ. అప్పుడు కరుణ చదువుకుంటోంది. ఇద్దరూ డాబా మీదకి వెళ్లారు.

"నువ్వు చేసిన సాయం ఈ జన్మలో మరి చిపోలేను కరుణా! నీలాంటి మంచి స్నేహి తురాలు దొరకడం నిజంగా నా అదృష్ట మేనే"

"అబ్బ... బ్యాండ్ ఆపు. విషయం ఏమిటీ, బాగా చదువుతున్నావా? "

"ఛీ, బ్యాండ్‌కాదు కరుణా! మనసులో మాట చెప్పడం కూడా బ్యాండ్ వేయడ మేనా? విషయం ప్రత్యేకంగా ఏముం టుంది. వూరికే వచ్చాను. మిత్రురాలి దర్శనం చేసుకుందామని"

"ఏమంటున్నాడు నీ ప్రి...యు...డు..."

"వాడు ప్రియుడుకాదు, యముడు"

"ఈమధ్య ఒక్కసారయినా మాట్లా డావా? "

"ఛఛఛ... వాడిముఖం చూడాలంటేనే నాకు చీదరపుట్టి పోతోందే! వాడి క్లాసుకి వెళ్ళాలంటేనే ఎంత బాధ కలుగుతోందో! వీలైనంతవరకూ వాడి క్లాసుకి వెళ్లకుండా డుమ్మా కొడుతున్నాను"

"వాడు అయినా నీతో మాట్లాడాలని ప్రయత్నించలేదా? "

"నేను అవకాశం ఇస్తే కదా? ఒకటీ రెండుసార్లు వాడి క్లాసుకి వెళ్లినా వాడి ముఖం చూడటం ఇష్టంలేక పీరియడ్ అయ్యేవరకూ తలవంచుకునే కూర్చున్నాను. నాడికి కూడా నాతో మాట్లాడటానికి బిడియం అడ్డుపడి వుండొచ్చు"

"వాడితో నువ్వు మామూలుగానే మాట్లా డుతూ వుండాలి రాధా! తొండ ముదిరితే వూసరవెల్లి అవుతుందన్నట్లు వాడికి బ్రేక్ పడకపోతే ఆ వలలో మరొకరు పడే అవ కాశం వుంది. అసలు ఆ వలనే లేకుండా చేయాలి. అప్పుడే అలాంటి నీచుల ఆటలు అరికట్టగలం"

"ఏంచేద్దామంటావు? "

"నేను చెప్పినట్లుచేయి, చాలు" అని రాధ ఏంచేయాలో చెప్పింది కరుణ?

"అలాగే" అంటూ వుత్సాహంగా తల వూపింది రాధ.

"మీ నాన్న ఏమైనా గొడవచేస్తాడేమో! చదువు మానిపిస్తాడేమో. ఆ విషయం కూడా ఆలోచించు" అంది కరుణ.

"మా నాన్న ఏంచేయగలడులే! భయప డాల్సిన పనిలేదు. అంతగా అయితే కేకలు పెడతాడు. ఎగురుతాడు. ఆయనను పట్టిం చుకోవాల్సిన అవసరంలేదు. ఇంట్లో ప్రతి విషయానికీ గొడవ పెట్టేవాళ్ళతో ఎంత కాలం భయపడుతూ జీవించి వుండగలం? మాకు అలవాటేలే" అంది రాధ

"సరే అయితే! వ్యూహం బెడిసిపోకూ డదు. చాలా జాగ్రత్తగా, ప్లాన్డ్‌గా, కామ్‌గా డీల్ చేయాలి. ఒక్కదెబ్బకి వాడికి పట్టిన దెయ్యాన్ని వదిలించాలి" అంది కరుణ.

★ ★ ★





రాధ ఎప్పటిలానే శాంతారాంతో మాట్లాడుతోంది. కబుర్లు చెపుతోంది. నవ్వుతోంది. జోక్ వేస్తోంది. చనువుగా వుంటోంది. అయితే హద్దు దాటనివ్వటం లేదు.

రాధని అంతకు ముందులాగానే ముగ్గులోనికి దించాలని శాంతారాం శతవిధాలా ప్రయత్నిస్తున్నాడు.

"తన చేయి పడిన ఆడది ఎవరైనా తనని కలవరించాల్సిందే. రాధకి తనంటే ఎంత ఇష్టంలేకపోతే తనచుట్టూ తిరుగుతోంది. గతంలో జరిగిన సంఘటనతో భయపడినా తనంటే ప్రేమే! మనసు సంకోచిస్తున్నా, శరీరం తనని కోరుకుంటోంది" అనుకున్నాడు శాంతారాం.

రోజూ సాయంత్రం చివరి పీరియడ్‌లో ప్రాక్టికల్స్ వుంటాయి. మెయిన్ బిల్డింగ్ ఒకచోట, ప్రాక్టికల్స్ జరిగే లేబరేటరీస్ షెడ్ ఇంకోచోట వుంది.

బోటనీ లేబరేటరీ, ఫిజిక్స్ లేబరేటరీ పక్కపక్కనే వున్నాయి.

నాలుగున్నరకి కాలేజీ హోంబెల్ అయిపోయినా, కొందరు లెక్చరర్లు విద్యార్థులతో ప్రాక్టికల్స్ చేయిస్తూ 6, 7 గంటల వరకు కూడా వుంచుతారు.

శాంతారాం ఆరోజు రాధ బ్యాచ్ విద్యార్థులకి ప్రాక్టికల్స్ ముగించి పంపించాడు. రాధ మిగిలిపోయింది. తనకి వున్న ప్రత్యేకమైన ఆసక్తితో రాధ మరో ప్రాక్టికల్ చేస్తోంది.

పక్కరూంలో ఎంపీసీ వాళ్ళకి ఫిజిక్స్ ప్రాక్టికల్స్ జరుగుతున్నాయి. ఐదుగంటలు కావస్తోంది.

శాంతారాం రాధ పక్కకి వచ్చాడు. నిశ్శబ్దంగానే రాధ అతన్ని సమ్మోహనంగా చూసింది.

"తను అభినవ మన్మధుడే! తనతో ఒకసారి గడిపిన ఆడది తనని మరచిపోవటం జరిగేపనికాదు. తనని మళ్ళీ మళ్ళీ కోరుకుంటుంది" అనుకున్నాడు శాంతారాం.

తలుపులు వారగా వేసి వున్నాయి. దూరంగా విద్యార్థులు వాలీబాల్, బ్యాడ్మింటన్, బాస్కెట్‌బాల్ ఇలా ఆటల్లో మునిగిపోయి వున్నారు. తమని ఎవరూ గమనించే అవకాశంలేదు.

రాధ శరీరం మీద చేయివేశాడు శాంతారాం.

ఒకటీ, రెండు నిముషాలు రాధ మౌనంగా వుంది. చొరవచేశాడు శాంతారాం.

దిక్కులు పిక్కటిల్లేలా రేకుల షెడ్డు కప్పు లేచిపోయేలా పెద్దగా ఆర్తనాదం చేసింది రాధ.

"అమ్మో... కాపాడండీ, కాపాడండీ" అంటూ రూంలోనించి బయటకు పరిగెత్తుకు వచ్చింది.

క్షణాల్లో రాధ చుట్టూ విద్యార్థులు గుంపు కూడారు.

"ఏం జరిగిందీ... ఏం జరిగిందీ? "

రాధ రొప్పుతోంది. భయంతో వణికిపోతోంది. కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నాయి.

బట్టలు లాగినట్లు చిరిగిపోయివున్నాయి.

"శాంతారాం సారు నన్ను పట్టుకున్నాడు! బలాత్కరించబోయాడు! అరిస్తే చంపేస్తాను, మాట్లాడితే యాసిడ్ పోస్తాను అన్నాడు" అని పెద్దగా ఏడుస్తూ చెపుతోంది.

"ముందు వాడ్ని పట్టుకోండి. తప్పించుకుని పోతాడు" అని కొందరు విద్యార్థులు వెళ్ళి శాంతారాంని పట్టుకున్నారు.

"అన్నీ అబద్ధాలు. ఉత్తమాటలే! నాకేం తెలియదు. కావాలనే ఆ అమ్మాయి బట్టలు చింపుకుంది" అని పెద్దగా అరుస్తున్నాడు శాంతారాం.

"ఆ అమ్మాయే చింపుకుందీ! నా కొడకా... కొట్టేనంటే ఒక్క దెబ్బకి నెత్తురు కక్కుకుని చస్తావు" అని ఒక కుర్రాడు మోచేత్తో ఒక్కపోటు పొడిచాడు శాంతా



రాంని.

అతను చెపుతున్న మాటలు ఒక్కరూ నమ్మలేదు. "చాల్లే, ఇంక నోర్మూయ్! ఆడపిల్లని పట్టుకున్నది కాక కథలు కూడా చెపుతున్నావేమిరోయ్! దొంగ ,రాస్కెల్... నీ బతుకు ఎవడికి తెలియదురా!" అని కొందరు విద్యార్థులు ఆ అధ్యాపకుడ్ని తిట్టడం మొదలుపెట్టారు.

"వీడ్ని వదిలిపెడితే ఎలా? పద, పోలీస్ కంప్లయింట్ ఇద్దాం. క్లాసురూంలో లెక్చరర్ స్టూడెంట్‌తో అసభ్యకరంగా ప్రవర్తించాడంటే ఎంత అమానుషం! ఇంతకంటే ఘోరం ఇంకొకటి వుందా? చదువు చెప్పాల్సిన గురువు ఏమిటీ, ఇంత దారుణానికి ఒడిగట్టడం ఏమిటీ" అని అప్పుడే విద్యార్థులు రకరకాలుగా చర్చించుకుంటున్నారు.

మగపిల్లలు దొరికిందే ఛాన్సని ఆ లెక్చరర్‌ని బండబూతులు తిడుతున్నారు.

ప్రిన్సిపాల్ ఇల్లు అక్కడకి సమీపంలోనే వుంది. ఒకరు వెళ్ళి ప్రిన్సిపాల్‌కి విషయం చెప్పి రమ్మన్నారు.

"ఏం జరిగింది? " అని ఆయన హడావుడిగా పరిగెత్తుకుని వచ్చాడు.

ఎదురుగా కరుణ.

కరుణని చూస్తే ఆయనకి ఒకవైపు కోపం, మరోవైపు భయం! మనసులో కోప్పడతాడు కానీ ప్రత్యక్షంగా ఎదురుమాట్లాడలేడు.

"శాంతారాం ప్రవర్తన చాలా దుర్మార్గంగా వుంది సార్. ఆడపిల్లల్ని వేధిస్తున్నాడు. ఇప్పుడు రాధమీద అత్యాచారం చేయటానికి కూడా సిద్ధపడ్డాడు. ఎదురు మాట్లాడితే యాసిడ్ పోస్తానని కూడా బెదిరించాడట!" కరుణ చెప్పింది.

శాంతారాం ప్రిన్సిపాల్ ఆంతరంగికవర్గం లోని వాడు.

ఒకవైపు విద్యార్థులూ, మరోవైపు నమ్మిన బంటు!

"వాట్ మిస్టర్ శాంతారాం! వాట్ ఆర్యూ టెల్లింగ్ ఎబౌట్ దిస్? "

"అంతా మోసంసార్. ఆ అమ్మాయి నా మీద కక్ష పెంచుకుని కావాలని నన్ను ఇబ్బంది పెట్టడానికి ఆడుతున్న డ్రామా సార్ ఇదంతా! వాస్తవానికి నాకేమీ తెలియదు సార్"

"ఆడపిల్లలు ఎవరైనా ఇలాంటి డ్రామాలు వేస్తారా? నీమీద రాధకి కక్ష ఎందుకు వుంటుంది? నువ్వు అసలు గురువువా, గుడ్లగూబవా? చూడు, నువ్వూ నీ ఫేసూ! గుడ్లగూబకీ నీకూ తేడాలేదు!" విద్యార్థులు రకరకాలుగా మాట్లాడుతున్నారు.

"సరే, ఇంకెప్పుడూ ఇలా ప్రవర్తించవద్దు. దిస్ఈజ్ టూమచ్! రాధకి వెంటనే క్షమాపణలు చెప్పుకుని చెంపలు వేసుకో! ఇంకోసారి ఇలా చేశావంటే నీమీద సీరియస్ యాక్షన్ తీసుకోవాల్సి వుంటుంది!" ప్రిన్సిపాల్ శాంతారాంని హెచ్చరిస్తున్నట్లే మాట్లాడుతూ, మరోవైపు రక్షించాలని చూస్తున్నాడు.

"అసలు నా తప్పు లేదుసార్!" ప్రిన్సిపాల్ ఎత్తుగడ గమనించని శాంతారాం తన ధోరణిలోనే అన్నాడు.

"ముందు సారీ చెప్పు" గద్దించాడు ప్రిన్సిపాల్.

"సారీ వలన వుపయోగంలేదు సార్. సారీ చెప్పించుకుని వదిలిపెట్టేటంత చిన్న విషయం కాదు ఇది. రాధ తెలివిగా తప్పించుకుని బయటపడింది కానీ, యాసిడ్‌పోస్తే ఏమైవుండేది ఇప్పుడు రాధ పని? పోలీస్ కంప్లయింట్ ఇవ్వాల్సిందే, మీరు ఈ విషయంలో సీరియస్ యాక్షన్ తీసుకోవాల్సిందే!" కరుణ గట్టిగా మాట్లాడింది.

"ఏంటయ్యా శాంతారాం... ఎంత తప్పు పని ఇదీ? ముందు ఆ అమ్మాయి కాళ్ళు పట్టుకుని తప్పయిపోయిందీ, మన్నించమని క్షమాపణ కోరుకో!" అని శాంతారాంతో చెప్పి "పెద్దవాడ్ని చెపుతున్నాను. ఇంతటితో పోనివ్వండమ్మా! ఈ గొడవని ఇంకా పెద్దది




చేయటం మంచిది కాదు. కాలేజీ పరువుపో తుంది. నేను చెప్పినట్లు వినండి!" కరుణనీ, ఇతర విద్యార్థుల్నీ అభ్యర్థిస్తున్నట్లుగా అన్నాడు.

విషయం చాలా దూరం వెళ్తుందని గ్రహించిన శాంతారాం "తప్పయిపోయింది రాధగారూ... దయచేసి క్షమించండి. ఇంకె ప్పుడూ ఇలా ప్రవర్తించను" అని రెండుచే తులూ ఎత్తి దండంపెడుతూ చెప్పాడు.

"ఊరుకోను. ఇది ఆషామాషీ విషయం కాదు. కంప్లయింట్ ఇవ్వాల్సిందే. నా ముఖాన్ని ఇంతగా రక్కిపెట్టావు, నువ్వు మనిషివా, దున్నపోతువా? అరిస్తే చంపే స్తావా? ఇప్పుడు చంపెయ్యి, చూద్దాం! పోలీస్ కేసు పెట్టాల్సిందే!" అంది రాధ.

మగపిల్లలు కూడా రాధని సమర్థించారు.

రాధ కొంతమంది స్టూడెంట్స్ వెంటరాగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళింది.

పోలీసుల చేతికి దొరికితే ప్రమాదం ఏర్పడుతుందనీ, వాళ్ళకి దొరక్కుండా ప్రస్తు తానికి తప్పించుకునిపోతే కోర్టులో లొంగి పోవడం, లేకపోతే ఎలాగో రాజీ చేసుకో వడం చేయవచ్చనీ పోలీసులు రాకముందే అక్కడనించి తప్పించుకుపోవాలని శాంతారాం ప్రయత్నించాడు. కరుణ అతని ప్రయత్నాన్ని పసిగట్టింది.

మగ పిల్లలకీ విషయం చెప్పటంతో వాళ్ళు శాంతారాంని అక్కడే వున్న స్తంభా నికి తాడుపెట్టి కట్టేశారు.

రాధ స్టేషన్‌లో శాంతారాంమీద ఫిర్యాదు చేసింది. అతను తన మీద అత్యాచారం చేయబోయాడనీ, ప్రతిఘటిస్తే చంపుతానని, యాసిడ్ పోస్తానని బెదిరించాడని కేసు పెట్టింది.

ఇది విద్యార్థులతో కూడుకున్న సమస్య. ఏమాత్రం ఆలస్యం జరిగినా విద్యార్థులతో ప్రమాదం అని అప్పటికి అప్పుడే పోలీసులు జీపు వేసుకుని శాంతారాం కోసం వచ్చారు.

"నాకు ఏంతెలియదు సార్. అంతా అబద్ధం సార్. ఇదంతా పెద్ద కుట్ర సార్!" అన్నాడు శాంతారాం పోలీసులతో.

"కుట్ర ఏముంది? అబద్ధం అయితే తప్పయిపోయిందీ, క్షమించమని రాధని ఎందుకు క్షమాపణ కోరుకున్నావు? రాధ బుగ్గలమీదకీ, చేతులమీదకీ గాట్లు ఎలా వచ్చాయి? " అని విద్యార్థులు ప్రశ్నల వర్షం కురిపించారు.

"ముందు మాట్లాడకుండా జీపు ఎక్కరా!" అని ఎస్సయ్ గద్దించడంతో మరోమాట లేకుండా జీపు ఎక్కి స్టేషన్‌కి వెళ్ళాడు శాంతారాం.

"శాంతారాం- డౌన్‌డౌన్."

"విద్యార్థిని మీద అత్యాచారయత్నానికి పాల్పడిన శాంతారాంని -కఠినంగా శిక్షిం చాలి!"

"ఉద్యోగం నించి శాంతారాంని- డిస్మిస్ చేయాలి."

"స్త్రీలమీద అత్యాచారాలు- నశించాలి."

"విద్యార్థుల ఐక్యత- వర్ధిల్లాలి!"

పెద్దపెద్ద కార్డులు చేతబూని పెద్ద ఎత్తున నినాదాలు ఇస్తూ కాలేజీ విద్యార్థులు మరుసటిరోజు ఉదయం ప్రదర్శన జరి పారు. ఇతర పాఠశాలల విద్యార్థులు కూడా వూరేగింపులో పాల్గొన్నారు.

శాంతారాం అత్యాచార ప్రయత్నానికి నిర సనగా, అతనిని కఠినంగా శిక్షించాలని డిమాండ్‌చేస్తూ విద్యార్థులు ఆరోజు తరగ తుల్ని బహిష్కరించారు. కాలేజీ ప్రిన్సిపా ల్‌కీ, ఎంఆర్‌ఓకీ వినతిపత్రాలు ఇచ్చారు.

పోలీసులు శాంతారాంని కోర్టులో హాజరు పరిచారు.

జడ్జి అతనికి 15 రోజులు రిమాండ్ విధించాడు. విద్యార్థుల సంఘీభావం, ఐక్యత జడ్జి మనసుమీద కూడా పనిచే సింది. అందుకే మరో ఆలోచన లేకుండా 15 రోజులు రిమాండ్ వేశాడు.

శాంతారాం ఎప్పుడైతే లాకప్ కటకటాల వెనక్కి వెళ్ళాడో, అప్పుడే వుద్యోగంనించి

సస్పెండ్ అయ్యాడు.

విద్యార్థుల ఐక్యతని చూసి ప్రిన్సిపాల్, పోలీసు అధికారులూ ఖంగుతిన్నారు.

ప్రిన్సిపాల్ నిందితుడ్ని రక్షించాలని శక్తి వంచన లేకుండా ప్రయత్నించాడు. విద్యార్థుల పట్టుదల, ఐక్యత ముందు అతని ప్రయత్నాలు అన్నీ వీగిపోయాయి.

★ ★ ★

"అప్రాచ్యపుముండా... చదువు వద్దే, చదువుల వలన పాడైపోతున్నారూ, ఇంటి దగ్గర వుండవే, ఏదో సంబంధం చూసి పెళ్ళిచేస్తాం అంటే ఆరోజు అమ్మకానీ, నువ్వుకానీ నా మాట విన్నారా? ఇప్పుడు చూడండి ఎంత రభస అయిపోయిందో! ఇవాళ వూరంతా చెప్పుకుంటున్నారు కదా, పూజారి కూతుర్ని కాలేజీ లెక్చరర్ పట్టుకున్నాడనీ... ఎంత నామర్దా విషయం! ఎంత తలవంపుల వ్యవహారం"

"మన తప్పు లేనప్పుడు నామర్దా ఏముందీ? " అని భార్యా,

"అందుకు నేనేం చేసేది నాన్నా!" అని కూతురూ అన్నారు.

"నీ తప్పులేదూ? కాలేజీలో ఆడపిల్లవి నువ్వు ఒక్కదానివేనా వుందీ? అతని దృష్టి ఎవరిమీదా పడకుండా నీ ఒక్కదానిమీదనే పడిందంటే ఏమని అర్థం? తరగతిలో పిల్లలు అందరూ వెళ్ళిన తరువాత నువ్వొక్కదానివే ఎందుకు వుండాలి? నలుగురితో పాటే నువ్వూ రాకపోయావూ? "

"అందరూ అప్పుడే వెళ్ళారు. నేను కూడా వెళ్దామనుకుంటూనే, కొంచెం ప్రాక్టికల్ మిగిలివుంటే అది చేసి వద్దామని ఆగాను. లెక్చరర్ ఇలా చేస్తాడని నేనెందుకు అనుకుంటానూ? "

"అఘోరించకపోయావూ? పరాయి పురుషుడు వున్నప్పుడు నువ్వు ఒక్కదానివే వుండటం ఏమిటీ? నీ తెలివీ, జ్ఞానం అంతా ఎక్కడ చచ్చిందీ? చదివిన వరకూ చాల్లే, పుస్తకాలు కట్టకట్టి పొయ్యిలో పెట్టు, పీడా వదిలిపోతుంది! ఇక కాలేజీ విషయం మరచిపో"

"అదేమిటి నాన్నా? ఇంకా రెండు నెలల పదిహేను రోజుల్లో వున్నాయి పరీక్షలు. ఈ కొద్దిరోజులూ కాలేజీకి వెళ్తే ఇంటర్మీడియట్ పూర్తయిపోతుంది. ఇప్పుడు మానుకుంటే ఏడాదిన్నరనించీ చదివిన చదువు అంతా వ్యర్థమైపోతుంది. ఇప్పటివరకూ కట్టిన ఫీజులూ, నేను పడిన శ్రమా, పుస్తకాలూ అన్నీ పనికిరాకుండా పోయినట్లే"

"ఏం శ్రమ పడ్డావే నువ్వూ? శ్రమ పడితే పదిలో ఎన్ని మార్కులు వచ్చాయీ, మరి మొదటి ఏడాది ఎన్ని మార్కులు వచ్చాయీ? పెద్దగా చదివినట్లు చెపుతున్నావేమిటి? "

"ఇప్పుడు బాగా చదువుతా నాన్నా! రేపు చూడు ఎన్ని మార్కులు తెచ్చుకుంటానో! ఈ రెండు నెలలూ వెళ్తాను కాలేజీకి. తరువాత ప్రిపరేషన్ హాలీడేస్ ఎలాగూ ఇస్తారు"

"ఏముఖం పెట్టుకుని వెళ్తావూ? ఊళ్లో జనం నోట్లో వూస్తారు. వీధిలో అందరూ ఇక నీవైపే చూడాలి! నువ్వు కాలేజీకి వెళ్తుంటే ఇళ్ళలో పనిచేసుకుంటున్న వాళ్ళు కూడా పనులు ఆపుకుని బయటకి వచ్చి నిన్ను చూసి గేలిచేస్తారు. మనిషి అయిన తరువాత కొంచెం మానం, అభిమానం వుండాలి. గౌరవంగా, ప్రతిష్టగా బతుకుతున్న కుటుంబ మర్యాదల్ని మంటకలిపి ఇంకా మాట్లాడుతున్నావే, కాలేజీకి వెళ్తానని!" కళ్ళు వురుముతూ, ఆగ్రహంగా అన్నాడు పూజారి.

ఆయన కోపం చూసి రాధా వాళ్ళ అమ్మ ఏమీ మాట్లాడలేదు.

రాధ రెండు రోజులు కాలేజీకి వెళ్ళలేదు. తరువాత రోజు కరుణ వచ్చింది.

"ఏమిటి రాధా... కాలేజీకి రావడం లేదూ? "

"మాన్పించాను అమ్మాయ్. ఇంక రాదు





కాలేజీకి!"

"అదేమిటి పూజారిగారూ! ఇంకా రెండు నెలలు వస్తే అయిపోతుంది ఇంటర్. ఎంతో తెలివికలిగిన మీరు, ఊళ్ళో పెద్దతలకాయ, ఒకరికి మంచీ చెడూ సలహా చెప్పే మీరు ఇలాంటి నిర్ణయం తీసుకున్నారేమిటండీ? " అంది కరుణ పూజారిని ప్రశంసిస్తూ, ప్రసన్నుడవుతాడనే వుద్దేశంతో.

వీళ్ళు ఇంటర్‌లో చేరిన మొదట్లో కరుణ మీద పూజారికి సదభిప్రాయం వుండేది కాదు. వీళ్ళ ఇంటికి తరచూ కరుణ రావడం, పూజారితో కలుపుగోలుతనంగా మాట్లాడుతూ, వాళ్ళ ఆర్థిక విషయాల్ని ఎప్పటికప్పుడు అడుగుతూ, అవి మెరుగుపడటానికి తనకి తోచిన సలహాలు చెపుతూ, ఇరుకూ ఇబ్బందుల్లో వుంటే అండగా తను వుంటాననే అభిప్రాయం వాళ్ళకి కలిగేలా వ్యవహరిస్తూ, కాలేజీలో రాధకి అవసరమైన పుస్తకాలూ, నోట్సులూ బలవంతంగానే ఇస్తూ స్నేహపూర్వకంగా వుంటూండటంతో "మంచి అమ్మాయే. తను తెలియక మంచిది కాదని పొరపాటు అభిప్రాయం ఏర్పరుచుకున్నాడు" అనుకుని పూజారి కరుణతో స్నేహంగా వుంటూ మంచి చెడ్డలు చర్చిస్తూ వస్తున్నాడు.

"ఊళ్లో చాలామంది నా దగ్గరకే సలహాలకి వస్తుంటారమ్మాయి! ఒకరికి సలహా చెప్పేవాడ్నే తప్ప, ఒకరితో చెప్పించుకోవడం నాకు తెలీదు. మాది గౌరవప్రతిష్టలు కలిగిన కుటుంబం! ఇంత జరిగిన తరువాత అమ్మాయి కాలేజీకి ఎలా వస్తుందమ్మా? "

"ఇంటర్మీడియట్ క్వాలిఫికేషన్‌మీద చాలా వుద్యోగాలు వున్నాయండీ!"

"ఉద్యోగం మేం చేయిస్తున్నామా? "

"మీరు చేయించకపోవచ్చు! అమ్మాయి మన అమ్మాయే అయినా అల్లుడు మనవాడు కాదు గదండీ! ఇవ్వాళ కాకపోతే రేపైనా అత్తవారింటికి వెళ్ళాల్సిన అమ్మాయే! మన ఇంటి దగ్గర వుండదు కదా! రేపు అల్లుడు వుద్యోగం చేయాలంటాడు. ఈ రోజుల్లో టౌనుల్లో భార్యాభర్తలు ఇద్దరూ వుద్యోగాలు చేస్తేనే జరుగుబాటు అంతంతమాత్రం! మీరు మొదట్లోనే కాలేజీలో చేర్చకపోతే అది వేరే విషయం. ఇంకా రెండు నెలలు ఓపికపడితే ఇంటర్ అయిపోతుంది. రేపు వుద్యోగం చేయాల్సి వస్తే ఇంటర్ లేకపోతే అసంతృప్తిచెందుతుంది కదండీ! అదే ఒకవేళ ఇంటర్మీడియట్ పూర్తయితే మా నాన్నగారు చదివించబట్టే కదా ఇవ్వాళ నేను ఈ వుద్యోగం చేయగలుగుతున్నాను అని జీవితాంతం మిమ్మల్ని గుర్తుంచుకుంటుంది కదండీ!"

"నిజమేనమ్మా, కానీ..."

"మేం అందరం చదువుకోవటం లేదా? ఏమవుతుంది? అసలు మా కాలేజీలో మగపిల్లలకంటే ఆడపిల్లలే ఎక్కువండీ!"

"సరేనమ్మా, నీమాటని ఎందుకు కాదనాలి? "

"ఈరోజుల్లో చాలామంది చెప్పేదొకటీ, చేసేదొకటండీ! అందరూ మీలాగవుంటే ఎంత బాగుంటుందండీ!"

పూజారి ప్రసన్న వదనుడైపోయాడు. ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

"రేపట్నించీ పోవే కాలేజీకి! వేధవ్వేషాలు వేయద్దు. ఆడపిల్లలు అందరితోపాటే కలిసి మసలుకో! నువ్వొక్కదానివే వేరేగా అఘోరించవద్దు" రాధతో చెప్పాడు.

అప్పటివరకూ అన్యమనస్కంగానూ, దిగులుగానూ గడిపిన రాధ పెదవులమీద చిరునవ్వులు కురిశాయి.

మనసు కరుణమీద కృతజ్ఞతతో నిండిపోయింది.

"ఇదంతా నీ పుణ్యమే కరుణా! నా జీవితంలో నువ్వు చేసిన మేలు ఎప్పటికీ మరచిపోలేను. ఏంచేస్తే నీ రుణం తీరుతుందో, ఎప్పటికి తీరుతుందో!"

"ఆపు... బ్యాండ్ ఆపు! నువ్వు బ్యాండ్ ఆపితే చాలు, నా రుణం వడ్డీపైసలతోసహా

తీరిపోయినట్లే"

"పో కరుణా... నీతో మంచిమాట చెప్పు కుందామన్నా నువ్వు వినే మనిషివికాదు, ప్రతిదానికీ నీతో తంటాయే!"

"సరేలే, పరీక్షలు దగ్గరకొచ్చాయి. ఇక మనం వ్యవహారాలు పెట్టుకుని కూర్చుంటే వుపయోగం వుండదు. చదువుమీద శ్రద్ధ పెట్టడం మంచిది"

"అవును. బాగా చదువుదాం కరుణా!"

"టెన్త్‌లో నీకు ఎలా మార్కులు వచ్చాయో, ఇంటర్‌లో కూడా అలాంటి రిజల్ట్ తీసుకురావాలి. ఫస్ట్ ఇయర్ పోయినా, ఈ ఇయర్‌లో అయినా నీ ప్రతాపాన్నీ, శక్తిసామర్థ్యాల్నీ చూపెట్టాలి!" అంది కరుణ.

"తప్పకుండా కరుణా! నేను ఈ రెండు నెలలూ గట్టిగా చదువుదామనే నిర్ణయించుకున్నాను. చూడు, సెకండ్ ఇయర్‌లో ఎలాంటి మార్కులు తెచ్చుకుంటానో!"

"నీలో ఆ పట్టుదల వుంటే నీకు తప్పకుండా మార్కులు వస్తాయి రాధా! నువ్వు చదవాలి. పోనీ, రేపట్నించీ మా ఇంటికి రావే! ఇద్దరం మా ఇంటి దగ్గర కంబైన్డ్‌గా చదువుకుందాం!"

"మా నాన్న ఏమైనా అంటాడేమో కరుణా!"

"మీ నాన్నకి నేను చెప్పి వప్పిస్తాలే!" అని కరుణ పూజారికి విషయం చెప్పి అనుమతి తీసుకుంది.

రాధ, కరుణ కలిసి వుమ్మడిగా చదువుకోవడం మొదలుపెట్టారు. ఫిజిక్స్, కెమిస్ట్రీ ఒకటే కాబట్టి, ముఖ్యమైన ప్రశ్నలు గుర్తుపెట్టుకోవటం, చర్చించుకోవటం, బిట్స్ ఒకటే రెండుసార్లు చెప్పుకోవడం ఇలా వుమ్మడిగా చదివారు.

నిద్రాహారాలు కూడా మరచిపోయినట్లు ఇద్దరూ కష్టపడి చదివారు.

ఇంటర్మీడియట్ పరీక్షలు రాశారు. ఇద్దరూ సంతృప్తికరంగానే రాసినట్లు భావించారు.

పరీక్షలు అయిన తరువాత రాధ వాళ్ళ అమ్మమ్మ ఊరు వెళ్ళిపోయింది. కరుణ ఇంటివద్దే ఉంది.

పరీక్షల ఫలితాలకోసం ఎదురుచూడటం మొదలుపెట్టారు.

"కరుణా... నేను ఒకమాట చెపుతా వింటావా? " కరుణ మంచంమీద పడుకుని వుంటే, సరస్వతమ్మ తలగడ వద్ద కూర్చుని తలలో పేలు వున్నాయేమోనని చూస్తూ అడిగింది.

"చెప్పమ్మా... నువ్వు చెబితే ఎందుకు వినను? "

"వినడం కాదు, నేను చెప్పినట్లు చెయ్యాలి!"

"చెప్పమ్మా"

"నువ్వు వప్పుకుంటానంటేనే చెపుతా!"

"అమ్మా, నువ్వు చెప్పేమాట నాకు ఆమోదయోగ్యంగా వుంటేనే వింటా! అంతే తప్ప, నువ్వేదో చెప్పి అది నాకు ఇష్టంలేకపోతే, నేను వినలేదని తరువాత బాధపడటం అనవసరం"

"అది కాదమ్మా... అక్కా, నువ్వూ నాకు రెండు కళ్ళులాంటి వాళ్ళు. మీకాల్లో ముల్లు గుచ్చుకుంటే నా కంట్లో గుచ్చుకున్నంతగా నాకు బాధ కలుగుతుంది. మీరు సుఖంగా బతకటమే నాక్కావలసింది. ఎప్పుడూ నేను మీ మేలే కోరుకుంటాను"

"కాదని ఎవరన్నారు? నువ్వేకాదమ్మా! ఏ కన్నతల్లి అయినా బిడ్డల మేలు కోరుకుంటుందేకానీ, కీడు ఏ తల్లీ కోరుకోదు. ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి? "

"నువ్వు వినాలి. అలాగయితేనే చెపుతా!"

"మంచిమాట చెప్పు వింటాను. అంతే కానీ పెళ్ళిచేసుకో, పెటాకులు చేసుకో అంటూ చెపితే మాత్రం వినను. చెప్పు, నీ మాట కాదనును. వింటాను"

"నేను చెప్పేది అదే మాటమ్మా! నువ్వు పెళ్ళిచేసుకోవటమే నాక్కావలసింది"




"అంటే నేను సుఖంగా బతకటం నీకు ఇష్టం లేదన్నమాట. అక్క కష్టపడినట్లు, ఇప్పటినించే కష్టపడుతూ జీవితాంతం ఏడవమంటావు"

"అదేంమాట కరుణా? నువ్వు సుఖపడతావనే పెళ్ళిచేసుకోమని చెప్పటం! పెళ్ళిచేసుకున్న వాళ్లందరూ కష్టపడుతున్నారా? అయితే లోకంలో ఇక అందరూ ఎందుకు పెళ్ళిళ్ళు చేసుకోవటం? "

"అమ్మా... నువ్వు ఎందుకు ఇంత వెనుకబడి వున్నావో నాకు అర్థంకావటంలేదు. ఇవ్వాళ ఆడపిల్లలు చాలామంది పెద్దపెద్ద చదువులు చదువుకుంటున్నారమ్మా! మన వూళ్లోనే చూడు, ఎంతమంది చదువుకుంటున్నారు! ఎక్కడెక్కడికో కూడా వెళ్ళి చదువుకుంటున్నారు. నేను బాగా చదువుకోవాలమ్మా! నా చదువు పూర్తిగా అయిపోయిన తరువాతనే పెళ్ళి గురించి ఆలోచించేది. అప్పటివరకూ నువ్వు కాదుగదా, ఆ బ్రహ్మదేవుడు వచ్చిచెప్పినా వినను"

"నీ పెడసరం నీదే తప్ప నా మాట వినవన్నమాట! మిమ్మల్ని పెంచి ఇంత పెద్దచేయటానికి నేను ఎంత కష్టపడ్డానో మీకేం తెల్సమ్మా!" అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది సరస్వతమ్మ.

"కొన్ని విషయాల్లో చాలా కఠినంగా వుండాలమ్మా నువ్వు ఎందుకు బాధపడుతున్నావో నాకు అర్థంకావటంలేదు. నువ్వే కాదు, ఏ తల్లి అయినా కని వదిలిపెడితే బిడ్డలు పెద్దవాళ్ళు కారు. ఎవరినయినా పెంచి పెద్ద చేయాల్సిందే. నా చదువు విషయంలో నువ్వు ఎంత ఏడ్చి గగ్గోలు పెట్టినా నేను వినదలుచుకోలేదు. చదువుకోవాలి. మామూలుగా కాదు, పెద్ద చదువే చదువుకోవాలి. అప్పటి వరకూ నేను ఎవరి మాటా వినను" ఖండితంగా చెప్పింది కరుణ.

కరుణ ఇల్లు వదిలిపెట్టి ఏదో వూరు దగ్గర కానీ, దూరంకానీ వెళ్ళి చదువుకోవటం సరస్వతమ్మకి ఏమాత్రం ఇష్టంలేదు.

కూతురు మనసు మార్చాలని తరువాత వారంరోజులు సరస్వతమ్మ అనేక విధాలుగా ప్రయత్నించింది. బుజ్జగించింది. బతిమాలింది. అలిగింది. ఏడ్చింది. కోప్పడింది. ఇంట్లో భీభత్సాన్నీ, రణరంగాన్ని సృష్టించింది.

కరుణ అణుమాత్రం చలించలేదు.

తల్లి ఎంత మొండిగా వ్యవహరిస్తోందో, కూతురు అంతకంటే మొండిగా వ్యవహరించింది. కూతురికి తండ్రి సమర్ధన గట్టిగా వుంది.

కూతురి మనసు మార్చటం అసంభవం అని చివరికి సరస్వతమ్మ తన మనసే మార్చుకుంది. "అంతగా మొండికి పడి తను మాత్రం సాధించేదేం వుంది! కూతురికి తనమీద వ్యతిరేకత పెరగటం, తనంటే ద్వేషం ఏర్పడటం తప్ప మరో వుపయోగం లేదు! కానివ్, ఎలా జరగాల్సివుంటే అలా జరుగుతుంది!" అని నిశ్చయించుకుంది ఆమె.

కూతురు పట్టు వుడుంపట్టు అనే విషయంలో మాత్రం ఆమె నమ్మకం మరింత బలపడింది.

వీళ్లు ఈ గొడవలో వుండగానే ఇంటర్మీడియట్ ఫలితాలు వచ్చాయి. కరుణకి ద్వితీయ సంవత్సరంలో 80 శాతం మార్కులు వచ్చాయి. రాధకి 86 శాతం మార్కులు వచ్చాయి.

"కరుణా.. మంచి కోచింగ్ సెంటర్‌లో చేరి ఎంసెట్ కోచింగ్ తీసుకోమ్మా! రేపు ఎంసెట్‌లో ర్యాంక్ వస్తే బాగుంటుంది" అన్నాడు శంకరం.

"ఇంత పోటీ మీద ఎంసెట్ రాయడం నాకు ఇష్టంలేదు నాన్నా! కోచింగ్ ఏడాది కాలం తీసుకోవాలి. కోచింగ్‌కి చాలా డబ్బు కట్టాలి. రేపు సీట్ రాకపోతే డబ్బుకి డబ్బూ వేస్టవుతుందీ, వన్ ఇయర్ టైమూ వేస్టవుతుంది. పైగా నాకు ఎంసెట్ మీద

ఆసక్తి కూడా లేదు"

"అన్నీ అలాగంటే ఎలానమ్మా? మామూలు డిగ్రీ చదివి ఏం చేస్తావు? కోచింగ్‌కి డబ్బు విషయం నీకెందుకు? డబ్బు కట్టేవాళ్లం మేం వున్నాంకదా! నా మాట విని కోచింగ్ తీసుకోమ్మా! ఇవ్వాళ అందరూ ఎంసెట్టే అంటున్నారు"

"లేదు నాన్నా, బిఎస్సీలో చేరుతాను"

"బిఎస్సీ చేసి ఏం చేయాలమ్మా? పెద్దగా వుపయోగం వుండదు"

"ఎంఎస్సీ తరువాత పీహెచ్‌డీ చేసి సైంటిస్ట్ కావాలని వుంది నాన్నా! అన్నీ అనుకూలిస్తే సైంటిస్ట్‌ని అవుతాను"

"కోచింగ్‌కే వన్ ఇయర్ టైం వేస్తంటు న్నావు. నీ ప్రణాళిక ప్రకారం అయితే చాలా టైం పడుతుందికదమ్మా!"

"పట్టినా పర్లేదు. ఎంసెట్‌కంటే ఇదే మంచిదని నా వుద్దేశం"

"సరే కానీయ్. డిగ్రీ మంచి కాలేజీలో చేరితే బాగుంటుంది. డిగ్రీలో మంచి పర్సెంట్ రావాలి"

"అలాగే" అంది కరుణ.

రిజల్ట్స్ వచ్చిన వారం రోజుల్లో మార్కుల లిస్టులు వచ్చాయి. కాలేజీల అన్వేషణలోపడ్డారు. ఏ కాలేజీ అయితే బాగుంటుందా అని చాలా కాలేజీల వివ రాలూ, విషయాలూ సేకరించారు.

సమీపంలో మహిళా డిగ్రీ కళాశాలలేదు. మహిళా కళాశాలలో చేరాలంటే చాలా దూరం వెళ్లాలి. అయినా అక్కడ హాస్టల్ బాగులేదంటున్నారు.

అన్ని విషయాలూ ఆలోచించి చివరకు జిల్లా కేంద్రంలో వున్న కో ఎడ్యుకేషన్ కాలే జీలోనే చేరాలని నిర్ణయించారు. జిల్లా కేంద్రం వాళ్లకి పది రూపాయల చార్జీలోనే వుంటుంది.

"నీ చదువేమిటో నువ్వేమిటోగా వుండా లమ్మా! ఒకరి విషయాలూ ప్రస్తావనా మన కివద్దు. చక్కగా చదువుకుని మంచి అమ్మా యిగా పేరు తెచ్చుకోవాలి. నీకు సంబంధం లేని విషయాల్లో తల దూర్చవద్దు. ఇక్కడ ఇది మన వూరు. అక్కడ అలా వుండదు. టౌను అంటే చాలా ప్రమాదం రౌడీలూ, గూండాలూ, తాగుబోతులూ అన్ని రకాల వాళ్లూ వుంటారు. ఎంతో జాగ్రత్తగా వుండా లమ్మా!" అని కాలేజీలో చేరడానికి వెళ్లే ముందు సరస్వతమ్మ కూతురికి సవాలక్ష జాగ్రత్తలు చెపుతూ హెచ్చరించింది.

కరుణ తల్లి చెప్పే విషయాలు అన్నిటికీ బుద్ధిగా తలవూపింది.

కాలేజీలో సీటుకి అప్లయ్ చేయడం, సీటు రావడం జరిగిపోయాయి. కాలేజీ ఆధ్వర్యం లోనే ఉన్న లేడీస్ హాస్టల్‌లో సీటు కూడా వచ్చింది.

తండ్రి వెంట వుండగా, కాలేజీలో చేరడా నికి వచ్చింది కరుణ. ఒక చిన్న వూరునించి విశాల ప్రపంచంలోకి వచ్చినట్లుందిప్పుడు.

కాలేజీకి సువిశాలమైన క్యాంపస్ వుంది. పెద్దపెద్ద చెట్లతో వాతావరణం ఆహ్లాదక రంగా వుంది.

మిషనరీల కళాశాల అది. చాలా పాత కాలం నాటిది. కాలేజీ మెయిన్ బిల్డింగ్ ఎప్పుడో చాలాకాలం క్రితం నిర్మించినట్లుగా బంగాళా పెంకులతో పైఅంతస్తు వుంది.

కాలేజీని ప్రారంభించింది స్వతంత్రం వచ్చిన తొలిరోజుల్లో తొలి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ. ఆయన పేరుతో శిలాఫలకం కూడా ఒకటి కాలేజీ బిల్డింగ్ మీద వుంది. అది చాలా పెద్ద బిల్డింగ్.

"విద్యార్థులు నవ భారత నిర్మాతలు. జవ హర్‌లాల్ నెహ్రూ" అని ఆ బిల్డింగ్ మీద రాసివున్న కొటేషన్ పెద్ద అక్షరాలతో ఫర్లాంగు దూరం కనిపించేలా వుంది.

కాలేజీ మెయిన్‌గేటుకి ఎదురుగా పెద్ద సినిమా హోర్డింగ్ ఒకటి వుంది. హోర్డింగ్ మీద ఆ హాలులో ఆడుతున్న సినిమా వాల్‌పోస్టర్ అతికించి వుంది. సినిమా పేరు శోభనం రాత్రి. పోస్టర్‌లో స్త్రీ పురు




షలు చాలా అసహ్యకరమైన భంగిమలతో వున్నారు. అది అసభ్యకరంగా, జుగుప్సాకరంగా వుంది.

కాలేజీకి వెళ్లేవాళ్లు వచ్చేవాళ్లూ అందరి దృష్టిలో హోర్డింగ్ పడుతుంది. రోడ్డుకి ఎడమవైపు గేటు వుంటే కుడివైపు హోర్డింగ్ వుంది. కాలేజీకి అది స్వాగతం పలుకుతున్నట్లుగా వుంది.

హోర్డింగ్ ముందు ఇద్దరు విద్యార్థులు చేతుల్లో పుస్తకాలు పట్టుకుని ఆసక్తిగా పోస్టర్‌ని తిలకిస్తూ నవ్వుకుంటూ ఏవో జోక్స్ వేసుకుంటూ చర్చించుకుంటున్నారు. మొత్తానికి వాళ్లు పోస్టర్ని గురించే మాట్లాడుకుంటున్నారని తండ్రి వెనుక వస్తూ వాళ్లని గమనించిన కరుణ అనుకుంది.

కాలేజీ వాళ్లు నిర్వహించే లేడీస్ హాస్టల్ వేరే క్యాంపస్‌లో వుంది. అది సమీపంగానే వుంటుంది. అక్కణ్ణించి రోజూ నడిచి రావాలి.

శంకరం కాలేజీ ఫీజూ, హాస్టల్ ఫీజూ కట్టి కరుణని హాస్టల్ రూంలో వదిలిపెట్టి వెళ్లిపోయాడు.

రూంకి ఇద్దరు విద్యార్థినులు వున్నారు. రూం సౌకర్యంగానే వుంది. కరుణ హాస్టల్ రూమ్మేటు ప్రతిభ. వాళ్లది చాలా దూరప్రాంతం. మంచి అమ్మాయి. ఇద్దరూ స్నేహితులు అయ్యారు.

సీనియర్స్‌తో కూడా కరుణ స్నేహాల్ని ఏర్పరుచుకుంది. కలిసిపోయే స్వభావం, చురుకుదనంతో కరుణకి హాస్టల్లో అందరూ పరిచయమయ్యారు. పెద్దవాళ్లని అక్కా అంటూ, చిన్నవాళ్లని పేరుతో ఆప్యాయంగా పిలుస్తూ, అందర్నీ పలకరిస్తూవుండే కరుణ గురించి అందరికీ తెలిసిపోయింది. మంచి అమ్మాయి అనే అభిప్రాయం ఆందరికీ కలిగింది.

రోజూ కాలేజీకి వస్తూ పోతూ హోర్డింగ్ మీద పోస్టర్లు చూడసాగింది కరుణ. ఒక రోజు 'కామదాహం' పోస్టర్ అతికించి వుంది. అది చాలా చండాలంగా వుంది. మళ్లీ వారం రోజులకి 'వయసు కోరిక' పోస్టర్ ప్రత్యక్షమైంది. అది కూడా డిటోనే! తరువాత వారానికి 'మన్మథబాణం'. అన్నీ అసభ్యకరమైన అశ్లీలకరమైన పోస్టర్లే!

పోస్టర్లని మగపిల్లలు చాలామంది ఆసక్తిగా, కుతూహలంగా చూడటం కరుణ చాలాసార్లు గమనించింది.

"అక్కా... రంభ సినిమా హాల్లో ఎప్పుడూ దరిద్రపు సినిమాలు తప్ప మంచి సినిమాలు వేయరా?" కరుణ ఫైనల్ ఇయర్ స్టూడెంట్‌ని అడిగింది కాలేజీకి వస్తూ.

"వేయరు" ఒక్క ముక్కలో చెప్పింది సీనియర్.

"అదేమిటక్కా?" ఆశ్చర్యంగా అడిగింది కరుణ.

"అంతే, రంభ హాలు ఎవరిది అనుకున్నావు! సాక్షాత్తూ మున్సిపాల్టీ ఛైర్మన్ లక్ష్మీనారాయణది. అదొక డొక్కుహాలు. ఆ హాల్లో ఎప్పుడూ డైరెక్ట్ తెలుగు సినిమాలు వేయరు. మలయాళం సినిమాలు డబ్బింగ్‌వి తీసుకొచ్చి వేస్తుంటారు?"

"ఎందుకు అలాగా"

"ఏమో నాకు తెలియదు. బహుశా అవి తక్కువ డబ్బులకి ఏమైనా వస్తాయేమో! మన కాలేజీ గేటు ముందు రంభ హాలు వాళ్ల హోర్డింగ్ వుందికదా! నేను సంవత్సరన్నర నించీ అంటే హోర్డింగ్ పెట్టినప్పటి నించీ చూస్తున్నాను. ఇంగ్లీషు సినిమాలో హిందీ సినిమాలో మలయాళం సినిమాలో తప్ప తెలుగు సినిమా పోస్టర్ ఒక్కటి కూడా వేయలేదు. ఆ సినిమాలు కూడా అన్నీ బూతు సినిమాలే, కాలేజీగేటు ముందు వేసే పోస్టర్లు కూడా ఎప్పుడూ బూతు పోస్టర్లే"

"చండాలపు సినిమాలూ, చండాలపు పోస్టర్లూ! అవి మరీ కాలేజీ గేటు ముందు వేయడం ఏమిటక్కా? వేలమంది

స్టూడెంట్స్ వున్న కాలేజీ మనది. ఇలాంటివి చూస్తే స్టూడెంట్ల మనసులు పాడుకావూ? వాళ్లు చెడిపోరూ? "

"స్టూడెంట్ల మనసులు శుభ్రంగా పాడవుతాయి. వాళ్లు శుభ్రంగా చెడిపోతారు. చెడిపోతే ఎవరికి ఏమిటి నష్టం? "

"కాలేజీ గేటు ముందు వేయడం ఏమిటి మరీ దారుణం కాకపోతే? "

"ఇంకెక్కడ వేయమంటావు? అసలు ఆ సినిమాలు చూసేది ఎక్కువ ఎవరనుకుంటున్నావు? ముసలివాళ్ళు, ముతకవాళ్లు వచ్చి ఆ సినిమాలు చూస్తారనుకుంటున్నావేమిటి? రంభ సినిమా హాలుకి మహారాజ పోషకులు మన కాలేజీ స్టూడెంట్లే!"

"నిజమా? " ఆశ్చర్యంగా అడిగింది కరుణ.

"మరి ఇక్కడ అంత పెద్ద హోర్డింగ్ ఎందుకు పెట్టించాడనుకున్నావు? ఆ హాలుకి మన స్టూడెంట్స్ చాలామంది వెళ్తుంటారు ఈ సినిమాలు చూడటానికి. నిజమో, కాదో కానీ నాకు ఒక ఫ్రెండ్ చెప్పింది, ఈ సినిమాలకి మధ్యలో అక్కడక్కడా బ్లూ ఫిలింలు కూడా పెట్టి వేస్తారట. ఆ బ్లూ ఫిలిమ్స్ చూడటానికే మన స్టూడెంట్స్ వెళ్తుంటారట"

"చాలా ఘోరం... అసలు హాలు పేరేంటక్కా అలా వుంది? రంభ ఏమిటీ? "

"మన టౌన్‌లో వున్న థియేటర్ల పేర్లు అవేగా. మేనక, అప్సర, రంభ, ఊర్వశీ థియేటర్స్! ఈ థియేటర్ల వాళ్లకి అంతకు మించి మంచి పేర్లు దొరకలేదు. ఇప్పుడు వస్తున్న సినిమాలకి మాత్రం మంచి పేర్లు దొరుకుతున్నాయా? అందరూ చూడతగిన విధంగా వుంటున్నాయా సినిమాలు"

"ప్రిన్సిపాల్ గారికి చెప్పి అసలు అక్కడ ఆ హోర్డింగే లేకుండా ఎత్తేయించాలి. లేకపోతే కాలేజీముందు ఏమిటీ రోతగా"

"మనకెందుకులే ఆ విషయం! మనపాటికి మనం చదువుకుంటే సరిపోతుంది. మనం ఆ సినిమాలు చూస్తున్నామా, పెడుతున్నామా? ఎవరో చూస్తే మనకెందుకు? " అంటూ ఆ స్టూడెంట్ క్లాస్‌రూంలోకి వెళ్లిపోయింది.

ఆ హోర్డింగ్ మీద మూడు రోజులకీ, నాలుగు రోజులకీ ఏదో ఒక బూతు పోస్టర్ బూతు పేరు తగిలించుకుని ప్రత్యక్షమవుతూ వుంది.

ఆరోగ్యకరమైన ఆలోచనలతో, మంచి భావాలతో, మంచి లక్షణాలతో పెరగాల్సిన ఇరవై సంవత్సరాల లోపు పిల్లలు, ఇలాంటి నీచమైన, జుగుప్సాకరమైన సినిమాలు చూస్తున్నారంటే కరుణ మనసు అదోలా అయిపోయింది.

కాలేజీలోనించి బయటకు వస్తున్న విద్యార్థులకి స్వాగతం పలుకుతున్నట్లుగా గేటుకి అభిముఖంగా వున్న హోర్డింగ్‌ని వీలైనంత త్వరగా అక్కడనించి తీయించే ప్రయత్నం చేయాలని నిశ్చయించుకుంది కరుణ.




"దివ్యకి రెండు రోజులనించీ విరోచనాలు. వార్డెన్‌గారు డాక్టరు దగ్గరకి తీసుకుపోయి చూపెట్టారు. మందులు వాడుతున్నా పెద్దగా తగ్గలేదు!" మెస్‌లో తన పక్కన కూర్చున్న అమ్మాయి మరో అమ్మా

యికి చెపుతుంటే కరుణ విందీ.

కరుణావాళ్ల ముందు బ్లాక్‌లో దివ్యావాళ్ల రూం. కరుణకి కొద్దిగా పరిచయమే దివ్య. ఫైనలియర్ డిగ్రీ స్టూడెంట్. వాళ్ల అమ్మా నాన్న సుదూర ప్రాంతం ఎక్కడో మహారాష్ట్రలో పొలాలు కౌలుకి తీసుకుని పంటలు పండించుకోవటానికి వెళ్లారు. దివ్యని కాలేజీ హాస్టల్లో చేర్చారు.

“దివ్య దగ్గర ఎవరు వున్నారు అక్కా?” కరుణ అడిగింది.

“ఎవరు వుంటారు? వుండి ఎవరేం చేస్తారు?” అంది ఆ అమ్మాయి.

పూర్తి సమయం దివ్య వద్ద వుండటానికీ, విరోచనాలతో బాధపడుతున్న దివ్యని కనిపెట్టుకుని చూసుకోవటానికీ వార్డెన్‌కి వీలు పడదు. బాధ్యత కలిగిన వార్డెన్ ఆమె. అయినా తనకి వున్న పనుల వత్తిడితో అది సాధ్యం కాదు. హాస్టల్లో ఎప్పుడూ ఎవరో ఒకరికి అనారోగ్యంగానే వుంటుంది.

దివ్యకి సీరియస్ అయితే హాస్పిటల్లో చేర్చే వాళ్లేకానీ సీరియస్‌కాదు. తన తల్లిదండ్రుల్ని పిలిపించడం అనవసరం. పిలిపించినా వాళ్లు అప్పటికప్పుడే వచ్చే అవకాశం లేదు.

విద్యార్థులు ఎవరికి వాళ్లే పలకరించిపోతున్నా ప్రత్యేకంగా పట్టించుకున్న వాళ్లు లేరు.

ఇలాంటి స్థితిలో కరుణ దివ్యని కనిపెట్టుకుని అవసరమైన సేవచేయసాగింది.

తను వెంటవుండి డాక్టర్ దగ్గరకి తీసుకుపోయింది. వేళకి మందులు ఇవ్వడం, ద్రవ ఆహారపదార్థాలు ఇవ్వడం, రోగిని కనిపెట్టుకుని కంటికి రెప్పలా చూసుకుంది. రెండు రోజులు కాలేజీ మానుకుంది.

కరుణ సహాయం ఫలితమో, మందుల ప్రభావమో మొత్తానికి మూడు రోజుల్లోనే దివ్య పూర్తిగా కోలుకుంది. ఆపదలోనూ, అనారోగ్యంలోనూ మనిషికి మరో మనిషి తోడు వుంటే అదే కొండంత అండ. ఉన్న తోడు వలనే జబ్బు చాలావరకూ నెమ్మదించే అవకాశం వుంది.

అంతకుముందు హాస్టల్లో ఎవరైనా అనారోగ్యం పాలయితే ఎవరూ ప్రత్యేకంగా పట్టించుకునేవాళ్లు కాదు. అవసరమైన మందులూ, పండ్లు, బ్రెడ్‌లాంటివి తెచ్చి ఇవ్వడం, వార్డెన్‌కి చెప్పడంతోనే తమ బాధ్యత తీరిపోయిందనుకునేవాళ్లు. ఎవరికి వాళ్లే అలా అలవాటైపోయారు.

“కరుణ చాలా హెల్ప్‌ఫుల్‌గా వుంది దివ్యకి! ఎంత బాగా చూసుకుందో! తనకి ఫ్రెండ్‌షిప్ కూడా లేదు. తన క్లాస్‌మేట్ కాదు. మనమూ వున్నాం ఎందుకూ? మూడేళ్లనించీ మనతో కల్సి వుంటున్నా మనం సరిగా సాయం చేయలేకపోయాం అని ఫైనలియర్ స్టూడెంట్స్ బాధపడ్డారు. ఎవరికి వాళ్లే అవమానంగా ఫీలయ్యారు. తమ తప్పు తెలుసుకున్నారు.

“ఇప్పటినించీ ఎవరికి బాగులేకపోయినా రూమ్మేటు కానీ రూమ్మేట్ కాకపోతే మరొకరుకానీ వంతులు వేసుకుని కాలేజీ మానుకుని తోడుగా వుండాలి. ఇది మన బాధ్యత! అందరం ఈ రూల్‌ని పాటిద్దాం” అని స్టూడెంట్స్ చాలామంది అనుకున్నారు.

ఈలోగా కరుణ అవార్డు అందుకున్న విషయం ఒక స్టూడెంట్ ద్వారా హాస్టల్ అంతా తెలిసిపోయింది. అది కూడా సాహసానికీ, సేవాభావానికీ చిహ్నంగా ఇచ్చిన ప్రత్యేకమైన అవార్డు అనే విషయం కూడా తెల్సింది. వీటితో కరుణని అందరూ అభిమానంగా చూడటం మొదలుపెట్టారు.

గర్వం, అహంకారం లేకుండా అణకువగానూ, నెమ్మదిగానూ వ్యవహరిస్తూ ఆప్యాయంగా వుంటూ కరుణ అందరికీ తలలో నాలుక అయ్యింది.

అల్లరి చిల్లరగా లేకుండా బాధ్యతగా, హుందాగా మెలగుతుండటంతో వార్డెన్లు కూడా కరుణ అంటే ఇష్టపడ్డారు.



వాళ్లు కరుణని గౌరవంగా చూస్తున్నారు.

తనకి తెల్సిన స్టూడెంట్స్ అందరితోనూ కరుణ హోర్డింగ్ విషయం ప్రస్తావించింది.

"కాలేజీ గేటు ముందు ఏమిటక్కా అసహ్యకరంగా ఆ హోర్డింగ్. ఎప్పుడు చూసినా ఛండాలపు బొమ్మలు తప్ప ఒక్కసారి కూడా మంచి బొమ్మలు వేయరు. ఎంత కాలం ఆ నీచపు బొమ్మలు చూస్తూ తలవంచుకుని వెళ్లిపోదాం? ప్రిన్సిపాల్ గారితో చెప్పి ఎలాగైనా హోర్డింగ్ తీయించేద్దాం అక్కా!"

"అవును, అలాంటి పోస్టర్లు కాలేజీ గేటుముందు వుండకూడదు. ఇది విద్యార్థులు చదువుకునే కాలేజీనా, అల్లాట ప్పానా? ఎంతకాలం ఇలాంటి చండాలపు బొమ్మలు సహిద్దాం? ప్రిన్సిపాల్ గారికి చెప్పి వెంటనే తీయిద్దాం, లేదా మనమే దాన్ని తుక్కుచేసి వదిలిపెడదాం" అని వెంటనే చాలామంది స్పందించారు.

మరికొందరు దాన్ని గురించి పెద్దగా పట్టించుకోకపోయినా కరుణ మీదవున్న సదభిప్రాయంతో ఆమోదం ప్రకటించారు.

చాలాకొద్దిమంది మాత్రం "ఉంటే ఉండనీయండి, అది మనల్ని ఏం చేసింది? మనం చెబితే అంత తేలిగ్గా తీసివేస్తారా? అది మనకు అనవసరం" అని నిరాశగా, తమకి సంబంధం లేనట్లు మాట్లాడారు. కరుణని సమర్థించిన వాళ్లే ఎక్కువమంది వున్నారు.

ప్రిన్సిపాల్ ని కలుసుకున్నారు.

"కాలేజీ గేటు ముందు ఏమిటిసార్ అసహ్యాకరంగా పోస్టర్లు! మేం చూడలేకపోతున్నాం. రోజూ బొమ్మలు కంటపడేటప్పుడు సిగ్గుతో చితికిపోతున్నాం. మీరు హోర్డింగ్ తీయించండి సార్!"

"అవును నేనూ చూస్తున్నాను. చాలా న్యాస్టీగా వుంటున్నాయమ్మా! ఆ సినిమాలు ఇంకెంత న్యాస్టీగా వుంటాయో! హోర్డింగ్ తీసేయించమని మీరు కొంతమంది కలిసి ఒక విజ్ఞాపన పత్రం రాసివ్వండి. తీసేయిస్తాను" అన్నాడు ప్రిన్సిపాల్.

అప్పటికప్పుడే విద్యార్థులు హోర్డింగ్ తీసేయించమంటూ ప్రిన్సిపాల్ కి ఒక అర్జీ రాసి ఇచ్చారు.

ప్రిన్సిపాల్ మున్సిపల్ కమీషనర్ కి ఫోన్ చేసి విషయం చెప్పాడు.

"రంభా థియేటర్ హోర్డింగా సార్ మీ గేటు ముందు వున్నదీ? దాని మీద నేను నిర్ణయం తీసుకోలేను సార్! మున్సిపల్ కౌన్సిల్ నిర్ణయించాల్సిన అంశం అది. ఛైర్మన్ గారు ఇంకా ఆఫీసుకి రాలేదు. వచ్చిన తరువాత వారికి విషయం వివరిస్తాను. దానిమీద నిర్ణయం తీసుకోవాల్సింది వారే సార్" వినమ్రంగా చెప్పాడు కమీషనర్.

తరువాత రెండు గంటలకి మున్సిపల్ ఛైర్మన్ దగ్గర్నించి ప్రిన్సిపాల్ కి ఫోన్ వచ్చింది.

"ఏమిటయ్యా! మీ కాలేజీ గేటుముందు మా థియేటర్ హోర్డింగ్ తీసేయించమని కమీషనర్ కి ఫోన్ చేసి చెప్పావట ఏమిటి? అది మీ కాలేజీ గ్రౌండ్ లో వుందా? పబ్లిక్ ప్లేస్ లో వుందా? "

"పబ్లిక్ ప్లేస్ లోనే వుందిసార్"

"అయితే అది తీసేయించమని చెప్పడానికి నీవెవరివి? ఆ హోర్డింగ్ కి మేం మున్సిపాలిటీకి ట్యాక్స్ కడుతున్నాం తెలుసా? మీ ప్రెమిసెస్ లో వుంటే చెప్పండి. అంతే తప్ప పబ్లిక్ ప్లేస్ లోనిది తీసేయమని చెప్పడానికి నీకేం పవర్ వుందీ, రైట్ వుందీ? "

"నేను కాదు సార్! స్టూడెంట్స్ డిమాండ్ చేస్తున్నారు. వాళ్లు అడిగితేనే నేను ఫోన్ చేసి చెప్పింది!"

"వాళ్లు అడిగితే అది మనకి సంబంధించిన విషయం కాదని చెప్పవయ్యా"

"హోర్డింగ్ మీద చాలా న్యాస్టీ పోస్టర్స్ వేస్తున్నారు సార్. స్టూడెంట్స్ ఇబ్బంది పడుతున్నారు"





"వాళ్ళకి హోర్డింగ్ నచ్చకపోతే వాళ్లను చూడొద్దని చెప్పవయ్యా! మేం వాళ్లని బల వంతంగా చూడమని చెపుతున్నామా? ఆ పోస్టర్లని ఇష్టంగా చూసేవాళ్లులేరా? ఎవరె వరి ఇష్టాలు వాళ్లవి! స్టూడెంట్స్‌కి ఇంత మాత్రం చెప్పలేనివాడివి నువ్వేం ప్రిన్సిపాల్ వయ్యా" అని ఛైర్మన్ దబాయిస్తూ, హీనప రుస్తూ మాట్లాడాడు ప్రిన్సిపాల్‌తో.

ప్రిన్సిపాల్‌కి అవమానం, బాధ కలిగింది.

ఛైర్మన్ చెప్పిన విషయాన్ని యధాత థంగా, ఉన్నది ఉన్నట్లుగా విద్యార్థులకి చెప్పాడు.

"అది తీసేయించటానికి నా శక్తి చాల దమ్మా! మీ ఇష్టం, మీరు ఏమైనా చేయండి. ఎవర్కైనా వెళ్లి చెప్పుకోండి" అన్నాడు.

తనని అవమానించిన థియేటర్ ఛైర్మన్‌ని తలచుకుంటే కోపం నషాళానికి అంటుకుంటోంది ప్రిన్సిపాల్‌కి. హోర్డింగ్ అక్కడ లేకుండా వుంటేనే బాగుంటుందని కోరుకున్నాడు. బయటపడకపోయినా విద్యా ర్థులకి తన పూర్తి మద్దతు ఇవ్వాలని భావిం చాడు.

కరుణ వందమంది విద్యార్థుల వరకూ గ్యాదర్ చేసింది. అందరూ కలిసి దగ్గర లోనే వున్న ఎంఆర్‌ఓ ఆఫీసుకి వెళ్లి ఎంఆ ర్‌ఓకి విషయం చెప్పారు.

"హోర్డింగ్ వుంటే మాకు అభ్యంతరం లేదుసార్. దానిమీద వేస్తున్న పోస్టర్లే నీచంగా వుంటున్నాయి. మీరు ఒక్కసారి చూడండి. కనీసం అలాంటి చౌకబారు పోస్టర్లు అయినా వేయవద్దని చెప్పండి సార్"

"అలాగే రేపట్నించి హోర్డింగ్ మీద అలాంటి పోస్టర్లు వేయవద్దని వార్నింగ్ ఇస్తాం. వాళ్లని జాగ్రత్తగా వుండమని హెచ్చరిస్తాను" అన్నాడు ఎంఆర్‌ఓ హుందాగా.

ఆ ఎంఆర్‌ఓ పెద్ద లంచగొండి. రాజ కీయ నాయకుల అడుగులకి మడుగులొత్తే వాడు. ఏ రాజకీయ నాయకుడికి ఎదురు తిరిగినా నిండా అవినీతి రొచ్చులో కూరుకు పోయిన తను శంకరగిరి మాన్యాలు పట్టాల్సి వుంటుందని వాళ్లని కాకా పట్టటం, భజన చేయటం, ముడుపులు సమర్పించుకో వడం చేస్తుంటాడు.

ఎంఆర్‌ఓ ఛైర్మన్ గారింటికి వెళ్లి విద్యా ర్థులు ప్రదర్శనగా వచ్చి తనకి వినతి పత్రం ఇచ్చిన విషయాన్ని వినయంగా చెప్పాడు. హోర్డింగ్ మీద బూతు పోస్టర్లు కాకుండా మంచి పోస్టర్లు వేయమని కోరినట్లు చెప్పాడు.

"మా థియేటర్‌కి వచ్చిన వాల్‌పోస్టర్లే వేస్తారుకానీ కాలేజీ పిల్లలకోసం వేరే ప్రత్యేక పోస్టర్లు రావుకదా! మేం పోస్టర్లని ప్రింట్ చేయించంకదా!"

"ఉన్నవాటిలోనే మంచివి చూసి వేయండి సార్"

"అలాగే, థియేటర్‌లోని కుర్రవాళ్లకి చెపు తాలే. రేపట్నించి కాలేజీ గేటు వద్ద కాస్త మంచి పోస్టర్లు చూసి వేయండ్రా అని చెపు తాను" అన్నాడు ఛైర్మన్ నవ్వి.

ఎంఆర్‌ఓ ప్రిన్సిపాల్‌కి ఫోన్ చేసి విద్యా ర్థులు వచ్చిన విషయం, వాళ్లు తనకి సమ ర్పించిన మెమోరాండం విషయం చెప్పాడు. తను ఛైర్మన్‌తో మాట్లాడాననీ, ఇకముందు హోర్డింగ్ మీద మంచి పోస్టర్లే వేస్తారని తనకి హామీ ఇచ్చాడని చెప్పాడు.

ఛైర్మన్ హామీ ఇచ్చిన మరుసటి రోజు నించీ హోర్డింగ్ మీద మంచి పోస్టర్లు అంటే మరింత నగ్నంగా, మరింత జుగుప్సా కరంగా వుండే పోస్టర్లని అంటిస్తున్నారు. వాళ్ల దృష్టిలో అవి మంచివన్న మాట.

వీళ్లు ఏం చేయగలరనే ధీమాతోనూ, పంతానికి పోయి వాళ్లు కావాలనే ఇంకా అసహ్యాకరమైన పోస్టర్లు అంటిస్తున్నారని అందరికీ అర్థమైపోయింది.

"ఇందుకు వ్యతిరేకంగా మనం ఏమీ

చేయలేమా?" అని విద్యార్థులు తలలు పట్టుకుని కూర్చున్నారు. వాళ్ల వేదన అరణ్యరోదన అయింది.

★ ★ ★

"మెయిన్‌గేట్ ఎదురుగా వున్న వాల్‌పోస్టర్స్‌ని చూశారా మేడం?" సౌమ్య మేడంని అడిగింది ఒక రోజు కరుణ.

"ఎప్పుడో ఒకటీ, రెండుసార్లు చూశాను. ఆ థియేటర్‌లో ఎక్కువగా చెత్త సినిమాలే వస్తుంటాయి" అంది సౌమ్య.

"ఆ పోస్టర్లు తీయించాలంటే మాకు సాధ్యం కావడంలేదు మేడం. ప్రిన్సిపాల్‌కి చెప్పాం, ఎంఆర్‌ఓకి చెప్పాం, వూరేగింపు తీశాం. అయినా మా మాటని ఆలకించిన వాడులేడు"

"అంతే రాజకీయ నాయకుల్ని మనం ఏం చేయగలం?"

"పోస్టర్లని తీయించాలంటే ఏం చేస్తే బాగుంటుంది మేడం! మీ సలహా ఏమిటి?"

"నాకు మాత్రం ఏం తెల్సు? ఏం చేస్తే బాగుంటుందో ఆలోచించండి మీరే" అని నవ్వి, ఆమె స్టాఫ్ రూంలోకి వెళ్లిపోయింది.

సౌమ్య లెక్చరర్ అయినా కరుణ వాళ్ల కంటే మూడు నాలుగేళ్లు మాత్రమే పెద్దదై ఉంటుందేమో. సన్నగా, తెల్లగా, బలహీనంగా చూడటానికి స్టూడెంట్‌లానే వుంటుంది.

ఒక్కోరోజు ఆమె సల్వార్‌కమీజ్ వేసుకుని వస్తుంది. తెలియనివాళ్లు అప్పుడు ఆమెని స్టూడెంట్‌గానే భావిస్తారు. ఎక్కువగా చీరకట్టుకుని వస్తుంది కాబట్టి ఆమెని లెక్చరర్‌గా గుర్తిస్తారే తప్ప లేకుంటే స్టూడెంట్ అనే అనుకుంటారు.

సౌమ్య పేరుకి తగ్గట్లే చాలా సౌమ్యంగా వుంటుంది. క్లాసులో కాకుండా విడిగా చాలా చిన్నగా, నెమ్మదిగా మాట్లాడుతుంది. తెలియనివాళ్లు అమాయకురాలు అనుకునే అవకాశంకూడా వుంది.

క్లాస్‌రూంలో సౌమ్య ప్రతిభ చూడాలి. అద్భుతమైన కంఠస్వరంతో చక్కటి ఉచ్చారణతో, అనర్గళమైన వాగ్ధాటితో ఆమె క్లాస్ వుంటుంది. క్లాస్‌లో ఎప్పుడూ పిన్‌డ్రాప్ సైలెన్సే! ఆమె పాఠం చెపుతుంటే విద్యార్థులు మంత్రముగ్ధులైపోతారు. మాట్లాడితే ఆమె నోటినించి వచ్చే పదం మిస్ అవుతామనే వుద్దేశంతో శిలాప్రతిమల్లా తదేకంగా అలానే చూస్తుండిపోతారు. ఆమె పాఠం చెబితే ఎంత బండ విద్యార్థికి కూడా మనసులో నాటుకుపోవాల్సిందే! రిపీట్ చేస్తూ మధ్యమధ్యలో ప్రశ్నలు అడుగుతూ ఆసక్తికరంగా ఆమె చెపుతుంటే విద్యార్థులకి వాళ్లకి తెలియకుండానే పాఠం వచ్చేస్తుంది.

సౌమ్యది అదే ఊరు. వాళ్ల నాన్న ఎలిమెంటరీ స్కూల్ టీచర్. ముగ్గురు అక్కచెల్లెళ్లలో సౌమ్య పెద్దది.

సౌమ్య సౌందర్యాన్ని చూసి, చదువుని చూసి ప్రసాద్ పెళ్లి చేసుకోవాలని ఇష్టపడ్డాడు. ప్రసాద్ దాల్‌మిల్ యజమాని ఏకైక కుమారుడు. లక్షలకొద్దీ ఆస్తివుంది. ఇద్దరు అక్కలకీ పెళ్లిళ్లు అయిపోయాయి.

ప్రసాద్ తన ప్రతిపాదనతో పెద్ద మనుషుల్ని సౌమ్య వాళ్ల ఇంటికి పంపించాడు.

"వాళ్ల స్థాయి ఎక్కడా, మేమెక్కడా? వాళ్లతో మేం దేనిలోనూ తూగలేం! ఆశకి కూడా ఒక హద్దు వుండాలి. వియ్యానికైనా కయ్యానికైనా సమవుజ్జీ వుండాలంటారు. మా స్థాయికి తగిన వాళ్లని మేం చూసుకుంటాం. వాళ్ల స్థాయిని అందుకోలేం" వచ్చిన పెద్ద మనుషుల ప్రతిపాదనని సౌమ్యంగానే తిరస్కరించాడు సౌమ్య తండ్రి.

"కాదు మాస్టారూ... అబ్బాయి మన సౌమ్యనే చేసుకోవాలని గట్టి పట్టుదల మీద వున్నాడండీ! మీరు ఎంత ఇవ్వగలిగితే అంతే ఇవ్వండి. మీరు చెప్పిన దానికంటే రూపాయి ఎక్కువ ఇవ్వమని మేం అడగం! మీ ఇష్టం"




"మేం పెద్దగా కట్నం ఇవ్వలేమండీ. వెనుక ఇంకా ఇద్దరు ఆడపిల్లలు వున్నారు. వాళ్లకి చదువులూ, పెళ్లిళ్లూ, పేరంటాళ్లూ ముందుముందు చాలా ఖర్చులు వున్నాయి కదండీ"

"నిజమే, మేం ఇంత ఇవ్వమని అడగడం లేదుకదా! మీరు ఎంత ఇవ్వాలనుకుంటారో అంతే ఇవ్వండి. మేం మరో మాట మాట్లాడం"

"మేం ఇచ్చే కట్నం ఎవర్కైనా చెబితే వాళ్లని ఎగతాళి చేస్తారు. వాళ్లు పెళ్లికి పెట్టే ఖర్చులో పదో వంతు ఇవ్వలేం" అన్నాడు ఆయన.

వచ్చిన పెద్ద మనుషులు వదిలిపెట్ట లేదు.

సౌమ్యని అడిగారు. సౌమ్యకి కూడా సంబంధం ఇష్టమైంది.

ప్రసాద్ వాళ్లు బాగా వున్నవాళ్లు. దాల్ మిల్, ఏవో షేర్లు, రెండు బిల్డింగులూ, రెండు కార్లూ, బోల్డంత డబ్బూ, కోరినన్ని ఆస్తిపాస్తులు వున్నాయి. ప్రసాద్ అందం గానే వుంటాడు. కాదనడానికి తనకి ఏమీ అభ్యంతరం కనపడలేదు. ఒక షరతు పెట్టింది.

"చిన్నదైనా, పెద్దదైనా నేను మాత్రం వుద్యోగం చేయాలండీ! నేను చదువుకున్న చదువుకి సార్థకత వుండాలి. మనకి చాలా ఆస్తి వుంది కదా, నీ బోడి వుద్యోగం ఎందుకు అని తరువాత ఇబ్బంది పెట్టకూ డదు. నన్ను వుద్యోగం చేయనిచ్చే పనయితే నాకేం అభ్యంతరంలేదు. ఓకే" అని చెప్పింది సౌమ్య.

దానికి కూడా ప్రసాద్ ఇష్టపడ్డాడు.

ప్రసాద్ వాళ్ల అమ్మానాన్నలకి ఈ సంబంధం బొత్తిగా ఇష్టంలేదు. ఒక్క కొడుకు. ఆ అమ్మాయినే తప్ప మరొకర్ని చేసుకోనని మొండిపట్టుపట్టి కూర్చున్నాడు. నయానా భయానా చెప్పి చూశారుకానీ తమ మాట వినిపించుకోలేదు. ఇక తప్పని సరి పరిస్థితుల్లో వాళ్లు అంగీకరించారు.

సౌమ్య తండ్రి లక్ష రూపాయల డబ్బూ, పాతిక సవర్లు బంగారం, పట్టణంలో తనకి వున్న ఒక స్థలం కట్నంగా ఇవ్వడానికి సంసిద్ధత తెలిపాడు.

వాళ్లు ఇంత కావాలని అడక్కపోయినా బాగుండదు అనే వుద్దేశంతో తనకి వున్న పరిధిలో భారీగానే ఇచ్చాడు. లెక్కచూస్తే తన ఆస్తిలో మూడో వంతుకంటే ఎక్కువ గానే సౌమ్యకి కట్నంగా పోయింది. తరు వాత ఇద్దరు చెల్లెళ్లకీ తన ఆస్తి మొత్తం ఇచ్చినా అంతరాదు.

రంగరంగ వైభవంగా ప్రసాద్, సౌమ్యల వివాహం జరిగిపోయింది. పెళ్లయిన వారం రోజుల్లోనే సౌమ్యకి టౌన్‌లో వున్న కాలేజీలోనే లెక్చరర్‌గా వుద్యోగం వచ్చింది. సౌమ్య పీజీలో డిస్టింక్షన్ స్టూడెంట్ కాబట్టి తేలికగానే వుద్యోగం సంపాయించుకోగలి గింది.

సౌమ్య కాలేజీకి ఒక రోజు కారులో వస్తుంది, ఒక రోజు స్కూటర్ మీద వస్తుంది, ఒకరోజు ఆటోలో వస్తుంది. ఎలా వచ్చినా గర్వం, బడాయిలు లేవు. సింపు ల్‌గా వుంటుంది.

సబ్జక్ట్ ఇంటిదగ్గర బాగా ప్రిపేరై వస్తుంది. క్లాసులోకి వచ్చిన తరువాత తడు ముకోవటం, వెనక్కి తిరిగి చూసుకోవడం వుండదు.

సౌమ్య పాఠం చెప్పే తీరుకే విద్యార్థులు అందరూ ఆకర్షితులయ్యారు. అభిమానిం చడం మొదలెట్టారు.

కరుణకి కూడా సౌమ్య అంటే చాలా ఇష్టం.

కరుణ గురించి కాలేజీలో చాలామందికి తెలుసు. సౌమ్య కూడా కరుణని గురించి తెలుసుకుంది. కరుణ అంటే తనకీ అభి మానం ఏర్పడింది.

కరుణకీ సౌమ్యకీ ఒకరిమీద ఒకరికి

గౌరవం, స్నేహంలాంటి పరిచయం కలిగింది. కాలేజీలో సౌమ్య కనపడిన ప్రతిసారీ కరుణ మాట్లాడుతుంది. అప్పుడప్పుడు కరుణ సౌమ్యావాళ్ల ఇంటికి కూడా వెళ్తుంది.

ఎప్పుడైనా ఒక రోజూ రెండు రోజులూ కరుణ కనపడకపోతే తరువాత అయినా సౌమ్య విద్యార్థులతో కరుణని స్టాఫ్‌రూంలోకి పిలిపించుకుని మాట్లాడుతుంది.

రోజులు జరిగిపోతున్నాయి. హాఫ్ ఇయర్లీ పరీక్షల తేదీ ప్రకటించారు.

కాలేజీ ఎదురుగా వున్న వాల్ పోస్టర్ల విషయంలోనే కరుణకి అసంతృప్తిగా వుంది.

వాళ్ల వూళ్లో వుంటే కరుణకి చాలా వ్యాపకాలు వుండేవి. ఈ కాలేజీలో ఎక్కువ వ్యాపకాలులేవు. చదువుకోవటం, టౌన్‌లో ఎప్పుడైనా మీటింగ్ వుంటే తోడుగా ఫ్రెండ్స్ వస్తామంటే తీసుకుపోవటం, లైబ్రరీకి వెళ్లి న్యూస్‌పేపర్, మంచి సాహిత్యం తెచ్చుకుని ఖాళీ టైంలో చదువుకోవడం చేస్తుంది.

★ ★ ★

సునందని దారుణంగా మానభంగంచేసి కిరాతకంగా హత్య చేశారు.

సునంద ఆడపిల్లల జూనియర్ కాలేజీలో మొదటి సంవత్సరం ఇంటర్మీడియట్ చదువుకుంటోంది.

తెల్లవారడంతోనే సూర్యోదయానికి ముందే పట్టణమంతా దావానలంలా వార్త క్షణాల్లోనే వ్యాపించింది.

పట్టణానికి రెండు కిలోమీటర్ల దూరంలో వున్న వూరు సునందది. అమ్మానాన్న కూలి పనులకి వెళ్తుంటారు. ఒక్కతే కూతురు.

సునంద రోజూ కాలేజీకి సైకిల్ మీద వస్తుంది. పట్టణానికి వూరు కూతవేటు దూరంలోనే వుంది. చాలామంది చిన్న పిల్లలు సైతం ఇంగ్లీష్ కాన్వెంట్స్‌లో చదువుకునే వాళ్లు చిన్న సైకిళ్లు వేసుకుని రోజూ కాన్వెంట్లకి వస్తుంటారు. పేద పిల్లలు నడిచి వస్తుంటారు.

ఊరికీ, పట్టణానికీ మధ్య వున్న దారిలో జనం రాకపోకలు ఎప్పుడూ వుంటుంటాయి. పాలూ పెరుగూ అమ్ముకునే వాళ్లూ, కూరగాయలు అమ్ముకునే వాళ్లూ, కూలి పనులకి వచ్చేవాళ్లూ, ముఠా పనులకి వచ్చేవాళ్లూ, సినిమాలకి వచ్చేవాళ్లూ, సరదాలకి వచ్చేవాళ్లతో సందడిగా వుండే రహదారి!

ఆ దారిలో రావడానికీ, పోవడానికీ ఎవరికీ ఎలాంటి భయమూ, సందేహమూ ఎప్పుడూ వుండేవికాదు. రాత్రిళ్లు సైతం పిల్లలు వచ్చిపోతుంటారు. అలాంటి దారిలో సునంద హత్య కావడం ప్రజల్ని భయకంపితుల్ని చేసింది.

సాయంత్రం ఆరున్నర, ఏడు గంటల మధ్యలో రోజూ సునంద ఇంటికి వస్తుంది. ఒక్కో రోజు ఎవరైనా పెద్ద వాళ్లుకానీ, స్నేహితులుకానీ తోడు వుంటే తొమ్మిది గంటల వరకూ కూడా వుంటుంది.

సునంద తల్లిదండ్రులు తమ కూతురు పెందలకడే ఇంటికి రాకపోవడంతో రాత్రి తొమ్మిది గంటలకి వస్తుంది అనుకున్నారు. తొమ్మిది దాటినా రాకపోవడం, కబురు కూడా చేయకపోవడంతో వాళ్లు ఆందోళన చెందారు.

"సైకిల్ వేసుకుని పోయిరాయ్యా! ఇంత పొద్దుపోయినా ఇంటికి రాకపోవడం ఏమిటీ? ఎక్కడైనా ఆగిందేమో, మాట మాత్రం కబురు అయినా చేయొచ్చుగా" అంది సునంద అమ్మ.

వాళ్ల నాన్న సైకిల్ వేసుకుని టౌనుకి వచ్చాడు. సునంద స్నేహితుల్ని అడిగాడు.

"ఆరుగంటలకే ట్యూషన్‌నించి బయల్దేరి వచ్చిందండీ! ఎవరింటికైనా వెళ్లిందేమో! మాకు ఎక్కడికి వెళ్తున్నదీ చెప్పలేదు. సైకిల్ మీద వెళ్లడం మాత్రం చూశాం. టౌన్‌లో ఎక్కడైనా పని వుండి ఆగే పనయితే మాతో చెప్పి వుండేది" అన్నారు స్నేహితులు.





ట్యూషన్ మాస్టర్లనీ, పరిచయస్తుల్నీ, కుటుంబ స్నేహితుల్నీ అడిగాడు. వాళ్లు తమ ఇంటికి రాలేదనీ, ఎక్కడికి వెళ్లిందీ తెలియదని చెప్పారు.

ఎక్కడికి వెళ్లినట్లూ? అమావాస్య చీకటి!

రాత్రంతా తల్లిదండ్రులు దిగులుగానూ, భయంగానూ, ఆందోళనగానూ గడిపారు. తెల్లవారి మసక విడిచేటప్పుడు టౌన్‌లో టీ అంగడి నడుపుకుంటున్న ఒక కుర్రాడు పల్లెనించి పట్టణానికి వస్తూ అడవి తుమ్మ చెట్ల మధ్యలో, రోడ్డుకి కొద్దిగా ఎడంగా సైకిల్ పడి వుండటాన్ని చూశాడు. అడవి తుమ్మచెట్ల తుప్పల్లో వుంది. జాగ్రత్తగా చూస్తే కానీ కనిపించదు.

అతను సైకిల్ చూశాడు. దానికి కొద్ది దూరంలోనే బ్లూకలర్ చున్నీ పడివుంది. రోడ్డుకి పక్కనే సరుగుడు తోట.

రోడ్డుకి రెండు పక్కలా అడవి తుమ్మ చెట్లు పొదల్లా అల్లుకుని కీకారణ్యంగా వుంది. ఆ చెట్లు తప్పించుకుంటే తప్ప అటువైపు ఏం వుందో కనపడదు.

చున్నీ, సైకిల్ కనబడటంతో యువకుడి అనుమానం బలపడింది. భయం కలిగింది.

"ఎవరక్కడ? రోయ్... ఎవడ్రా వాడూ? " అంటూ పెద్దగా, గొంతు చించుకుని అరిచాడు.

అంతలో దూరంగా సైకిళ్ల మీద వస్తూ కనిపించారు పండ్లు అమ్ముకునేవాళ్లు. వాళ్లు సమీపించడంతో ఆపి విషయం చెప్పాడు.

నలుగురూ అడవి తుమ్మచెట్లు దాటుకుని, రోడ్డుపక్కగా వున్న సరుగుడు తోటలోకి వెళ్లారు.

సునంద భయంకరాకారంతో, బీభత్సంగా, రక్తసిక్త దేహంతో నిర్జీవమై పడి వుంది. చూసిన ఎవరికైనా జరిగిన విషయం స్పష్టంగా అర్థమైపోతుంది.

ఉండవలసిన స్థానంలో బట్టలులేవు. వీళ్లు వెళ్లిన వెంటనే మొదట బట్టలు సరిచేశారు. సునంద తల్లిదండ్రులకి ఎవరో వెళ్లి నెమ్మదిగా చెప్పారు.

"ఓనా బిడ్డో... ఎంతపని చేస్తివి తల్లో... ఏ మాయదారి దేవుళ్లు నిన్ను అన్నేయం చేశారు తల్లో" అంటూ హృదయవిదారకంగా విలపిస్తూ అక్కడికి చేరుకున్నారు.

పట్టణంలో కూడా విషయం పాకిపోయింది. సైకిళ్లమీదా, మోటారుసైకిళ్లమీదా, స్కూటర్లమీదా, నడిచీ గుంపులు గుంపులుగా జనం రావడం ప్రారంభించారు. పట్టణానికి అరకిలోమీటరు దూరంలోనే ఈ ఘాతుకం జరిగింది.

పోలీసులు వచ్చారు. తొమ్మిది గంటలకి ఎస్పీ కలెక్టర్ కూడా స్థలాన్ని సందర్శించారు.

పదహారు సంవత్సరాల సునంద, లోకం పోకడ పూర్తిగా ఎరుగని అమాయకజీవి, బాల్యదశ ఇంకా వీడని పసిప్రాణం, నవ్వుతూ తుళ్లుతూ ఆడుతూ పాడుతూ ఆనందంగా గడుపుతూ చదువుకుంటున్న పసిమొగ్గ, ఈ మొగ్గని ఏ దుష్టశక్తులు బలిగొన్నాయి? ఏ దుర్మార్గులు ఇంతటి నైచ్యానికి ఒడిగట్టారు? ఎవర్ని చూసినా ఇదే విషయం మాట్లాడుకుంటున్నారు. అందరి హృదయాలూ బరువుతోనూ, బాధతోనూ, సానుభూతితోనూ నిండిపోయాయి.

సరుగుడు తోటలో పోలీసులకి ఎర్ర టవల్ ఒకటి దొరికింది. తోటకి ఆవలివైపు ఒక చెప్పూ, ఇంకొంచెం దూరంలో మరో చెప్పూ దొరికాయి. హంతకులు రోడ్డుమీద నించి గాకుండా పొలాలకి అడ్డుపడి పట్టణంవైపు పారిపోయినట్లుగా చెప్పులు పడి వుండటాన్ని చూసి పోలీసులు నిర్ధారించారు.

చెప్పులూ, టవల్ ఎవరివీ అనేవాటి ఆధారంగా పోలీసులు దర్యాప్తు ప్రారంభిం

చారు.



ఉదయం హాస్టల్లో టిఫిన్ చేస్తుండగా కరుణకీ విషయం తెల్సింది. వెళ్లి చూసి వద్దామని గట్టిగా అనిపించింది. హాస్టల్ నించి బయటకి వెళ్లడానికి ఎలాంటి పరిస్థితిలో కూడా పర్మిషన్ ఇవ్వరు. సెలవురోజు మాత్రమే బయటకి అనుమతిస్తారు. సెలవురోజు కూడా ఒకరూ ఇద్దర్నీ విడిగా బయటికి పంపించరు. పదిమంది వెళ్తామంటే ఒక లీడర్‌కి చెప్పి అరగంటలో వచ్చే షరతుమీద అనుమతిస్తారు.

తనతో స్నేహంగానూ, పరిచయంగానూ వుండే విద్యార్థినులందరికీ కరుణ చెప్పింది. "ఈరోజు వూరేగింపు వుంటుంది. అందరం వూరేగింపులో వుండాలి!"

"ఒకే... యాహూ..." అంటూ ఇద్దరు ముగ్గురు విద్యార్థినులు వుత్సాహంగా ఎగిరారు. వాళ్ళకి ఆరోజు కాలేజీ వుండకపోవటం, బజారులో సరదాగా నినాదాలు ఇస్తూ వూరేగింపు తీయడం ఇష్టం.

కరుణతో ఏకీభవించేవాళ్లూ, సమర్థించే వాళ్ళూ హాస్టల్లో దాదాపు ఇరవైమంది వున్నారు. వాళ్లు అందరూ ఒకే అభిప్రాయంతో వుంటారు. తమకి తెల్సినచోట ఎక్కడ అన్యాయం, అక్రమం జరిగినా ప్రతిఘటించి తీరాలి.

కరుణ, స్నేహితులు టిఫిన్ చేసి, బుక్ ఒకటి చేత పట్టుకుని కాలేజీకి బయలుదేరారు.

అప్పటికే వేరే కాలేజీ విద్యార్థులు వచ్చి మెయిన్‌గేటువద్ద నిలబడి కాలేజీకి వస్తున్న విద్యార్థుల్ని ఆపి ఏదో చెపుతున్నారు.

బయటనించి వచ్చిన వాళ్ళు మగపిల్లలు. వాళ్ళలో ఒకతను పొడవుగా వున్నాడు.

అతను చక్కగా, కన్విన్సింగ్‌గా, టీచర్ విద్యార్థులకి బోధించినట్లు కాలేజీకి వస్తున్న విద్యార్థులకి నిరసన ప్రదర్శన నిర్వహించాల్సిన ఆవశ్యకతని గూర్చి వివరిస్తున్నాడు.

కరుణ వాళ్ళు కూడా వీళ్ళచెంతనే నిలబడి విద్యార్థుల్ని లోనికి పోనివ్వకుండా, విషయం చెప్పి ప్రదర్శన వుందన్నారు.

వీళ్ళ ఎదురుగానే, వీళ్ళని వెక్కిరిస్తున్నట్లు రంభా థియేటర్ పోస్టర్! స్త్రీ పురుషులు దాదాపు నగ్నంగా, సంస్కారం, సభ్యత కలిగిన వాళ్ళు చూస్తేనే సిగ్గుతో తలదించుకునేలా వుందా పోస్టర్.

గేటు ముందు నిలబడి చొరవగా విద్యార్థుల్ని ఆపుతూ ఉత్సాహంగా వున్న కరుణవైపు చూసి, పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు ఆ యువకుడు.

"మీరు ఇదే కాలేజీనా? " అడిగాడు.

"అవును... డిగ్రీ ఫస్టియర్ చేస్తున్నాను"

"నేను పీజీ సెంటర్‌లో ఎం.ఎ. చేస్తున్నాను. నా పేరు గోపాల్. జిల్లా నవయుగ విద్యార్థి సమాఖ్య ప్రెసిడెంటుని"

"నా పేరు కరుణ మీరు చెప్పే సంఘం పేరు ఎప్పుడూ వినలేదు"

"మాది చిన్న సంఘమేనండీ! ఇప్పుడిప్పుడే డెవలప్ అవుతోంది"

"మీరు ఉదయం మర్డర్ జరిగిన స్పాట్‌కి వెళ్లారా? "

"వెళ్లి చూసివచ్చాను. జనం చాలామంది వచ్చారు. కలెక్టర్, ఎస్పీ కూడా వచ్చారు"





"హంతకులు దొరుకుతారంటారా?" కరుణ అడిగింది.

"చెప్పలేము. పోలీసుల పని తీరుమీద ఆధారపడి వుంది. వాళ్ళు పట్టుకోదలుచుకుంటే పెద్ద కష్టమేమీకాదు"

"అటు చూడండి. అక్కడ అలాంటి పోస్టర్లు వేయించకుండా చేయాలని మేం చాలా ప్రయత్నించాం. ఎంఆర్ఓకీ, ప్రిన్సిపాల్‌కీ చెప్పాం. ప్రదర్శన చేశాం. అయినా ఆ చిన్న పనిలో విజయం సాధించలేక పోయాం. వాళ్ళని మేం ఏమీ చేయలేమని సవాల్ చేస్తున్నట్లుగా వుంది వాళ్ళ ధోరణి, నిజం కూడా అంతే. వాళ్ళని ఏం చేయలేని నిస్సహాయులమైపోయాం!"

"అంతే, సమాజం అలాగైపోయింది. చిన్న సమస్యల్ని పరిష్కరించే విషయంలో కూడా అధికారులు స్పందించడం లేదు. చిన్న సమస్యలకోసం కూడా పోరాడాల్సిందే! పోరాడితే తప్ప ఏ సమస్యా పరిష్కారం కాని పరిస్థితి నెలకొంది"

"ఇంత చిన్న సమస్యమీద ఏమని పోరాడగలం? దీనికోసం క్లాసుల బాయ్‌కాట్‌లూ, బందులూ, సమ్మెలూ చేయాల్సిందేనా? నిజానికి ప్రభుత్వం ఇలాంటివి అనుమతించకూడదు. చట్టప్రకారం చూసినా ఇది తప్పే! అయినా వాటిని అరికట్టలేక పోయాం" అంది బాధతో కరుణ.

"ఈ మర్డర్ విషయంలో అయినా మనం పోరాడితే తప్ప న్యాయం జరిగే అవకాశం లేదు. పోలీసులు నిజాయితీగా పనిచేయడం కలలో మాట. నేతిబీరకాయల్లో నేయి ఎంత వుంటుందో మన పోలీసుల్లో చట్టాన్ని రక్షించాలనీ, న్యాయాన్ని పరిరక్షించాలనీ అంతే వుంటుంది. బాగా డబ్బు తినడం నేర్చుకుని నిందితుల్ని రక్షించడానికీ, అమాయకుల్ని శిక్షించడానికీ ప్రయత్నిస్తున్నారు. కిందస్థాయి పోలీస్‌నించి పై స్థాయి అధికారి వరకూ బాగా అవినీతి పరులైపోయారు" అన్నాడు గోపాల్.

"పోలీసులు హంతకుల్ని పట్టుకోగలరా? పట్టుకున్నా వాళ్ళకి శిక్షలు పడతాయో లేదో!" అంది కరుణ.

విద్యార్థులు అందరూ వచ్చారు. కాలేజీ లేదని తెలిసి కొందరు వూరేగింపు తప్పించుకుని మార్నింగ్‌షోలకి వెళ్ళిపోయారు.

"మన కాలేజీ ఒక్కటే కాదు, అన్ని కాలేజీల వాళ్ళనీ, స్కూళ్ళ వాళ్ళనీ కలుపుకుని పోవాలి. విద్యార్థులు అందర్నీ ఈ నిరసనలో భాగస్వాముల్ని చేయాలి" అన్నారు ఒకరు.

"అవును. అందర్నీ కలుపుకుని పోవాలి. సునంద మన కాలేజీ అమ్మాయి కాదు. అయినా మన కాలేజీనించే వూరేగింపు ప్రారంభమౌతోంది. అలాంటప్పుడు అన్ని కాలేజీల వాళ్ళూ వూరేగింపులో ఎందుకు పాల్గొనరు?" అంది కరుణ.

ఒకరు ఏఏ స్కూళ్ళనీ, కాలేజీల్ని కలుపుకుంటూ ఎటుపోవాలో, కలెక్టరేట్‌కి ఎలా చేరుకోవాలో స్కెచ్ గీశారు.

ఊరేగింపు కదిలింది. సునంద హంతకుల్ని త్వరగా పట్టుకోవాలనీ, కఠినంగా శిక్షించాలనీ నినదిస్తూ ప్రవాహం మాదిరి వూరేగింపు పరవళ్ళు తొక్కుతూ సాగుతోంది. ముందు భాగంలో గోపాల్, కరుణ, ఇంకా ఇతర కాలేజీల్లో ముఖ్యులూ వున్నారు.

కరుణ ఆవేశంగా, ఆగ్రహంగా, ఆవేదనగా నినదిస్తూ కదం తొక్కుతోంది. కరుణని చూసిన కొందరు విద్యార్థులకి అదోరకమైన ఉద్రేకం, ఉత్సాహం కలుగుతోంది.

పదకొండు గంటలకి ప్రారంభించిన వూరేగింపు ఒకటిన్నరకి కలక్టరేట్‌కి చేరుకుంది. కరుణ, గోపాల్, ఇంకా ముగ్గురు ప్రతినిధి వర్గంగా వెళ్ళి కలెక్టర్‌కి విజ్ఞాపన పత్రం ఇచ్చారు.

"బయటవున్న విద్యార్థులు వాళ్ళముందుకి వచ్చి మాట్లాడమని కోరుతున్నారు సార్ మిమ్మల్ని! దయచేసి మీరు బయటకి

వచ్చి విద్యార్థుల సమక్షంలో మీ అభిప్రాయం చెప్పండి సార్. మీరు వస్తే తప్ప వాళ్ళు శాంతించరు సార్" అన్నాడు గోపాల్.

గోపాల్ మాటకి కలెక్టర్ మరో మాట లేకుండా నిశ్శబ్దంగా కుర్చీలోంచి లేచి బయట వున్న వేలాది మంది విద్యార్థుల ముందుకి వచ్చి మాట్లాడాడు.

"మీ ఆవేశాన్నీ, బాధనీ నేను అర్థంచేసుకోగలను. నిందితుల్ని చాలా త్వరగా పట్టుకుంటాం. ఈ విషయంలో మీరు మాకు సంపూర్ణ సహకారం అందించండి. దోషులు ఎంతటివారైనా వదిలిపెట్టే ప్రసక్తిలేదు. అవసరమైతే సిబిసిఐడిని కూడా రంగంలోనికి దించడానికి వెనుకాడం"

విద్యార్థులు చప్పట్లతో హోరెత్తించారు.

ఊరేగింపు అనంతరం విద్యార్థులు హాస్టల్స్‌కీ, ఇళ్ళకీ వెళ్ళిపోయారు. వాళ్ళు అలా వెళ్లిన అనంతరం కొంతసేపటికే నిందితుల్ని పోలీసులు గుర్తించారనీ, మొత్తం నలుగురు నిందితులనీ, వాళ్ళలో ముగ్గుర్ని పట్టుకున్నారనీ, ఒకడు పరారీలో వున్నాడనే విషయం అంతటా పాకిపోయింది.

ఆ నలుగురు హంతకులు ఎవరో తెలుసుకున్న విద్యార్థిలోకం నివ్వెరపోయింది.

వాళ్ళు రౌడీలు కారు. గూండాలు కారు. సంఘ వ్యతిరేక శక్తులు, గతంలో చిన్న నేర చరిత్ర వున్నవాళ్ళు కూడా కాదు. వాళ్ళు భయంకర దుర్మార్గానికీ, ఒక నిండు ప్రాణాన్ని బలిగొనేటంత అమానుష రాక్షసత్వానికీ, కొన్ని దేశాల్లో నిర్ద్వంద్వంగా మరణశిక్ష విధించేటంత క్రూరమైన నేరానికి పాల్పడ్డారు. వాళ్ళు ఎందుకు అంతటి ఘాతుకానికి ఒడిగట్టారో, వాళ్ళని అందుకు ప్రేరేపించిన శక్తి ఏదో తెలుసుకున్న విద్యార్థులు మరింత దిగ్భ్రమచెందారు.

ఆవేశం, ఆగ్రహం వాళ్ళలో కట్టలు తెంచుకుంది.

★ ★ ★

వేణు, రమణ, సందీప్ ముగ్గురూ కరుణ చదువుతున్న కాలేజీలోనే డిగ్రీ సెకండ్ ఇయర్ చదువుతున్నారు. ముగ్గురూ పైలా పచ్చీసు రాయుళ్ళు.

వేణు, రమణ మధ్యతరగతి కుటుంబాల్లోనించి చదువుకి వచ్చిన వాళ్ళు. సందీప్ మాత్రం ఆర్థికంగా కొంత ఉన్నతస్థానం నించి వచ్చినవాడే!

సందీప్ నాన్న కంట్రాక్టులు చేస్తుంటాడు. అక్కడి శాసనసభ్యుడికి గట్టి అనుచరుడు. ఆ శాసనసభ్యుడు 18 సంవత్సరాలుగా అదే స్థానంలో అదే పదవిలో తిష్టవేసుకుని కూర్చుంటే, అప్పటినించీ సందీప్ తండ్రి ఆయనకి అనుచరుడుగా మెలగుతూ, అంచెలంచెలుగా ఎదుగుతూ కంట్రాక్టుల్లో లాభాలార్జిస్తూ ప్రస్తుతం లక్షలు కూడపెట్టాడు.

వీళ్ల ముగ్గురి పని చదువుకోవటం. అయితే క్లాసులకి ఎగనామం పెట్టడం, ఆడవాళ్ళ వెంటపడటం, సిగరెట్లు తగలెయ్యడం, సినిమాలు చూడటం వీటిలో మాత్రం బాగా ఆరితేరారు.

హాస్టల్లో గాకుండా విడిగా రూం తీసుకుని వుంటున్నారు. వేణు, రమణ ఒక రూం అయితే సందీప్ వాళ్ళ వూరువాడే మరొకడితో కలిసి ఇంకో రూంలో వుంటున్నాడు. వీళ్ళ ముగ్గురికీ బాగా మిత్రత్వం కుదిరింది.

"ఒరేయ్... రాత్రి నేను రంభా థియేటర్‌లో సినిమాకి వెళ్ళారా! అబ్బా... ఫుల్ సెక్స్‌రా! భలే వుంది. మధ్యలో ఒకచోట సినిమా ఆపేసి బ్లూ ఫిలిమ్ కూడా రెండు మూడు నిముషాలపాటు చూపెట్టార్రా! సినిమానే సెక్సు దానికితోడు బ్లూ ఫిలిం. భలే వుందిరా!" అన్నాడు సందీప్ ఓరోజు.

"ఏమేం దృశ్యాలు చూపెట్టార్రా?"

"ఒకటీ రెండు కాదు, చాలా వుంది సెక్స్. అది చూస్తే తప్ప చెప్పడానికి వీలు కాదు" అంటూనే కొన్ని దృశ్యాల్ని వర్ణించి చెప్పాడు అతను.

"అయితే ఇవ్వాళ వెళ్ళి చూడాల్రా! నువ్వు





కూడా వస్తావా? ”

“తప్పకుండా మళ్ళీ చూడాల్సిందే”

“లేడీస్ ఎవరైనా వచ్చారా సినిమాకి? ”

“నలుగురైదుగురు వచ్చారు లేడీస్. వాళ్లు నేలక్లాసులో కూర్చున్నారు. సినిమా అయిపోయేటంత వరకూ భలే టెన్షన్‌గా వుందిలే!”

ఆరోజు రాత్రి ముగ్గురు మిత్రులూ ఆ సినిమాకి వెళ్లారు. ఉత్సాహం కలిగింది. ఆ సినిమాలమీద ఆసక్తి పెరిగింది.

నాలుగయిదు రోజులకి ఒకసారి రంభా థియేటర్‌లో సినిమాకి వెళ్ళడం మొదలుపెట్టారు. సినిమా మారిపోయి మరో సినిమా వస్తే చాలు, వీళ్లు తప్పనిసరిగా హాజరవుతున్నారు.

సినిమాల మధ్యలో వేస్తున్న బ్లూ ఫిలిమ్స్ నిడివి కూడా కొద్దికొద్దిగా పెరగసాగింది.

నెలరోజులక్రితం వచ్చిన ఒక సినిమా వీళ్లని బాగా ఆకర్షించింది. ఆ సినిమాలో బోలెడు బూతు సన్నివేశాలు వున్నాయి. వాటితోపాటు ఐదు రేప్‌సీన్లు కూడా వున్నాయి.

“ఒరేయ్... మనం కూడా అలా రేప్‌చేస్తే ఎంత థ్రిల్లింగ్‌గా వుంటుందిరా!” సందీప్ అన్నాడు.

“అమ్మో... దొరికిపోతే కటకటాలు లెక్క పెట్టాల్సి వస్తుందిరా!” రమణ అన్నాడు.

“ఛ వెధవా... అంత తేలికగా చిక్కే పనయితే అలాంటి ప్రయత్నానికే పాల్పడకూడదురా! సినిమాలో వాడు దొరికాడా? ఎన్ని ఖూనీలు చేశాడూ, ఎన్ని రేప్‌లు చేశాడూ, అయినా వాడ్ని పోలీసులు పట్టుకోగలిగారా? దేన్నికైనా తెలివివుండాల్రా? ”

“తెలివి వున్నా ఒక్కోసారి దొరికిపోయే ప్రమాదం వుందిరా!”

“నీ ముఖం, పిరికివెధవా! అన్నీ పిరికి మాటలూ, పిరికి ఆలోచన్లూ! సినిమాలో ఎలా చేశాడో అలానే చేద్దాంరా! దొరికే అవకాశమే లేదు” అన్నాడు సందీప్.

ఆ సినిమా 14 రోజులు ఆడింది. సినిమా ఆడిన అన్ని రోజులూ వీళ్ళు ప్రతి రోజూ రెండవ ఆట సినిమాకి వెళ్ళి చూశారు. ఒక్కరోజు కూడా మిస్ కాలేదు.

సినిమాలో విలన్ ఎలా చేశాడో అలా చేద్దామనే నిర్ణయానికి వచ్చారు. రమణ మొదట్లో భయపడినా రోజూ సినిమా చూస్తూ ప్రేరణ పొందడం, సందీప్ వెన్ను తట్టి ప్రోత్సహించడంతో భయం కొంత వదిలింది.

రోజూ సినిమాకి వస్తూండటంతో గేటు వద్ద వున్న కుర్రాడు బాగా పరిచయమయ్యాడు. అతనికి కూడా వీళ్ళ వయసే వుంటుంది. పేరు జోగయ్య.

“ఒరేయ్ జోగయ్యా...! టీ తెచ్చిపెట్రా? ” సినిమా మధ్యలో సందీప్ అంటే వాడు వెళ్ళి టీ తెచ్చి ఇచ్చేవాడు. సిగరెట్లు తెచ్చిపెట్టేవాడు.

సినిమా మొదలైన పదిహేను నిముషాలకి వాడు కూడా వచ్చి వీళ్ళచెంతనే కూర్చునేవాడు. మంచి స్నేహితుడు అయ్యాడు.

“రేయ్ జోగయ్యా. మేం కూడా ఈ సినిమాలో మాదిరిగా రేప్ చేయాలనుకుంటున్నాంరా! నువ్వు కూడా వస్తావా? ” నవ్వులాటగా అడిగినట్లు అడిగాడు సందీప్.

“బ్రహ్మాండం గురూ... కానివ్వండి చేద్దాం. మనల్ని ఎవడేం చేస్తాడు గురూ? ”

“అంతధైర్యం ఏమిట్రా జోగా? ”

“మరి... ఛైర్మన్‌గారు వున్నారు కద గురూ! మనం పోలీసులకి పట్టుబడినా నిముషాలమీద విడిపించుకుని వస్తాడు. ఎస్ఐ ఏమిటీ, డి ఎస్పీ ఏమిటీ పెద్దపెద్ద పోలీస్ అధికారులే ఛైర్మన్‌గారి జోలికి రారు”

“నిజం రా? ”

“ఏమిటిగురూ... ఛైర్మన్‌గారంటే ఏమనుకుంటున్నారు? ఇలాంటి బ్లూ ఫిలింలు ఇంకో హాలు వాడ్ని వేయమనండి చూద్దాం.

ఈ టౌన్‌లో ఇలాంటి సినిమాలు వేసే దమ్ము ఇంక ఎవడికైనా వుందా? మేం వేస్తున్నాం, మమ్మల్ని ఎవడేం చేస్తున్నాడు? "

"సరేరా జోగా... హాలు విషయం విడిచి పెట్టు. నువ్వు నేరం చేస్తే పోలీసులు పట్టుకుపోతే ఛైర్మన్‌గారు ఎందుకు విడిపిస్తాడ్రా? ఆయనకేం సంబంధం? "

"ఛైర్మన్‌గారు ఆయనకింద పనిచేసే వాళ్ళని కన్నబిడ్డల మాదిరిగా చూసుకుంటాడుగురూ! ఎలక్షన్లప్పుడు మేం ఎంత కష్టపడ్డాం! ఎన్ని దొంగ ఓట్లు వేశాం, ఎన్ని చోట్ల రిగ్గింగులు చేశాం! మేం అంత కష్టపడితేగదా ఛైర్మన్ అయింది"

"ఎలక్షన్లు అప్పుడు తప్ప విడిగా రాజకీయనాయకులు మనల్ని పట్టించుకుంటారా? "

"మా ఛైర్మన్ అలాంటివాడు కాదు గురూ! ఈ సినిమా హాల్లో పనిచేసే వాళ్ళు అందరం ఆయన పార్టే! ఆయనకి టౌన్‌లో నాలుగు బ్రాంధీ షాపులు వున్నాయి. వాటిలో పనిచేసేవాళ్ళు కూడా అందరూ మా పార్టీ వాళ్ళే! చాలాసార్లు చెపుతాడు గురూ, మీరు నా కన్నబిడ్డలులాంటివాళ్ళేరా అని!"

"ఎవర్నైనా ఎప్పుడైనా ఆదుకున్నాడా? "

"మొన్న హాలు మేనేజర్ అమ్మ చచ్చిపోతే, చూట్టానికి ఛైర్మన్‌గారు స్వయంగా వచ్చాడు. ఇంతకుముందు ఒకసారి మా హాల్లో పనిచేసేవాడు ఒకడికి యాక్సిడెంట్ జరిగి హాస్పిటల్లో చేరితే వచ్చి చూసి పలకరించాడు. ఎవరికి బాగులేకపోయినా వస్తాడూ, పరామర్శిస్తాడూ!" చెప్పాడు జోగయ్య.

"రేపు ఉదయం మా రూంకి రారా మాట్లాడుకుందాం!" అన్నాడు సందీప్.

"అలాగే గురూ!" అన్నాడు జోగయ్య.

అన్నట్లుగా మరుసటిరోజు ఉదయమే సందీప్ వాళ్ల రూంకి వెళ్ళాడు జోగయ్య.

నలుగురూ కలిసి మాట్లాడుకున్నారు. టౌన్‌లో కష్టమనే అభిప్రాయానికి వచ్చారు. ఆ రోజు సాయంత్రం టౌను వెలుపలకి వచ్చి చూశారు.

సునంద వాళ్ళవూరు వెళ్లే మార్గం వీళ్ళకి అనుకూలంగా కనిపించింది. సరుగుడు తోటలూ, సుబాబుల్ తోటలూ, రోడ్డు పక్కన దట్టంగా అడవి తుమ్మచెట్లూ... వీలైన ప్రదేశంగా భావించారు.

"ఎప్పుడూ ఎవరో ఒకరు తిరుగుతూనే వున్నారు కదగురూ! ఇక్కడ కష్టం అవుతుందేమో"

"ఇక్కడే కష్టం అయితే ఇంకెక్కడ సులభం అవుతుందిరా? " అన్నాడు సందీప్.

వీళ్ళు అక్కడ రెండుగంటలు గడిపారు. ఆడవాళ్ళు ఒంటరిగానే వచ్చిపోతుండటం గమనించారు.

మరుసటిరోజు సాయంత్రం కూడా వచ్చారు. ఆరోజు చీకటిపడే సమయంలో సునంద ఒక్కతే ట్యూషన్‌నించి సైకిల్ తొక్కుకుంటూ వెళ్ళడం చూశారు.

మనసులో ఆలోచన రూపుదిద్దుకుంది. పరిసరాలు అన్నీ పరిశీలించారు. అనువైన స్థలాన్ని ఎంపికచేసుకున్నారు.

విడవకుండా రంభా థియేటర్‌లో సినిమాకి వెళ్ళడం మాత్రం మానుకోలేదు.

తరువాత మూడుసార్లు ప్రయత్నించారు కానీ, దారిలో ఎవరో ఒకరు వస్తూనే, సునంద వెంట కొందరు ఇళ్లకి వెళ్తూ కనిపించడంతోనే పథకాన్ని అమలు జరుపలేకపోయారు. అయినా నిరాశపడలేదు.

దారిలో ఒక్కొక్కరు ఒక్కోచోట వుండి సునంద కదలికల్ని పరిశీలించటం, అనుసరించటం సునంద తెలుసుకోలేకపోయింది.

ఆరోజు చీకటిపడే సమయంలో సునంద ఒక్కతే సైకిల్‌మీద వేగంగా తొక్కుకుంటూ వస్తోంది. దుష్ట చతుష్టయానికి పరిస్థితి అనుకూలించింది.





తాము వ్యూహం రూపొందించుకున్న చోట, అడవితుమ్మ పొదచాటున సందీప్ నిలబడి సునంద సైకిల్ తొక్కుకుంటూ సమీపించడంతోనే ఒక్క ఉదుటన సైకిల్‌ని పడవేశాడు. సైకిల్‌తోపాటు సునందా పడిపోయింది.

సందీప్ వెంటనే సునంద నోరు నొక్కాడు. మిగతా ఇద్దరు కూడా వచ్చి సునందని వేగంగా రోడ్డుపక్కగా వున్న సరుగుడు తోటలోనికి లాక్కుపోయారు. పులి పంజావిసిరింది.

"వామ్మో... దొంగలు... కాపాడండి... కాపాడండీ..." అని అరుస్తున్న సునంద అరుపులు నోరుదాటి, నోరునొక్కిన సందీప్ చేతులు దాటి బయటకి రాలేదు.

పూర్తిగా చీకటిపడింది.

సరుగుడు తోట మధ్యలోనికి లాక్కుపోయి, నోట్లో బట్టలు కుక్కి, ఆ నలుగురూ... కిరాతకంగా...

"రేయ్... ఎవరికైనా చెబితే మన కొంప మునుగుతుందిరా! ఉంచకూడదు. బతికి, మనల్ని గురించి చెబితే తరువాత మనం చాలా చిక్కుల్లో పడిపోతాం!" అన్నాడు సందీప్..

జోగయ్య సరదాగా మెడకి చుట్టుకునే టవల్ తీసుకుని సునంద గొంతుకి బిగించారు.

సునంద ఏడుస్తూ, హృదయవిదారకంగా అరుస్తూ, గిలగిలా కొట్టుకుంటూ విలవిల్లాడిపోతున్నా, నిర్దాక్షిణ్యంగా నలుగురూ టవల్‌ని బలంగా బిగించి లాగారు.

సునంద నాలుక వెళ్లగక్కి కనుగుడ్లు తేలేసింది.

రమణ, జోగయ్య భయంతో కంపించిపోయారు. మిగతా ఇద్దరూ ధైర్యంగా వున్నారు.

"రేయ్... ఎవరికైనా ఒక్కరికి తెల్సిందా, నలుగురికీ చుట్టుకుంటుంది. ఇది ఒక్కరితో పోయే విషయం కాదు. ఎలాంటి పరిస్థితిలో కూడా తెలియకూడదు. ఎవరికీ చెప్పకూడదు! చాలా జాగ్రత్తగా వుండండి. మన మీద ఎవరికీ అనుమానం రాకుండా వుండాలి. అనుమానం వచ్చేటట్లు కూడా మీరు మెలక్కూడదు!" సందీప్ మిగతా వాళ్ళని హెచ్చరించాడు.

అందుకు అందరూ అంగీకారంగా తల వూపారు.

"మనం నలుగురం కల్సిపోతే ఎవరికైనా అనుమానం వస్తుంది. మనం ఇక్కడే చీలిపోయి ఒక్కొక్కరం ఒక్కో దారిన వెళ్ళిపోదాం. టౌన్‌లో మనం రూంలో కల్సుకుందాం!" చెప్పాడు రమణ.

నలుగురూ సరుగుడు తోటకి అడ్డంపడి చీకట్లో పరిగెత్తి పారిపోయారు.

పరుగుతో పారిపోతున్న సమయంలో జోగయ్య టవల్ పడిపోయింది. అరిగిపోయిన చెప్పులు జారిపోయాయి. వాటిని అందుకోకుండానే జోగయ్య వెనుక చూపులేకుండా ముందుకే పరుగందుకున్నాడు.

★ ★ ★

జోగయ్య విడిచి పారిపోయిన చెప్పులూ, టవల్ ఆధారంగానే పోలీసులు పరిశోధన ప్రారంభించారు.

కొంతమంది రిక్షావాళ్ళకి టవల్ చూపెట్టి ఇలాంటి టవల్ ఎవరెవరు వేసుకుంటారో చెప్పమని అడిగారు. చాలామంది తెలియదని చెప్పారు.

ఒక కుర్రాడు మాత్రం వెంటనే చెప్పాడు. "ఇసుంటి టవల్ రంభా' హాలు దగ్గర వుండే గేటు కాడి కుర్రోడు వేసుకుంటాడండీ! ఇసుంటిది వాడి మెడలో వుండటం నేను చాలా సార్లు చూశానండీ!"

"ఎన్నేళ్ళుంటాయి వాడికి? "

"ఇరవై, ఇరవైరెండేళ్ళు వుండొచ్చండీ"

"వాడ్ని చూస్తే గుర్తుపడతావా? "

"పడతానండీ"

"రిక్షావాడ్ని ఎక్కించుకుని పోలీస్ వ్యాన్ రంభా థియేటర్‌వైపు కదిలింది. వ్యాను

వెనుకనే జీపులో పోలీసు అధికార్లు కూడా వున్నారు. అది సినిమాటైం కాదు.

రంభా థియేటర్ ముందువున్న టీ దుకాణం వాడ్నీ, బజ్జీలు అమ్ముకునే వాళ్ళనీ, పాన్ షాపు వాళ్ళనీ అడిగారు టవల్ చూపెట్టి. వాళ్ళలో కొందరు తెలియదని చెప్పినా, మిగతా వాళ్ళు జోగయ్యే అలాంటి కండువా వేసుకుని తిరుగుతుంటాడని ధృవపరిచారు.

పోలీస్ అధికార్లు హాలు మేనేజర్ని పిలిపించి జోగయ్య విషయం అడిగారు.

"ఇవ్వాళ వాడు డ్యూటీకి రాలేదండీ! బాగులేదని కబురుచేశాడు"

"వాళ్ళ ఇల్లు ఎక్కడ? "

"నాకు తెలియదండీ. మా గేటు దగ్గర కుర్రవాళ్ళకి తెలుసు"

"వాళ్ళని పంపించండి"

గేటు దగ్గర కుర్రవాళ్ళలో ఒకర్ని పిలిచి ఎక్కించుకుని జోగయ్య వుండే ఇంటివైపు వ్యాను, కమాండర్ దూసుకుపోయాయి.

జోగయ్య తండ్రి బండిమీద అరటి పండ్లు అమ్ముకుని జీవనం సాగిస్తుంటాడు. వాళ్ళ అమ్మ నాలుగు ఇళ్ళలో పనులు చేస్తూ కూలి పనులకు కూడా వెళ్తుంటుంది.

జోగయ్య ఇంట్లో ముసుగుతన్ని పడుకుని నిద్రపోతున్నాడు. వాళ్ళ అమ్మ బయట ఏదో పని చేసుకుంటోంది.

"జోగయ్య వున్నాడా? " అని పోలీసులు అడగలేదు. ఆమెతో ఒక్కమాట కూడా మాట్లాడకుండా నేరుగా గుడిసెలోనికి వెళ్లారు, స్వంత ఇంట్లోకి వెళ్తున్నట్లే!

"ఎంకావాలీ? ఎవరు కావాలీ? ఎందుకు లోపలకి పోతున్నారు? ఏం జరిగిందీ" అని జోగయ్య అమ్మ ఆందోళనగా పోలీసుల్ని అడుగుతోంది. ఆమె మాటలు వాళ్ళు వినిపించుకోలేదు. కనీసం ఆమెవైపు కూడా చూడలేదు.

మాటలకి మెలకువ వచ్చిన జోగయ్య మంచంమీద లేచి కూర్చోవడం, పోలీసులు రెక్కపట్టుకుని బరబరా బయటకి ఈడ్చుకు వచ్చి వ్యానులో వేసుకుని తీసుకుపోవటం సెకన్లలోనే జరిగిపోయింది.

వ్యానులో కింద, పోలీసుల బూటుకాళ్ళ వద్ద కూర్చున్న జోగయ్యకి పూర్తిగా మెలకువ వచ్చింది. కళ్ళు నులుముకున్నాడు. "ఏం జరిగిందా? " అని యోచించకముందే విషయం అర్థమైపోయింది.

వ్యాను పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళింది. వ్యాను లోనించి జుట్టుపట్టుకుని చచ్చిన కుక్కని ఈడ్చుకుంటూ లాక్కుపోయినట్లు లాక్కుని పోయి లాకప్‌లో వేశారు.

పది నిముషాలు ఫోన్లు ఎవరెవరికో చేశారు. ఎస్ఐ లాకప్‌లోనికి వచ్చాడు.

ముందుగా బెదరగొట్టడానికి ఉపోద్ఘాతం లేకుండానే రెండు లాఠీలు విరిగిపోయాయి. పోలీసులు సింపుల్‌గా శాంపుల్ రుచి చూపించారు.

పోలీసుల దృష్టిలో తేలికగానూ, జోగయ్యకి అది భారీగానూ అనిపించింది.

"చెప్పరా నా కొడకా! ఏం జరిగింది? ఎవరెవరు చేశారీ పని? ఆ అమ్మాయి ప్రాణం ఎందుకు తీశారు? ఇంకా మిగిలిన వాళ్ళు ఎవరు? "

"నాకేం తెలియదండీ! నేనే పాపం ఎరుగనండీ!"

"అలాగా! లాఠీ కర్రలు వీడికి సరిపోలేదురా! వైర్ అందుకో" కానిస్టేబుల్‌కి చెప్పాడు ఎస్.ఐ. గట్టి వైర్ తెచ్చి ఇచ్చాడు కానిస్టేబుల్.

ఎస్ఐ బలంగా ఒకేఒక్క దెబ్బవేశాడు. "పాపం నీకేం తెలియదు కదరా? "

ఒక్కసారిగా నరకం కనపడింది జోగయ్యకి. ఎస్ఐ నోట్లోనించి పూర్తిగా మాటలు కూడా రాలేదు.

"అమ్మో... అయ్యో... చెపతానయ్యో! నన్ను కొట్టవాకండయ్యో! నన్ను చంపవాకండయ్యో" అంటూ గింగిరాలు తిరిగిపోయాడు జోగయ్య.





తరువాత వాళ్ళ ముగ్గురి పేర్లూ, వాళ్ళు ఎక్కడ వుంటారో వివరంగా చెప్పాడు.

"అలా రా దారికి! ఎందుకు చేశారీ పని? వాళ్ళు నీకు ఎలా పరిచయం? "

"వాళ్ళు రోజూ సినిమాకి వస్తారండీ! మొన్న సినిమాలో రేప్‌సీను ఒకటి వుందండీ! అది చూసిన తరువాత వాళ్ళు కూడా ఇట్టచేయాలనుకున్నారండీ! నన్ను తోడు తీసుకుపోయారండీ!"

వేణునీ, రమణని నిముషాల్లోనే తీసుకు వచ్చి లాకప్‌లో వేశారు. సందీప్ రూంలో లేడు. ఎక్కడికి వెళ్ళాడో రూమ్మేటు తనకి తెలియదని చెప్పాడు.

"వస్తే గుట్టుగా మాకు కబురు చేయి. అర్ధరాత్రిలోపు దొరక్కపోయాడో, వాడి బదులు నిన్ను తీసుకుపోయి లాకప్‌లో వేస్తాం" పోలీసులు అతని రూమ్మేటుకి వార్నింగ్ ఇచ్చారు. సందీప్‌కోసం అక్కడే మఫ్టీలో కొంతమంది పోలీసులు కాపుకాశారు.

తాము చేసిన ఘనకార్యం పోలీసులకి తెలిసిపోయిందని సందీప్ గ్రహించాడు. ఇలాంటి పరిస్థితుల్లో పోలీసులకి దొరికితే చాలా ప్రమాదం అని భావించాడు. వెంటనే తప్పుకున్నాడు.

సాయంత్రానికి హంతకులు ఎవరో ప్రజలకి తెలిసింది. పోలీసులే ఉత్సాహం ఆపుకోలేక తెల్సిన వాళ్ళకి చెప్పారు.

హంతకులు అందరూ ఇరవైఏళ్ళులోపు కుర్రవాళ్లే! ఇంకా నూనూగు మీసాలు సైతం రాలేదు. పైగా వాళ్ళు విద్యార్థులు.

వీళ్ళు రంభా థియేటర్‌లో సినిమాలు చూస్తూ ప్రేరణపొంది ఇంతటి ఘాతుకానికి పాల్పడ్డారని కూడా ప్రజలకి తెలిసిపోయింది.

★ ★ ★

సందీప్ తండ్రి వెళ్ళి ఎం.ఎల్.ఏ. కాళ్ళ మీద పడ్డాడు. "మీరే నన్ను ఈ గండం నించి గట్టెక్కించాలి. నాకు ఒక్క కొడుకు. నా ఆశలన్నీ వాడిమీదే! వాడేమో చదువుకుంటానని వెళ్ళి ఇలాంటి పనికి పూనుకున్నాడు"

"ఇప్పుడు నన్ను ఏంచేయమంటావు? " ఎం.ఎల్.ఏ. శ్రీరాం అడిగాడు. ఆయన స్థానికుడు కాదు. జిల్లాలో పలుకుబడి కలిగిన వాడు.

"ఎలాగైనా మావాడ్ని ఈ కేసులో లేకుండా చేయండి. కేసులో కానీ వాడు ఇరుక్కుంటే జీవితఖైదు పడుతుంది. అంత శిక్షపడిన తరువాత ఇంక నేను బతికి వుండటం అనవసరం" అని భోరుమన్నాడు ఆయన.

"కేసు జరిగితే ఏమవుతుందయ్యా? శిక్షలు పడినప్పటి విషయం. మనం మంచి లాయర్‌ని చూసిపెట్టుకుంటే సులువుగా నెగ్గుతాం. ఒకవేళ పొరపాటున ఓడిపోయామే అనుకో, హైకోర్టు ఎలాగూ వుందిగా! హైకోర్టులో ఓడిపోయే అవకాశమే లేదు"

"వద్దు సార్, అంత దూరం పోవద్దు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నా ఉపయోగం వుండదు. ఒకవేళ హైకోర్టులో కూడా ఓడిపోతే? కీడెంచి మేలెంచమన్నారు! ఎఫ్.ఐ.ఆర్.లోనే పేరు లేకుండా చేయండి సార్. పురిట్లోనే గొంతు నొక్కేస్తే ఏ సమస్యా వుండదు. తరువాత బాధ పడాల్సిన పని వుండదు. ఆ పడే బాధ ఏదో ఇప్పుడే పడదాం"

"ఇప్పుడున్న పరిస్థితిలో చాలా కష్టం కదయ్యా! పేరు లేకుండా చేయించుకోవడం అంటే తేలికకాదు. ఇది విద్యార్థులకి సంబంధించిన విషయం. పైగా తోడు ప్రజాసంఘాలవాళ్ళు వుంటారు"

"ఏదైనా మీరే చేయాలి సార్. మా వాడి పేరు వుండకూడదు. మీరు తలుచుకుంటే కష్టం కాదు. రాజు తలుచుకుంటే దెబ్బలకి కొదువా? "

"ఇదేం రాచరికం కాదుగదా! ప్రతి ఒక్కటీ

ఎలా చేయగలం? ప్రయత్నించి చూద్దాం"

"ఎంత డబ్బు అయినా ఇప్పుడే పెడదాం. ఎవరికి ఎక్కడ ఎంత పారెయ్యాలో అంత పారేద్దాం"

సందీప్‌ని ఎం.ఎల్.ఏ ఇంట్లోనే ఒక గదిలో దాచిపెట్టారు. అంతకుమించిన సురక్షితస్థావరం ఇంక ఏదీ వుండదని వాళ్ళకి తెలుసు!

ఎం.ఎల్.ఏ. భుజాన కండువా సవరించుకున్నాడు. అలా సవరించుకున్నాడంటే రంగంలోనికి దిగడమే! ఫోనులమీద ఈ పని కాదని తెలుసు.

ఎస్పీ ఆఫీసుకి వెళ్ళాడు. డిఎస్పీ ఆఫీసుకి వెళ్ళాడు. శక్తివంచనలేకుండా శాయశక్తులా ప్రయత్నాలు మొదలుపెట్టాడు. ఎలాగో విషయం బయటపడింది.

సునంద హంతకుల్ని కాపాడే ప్రయత్నాలు జోరుగా జరుగుతున్నాయని విద్యార్థిలోకానికి తెలిసింది. నిరసన పెల్లుబికింది.

★ ★ ★

మరుసటిరోజు వుదయమే కరుణ కాలేజీకి వచ్చింది. రంభా హాలు హోర్డింగ్‌ని చూసి ఆశ్చర్యపోయింది.

ఎప్పుడూ బూతు చిత్రాలతో వుండే హోర్డింగ్ ఈరోజు కుటుంబ సమేతంగా చూడతగిన భక్తిరస ప్రధానమైన పోస్టర్‌తో బుద్ధిగా, అమాయకంగా దర్శనమిచ్చింది. అంతకుముందు రోజు సాయంత్రమే 'కామకేళి' పోస్టర్ వుంది.

ఇతర కాలేజీలనించీ, పీజి సెంటర్ నించీ గోపాల్, ఇంకా చాలామంది విద్యార్థులు వచ్చారు.

"ఏమిటి వచ్చారు? " అడిగింది కరుణ.

"ఇవ్వాళ కూడా వూరేగింపు తీయాలి. హంతకుల్ని రక్షించే పని ప్రారంభమైంది. ఎం.ఎల్.ఏ శ్రీరాం రంగంలోనికి దిగాడు. మళ్లీ కలెక్టర్ని కలుసుకోవాలి మనం!"

కరుణ కాలేజీ విద్యార్థులు అందర్నీ కలిసింది. ఊరేగింపు విషయం చెప్పింది. అందరూ సిద్ధమయ్యారు.

గేటు ముందునించి వూరేగింపు ప్రారంభం కాబోతుండగా ఒక కుర్రాడు ఒక రాయి తీసుకుని గురిచూసి అక్కడ వున్న హోర్డింగ్‌కి విసిరికొట్టాడు. 'టప్'మని పెద్ద శబ్దంతో హోర్డింగ్‌కి పెద్ద చొట్ట పడింది. అతన్ని చూసి ఇద్దరు విద్యార్థులు రాళ్ళు అందుకుని దానిమీదకి విసిరారు.

"మీరు అలా చేయకూడదు. శాంతియుతంగా ప్రదర్శన జరపాలి. అరాచకత్వం వుండకూడదు" అని గోపాల్ విద్యార్థులకి నచ్చచెపుతున్నాడు. అతని మాట పట్టించుకోకుండానే రాళ్ళ వర్షం కురిపించడానికి విద్యార్థులు సిద్ధమయ్యారు.

"మీరు అలా రాళ్ళు వేస్తే బాగుండదు. పోలీసులు వస్తారూ, గొడవలవుతాయి" అని గోపాల్ పెద్దగా చెప్పి, ముందు వరుసలో రాళ్ళు తీసుకుని వున్న వాళ్లనించి రాళ్ళు కింద వేయించాడు. కరుణ కూడా రాళ్ళు వేయడానికి అంగీకరించలేదు.

ఊరేగింపు ప్రారంభమైంది. గోపాల్, కరుణ ఇంకా కొందరు వూరేగింపుకి నాయకత్వం వహిస్తున్నారు.

"సునంద హంతకుల్ని- శిక్షించాలి.

అశ్లీల సినిమా ప్రదర్శనల్ని- నిషేధించాలి.

హంతకుల్ని రక్షింపచూస్తున్న నాయకులు- డౌన్‌డౌన్"

ప్రదర్శన రంభా హాలు సమీపంలోనికి వచ్చింది. అప్పుడే గేట్లు తీసి మార్నింగ్ షోకి టిక్కెట్లు ఇస్తున్నారు.

అసంఖ్యాకంగా విద్యార్థులు, ఆగ్రహావేశాలతో వుడికిపోతున్న యువతరం!

ఒక్కసారిగా విద్యార్థులు థియేటర్‌లోనికి చొచ్చుకుపోయారు. వాళ్ళని ఆపటం ఎవరితరం కాలేదు.

విద్యార్థులకి మొదటగా ఫోన్ కంటపడింది. దాన్ని ఎత్తి కిందపడేసి ఏదో పెద్ద




ఇనుప వస్తువు అక్కడ వుంటే, అది తీసు కుని ఫోన్‌ని మెత్తటి పిండిచేసి పెట్టారు.

కుర్చీలూ, ఫర్నీచర్, ప్రొజెక్టర్లూ ఒకటే మిటి, విద్యార్థుల ధాటికి ఏవీ ఆగలేదు. వీర విహారం చేశారు. దొరికిన వాటిని దొరికి నట్లు నాశనం చేసి వదిలారు.

ఇరవై నిమిషాల అనంతరం వెలుపలకి వచ్చి కొద్దిపాటి జనంతో వున్న వూరేగిం పులో కలిసిపోయారు.

ఊరేగింపు కలెక్టర్ ఛాంబర్‌కి చేరు కుంది. హంతకుల్ని రక్షించే ప్రయత్నం పెద్దస్థాయిలో జరుగుతోందనీ, అలా చేయ వద్దనీ, హంతకులు చట్టంనించి తప్పించు కుంటే ప్రభుత్వమే బాధ్యత వహించాల్సి వుంటుందనీ కలెక్టర్‌కి మెమోరాండం ఇచ్చారు.

★ ★ ★

"ఇంతమంది వుండి మీరు ఏంచేస్తు న్నార్రా? ఎలక్షన్ సమయాల్లోనో, పార్టీల గొడవల్లోనో పనికి వస్తాయని స్టోర్ రూంలో దాచిపెట్టిన ఇనుపరాడ్లు తీసుకుని ఒక్కొక్కడ్ని వేసెయ్యక పోయారా? ఒకరో ఇద్దరో చస్తే నేను చూసుకునేవాడ్ని కదా కేసూ గీసూ లేకుండా"

"వాళ్ళు చాలామంది వున్నారు సార్. అనుకోకుండా ఒక్కసారిగా వచ్చిపడ్డారు"

"అప్పుడు మీరంతా గాజులు తొడుక్కుని కూర్చున్నారు. కనీసం పోలీసులకైనా ఫోన్ చేసి చెప్పవచ్చు కదా, అల్లరి మూకలు హాలు మీద దాడికి పాల్పడ్డారనీ"

"రావడమే ఫోన్‌మీదపడి దానిని పాడు చేసి పెట్టారు సార్. ఫోన్ చేద్దామనుకుం టున్నంతలోనే దానిని లాగేసుకున్నారు"

"అసలు మీకు బుద్ధిలేదు. ఒకడు బైట కైనా వచ్చి పబ్లిక్ ఫోన్‌నించి చేసి పోలీసు లకి తెలియపరచకూడదూ? నా పేరు చెబితే పోలీసులు ఆఘమేఘాలమీద రాక పోయారా? వచ్చి వెధవల్ని కాల్చి అవతల పారెయ్యకపోయారా?"

మున్సిపల్ ఛైర్మన్ కోపంతో వూగిపోతు న్నాడు. పిచ్చిపట్టినట్లు వుంది. పళ్ళు పటప టలాడిస్తూ కోపాన్ని అంతా హాలుసిబ్బంది మీద ప్రదర్శిస్తున్నాడు.

హాలుకి కనీసం 60, 70 వేల రూపా యల నష్టం సంభవించింది. ప్రొజెక్టర్లని కూడా నష్టపరిచారు. తమ హాలులోని ప్రొజెక్టర్లులాంటివి ఇప్పుడు ఎన్ని వేలు పోసినా దొరకవు! వెనుకటి రోజుల్లో వచ్చిన మంచి క్వాలిటీ కలిగినవి.

20 నిముషాల టైంలోనే 60, 70 వేలు నష్టపరిచింది వానరమూక! హాలుమీద అంత డబ్బు రికవర్ కావాలంటే ఎంత కాలం పడుతుందో! ఎంత కాలం పట్టినా నష్టం నష్టమే! పోయిన డబ్బు రాదు. దాడి చేసిన వెధవల్ని వదిలిపెట్టకూడదు. వాళ్ళకి జైలు పురుగుల కూడు తినిపించాలి.

"హాలుమీదకి వచ్చిన వాళ్ళలో కొంతమం దిని అయినా గుర్తుపడతార్రా?"

సిబ్బంది నీళ్ళునమిలారు.

"వచ్చిన వెధవల్ని కూడా చూడకుండా మీరు పోయి గదిలో తలుపులు వేసుకుని దాక్కున్నారన్నమాట"

"నాకు ముగ్గురు గుర్తుసార్. గీతల చొక్కాలు వేసుకుని వున్నారు. వాళ్ళు ఏ కాలేజీ వాళ్ళో, ఎవరో!"

"ఏడవకపోయావ్! కనీసం వెనుకవున్న వాడ్ని ఒకడ్ని పట్టుకుని కట్టిపడవేస్తే, వాడి ద్వారా మిగతా వాళ్ళు ఎవరో తెలుసుకుని వుండేవాళ్ళం కదా!" ఛైర్మన్ హాలు సిబ్బం దిని బండబూతులుతిట్టాడు.

తరువాత జీపుని నేరుగా సర్కిల్ ఇన్స్ పెక్టర్ కార్యాలయానికి పోనిచ్చాడు. సిఐ ధుమధుమ లాడుతున్నాడు. ఛైర్మన్‌ని చూసి నిరాసక్తంగా విష్‌చేసి మళ్ళీ తన పనిలో పడ్డాడు.

"చూశారా సార్, స్టూడెంట్స్ మా హాలు మీదపడి ఎంత నష్టపరిచారో! వాళ్ళమీద కేసు పెట్టాలి సార్. లాకప్‌లో వేసి ఒక్కొ

క్కణ్ణి నెత్తురుపడేవరకూ కొట్టాలి సార్"

"కొడతాం సార్ కొడతాం. నెత్తురు పడే వరకూ కొడతాం! వాళ్లు లాకప్‌లో చస్తే మళ్ళీ మేమే వాళ్ళ స్థానంలో వెళ్ళి లాకప్‌లో పడతాం. అడకత్తెరలో పోకచెక్కలు వుంటాయి చూశారూ, అలా అయ్యాయి సార్ మా బతుకులు!"

"అదేమిటి సార్ అలా అంటున్నారు? "

"మరేమిటి సార్? ఒకరోజూ, రెండురోజులు కాదు, ఎప్పుడో ఒకసారి కాదు. ఆర్నెల్లనించీ మీ హాల్లో నిరాటంకంగా బ్లూఫిలింస్ వేస్తున్నారంటే ఏమనుకోవాలి? అదిప్పుడు మా మెడకి చుట్టుకుంది. ఇంత కాలంనించీ ఆ హాల్లో బ్లూఫిలిమ్స్ వేస్తుంటే నువ్వేం చేస్తున్నావురా నా కొడకా అన్నాడు నిన్న డిఎస్పీ పదిమంది ముందూ! అంతటితో వదిలితే బాగుండు, నువ్వసలు ఒక అయ్యా, అమ్మకి పుట్టినవాడివేనా? లేకపోతే సంకరజాతి నాకొడుకువా అన్నాడు. చివరికి దేనికైనా బలయ్యేది మేమే కదండీ! చూడండి మీ వలన ఎన్ని మాటలు పడాల్సివచ్చిందో!"

"నాకు అసలు వాటి విషయమే తెలియదండీ! నాకు మున్సిపాల్టీతోనే సరిపోతుంది. హాలు విషయం పట్టించుకోను. ఇదంతా ఆ మేనేజర్‌గాడు చేసినపని. నాకు తెలిస్తే అలాంటి సినిమాల్ని ఎలా అనుమతిస్తాను? "

"మీ హాల్లో వేస్తున్నట్లు మీకూ తెలియదు, మా పైఅధికార్లకు కూడా తెలియదు. మధ్యలో మేం వున్నాంకదా బలిపశువులం!"

"ఒకసారి నాకు కొద్దిగా తెలిస్తే మేనేజర్ని కోప్పడ్డాను. ఎప్పుడూ అలాంటివి వేయవద్దని గట్టిగా చెప్పాను"

"మీరు వద్దని చెప్పినా మీ మేనేజర్ ఆ బొమ్మలు తీసుకొచ్చి వేస్తున్నాడు. ఇక్కడ మేం చెవుల్లో పువ్వులు పెట్టుకుని కూర్చున్నాం. చెప్పండి సార్ కథలూ!"

"అది కాదు సార్..."

"ఏదికాదు సార్? ఈ పిల్లనాకొడుకులు ఆ బొమ్మలు చూసీ చూసీ మత్తెక్కి మదం పట్టిపోయి ఇంత దారుణానికి వడిగట్టారు"

"మోకాలికీ, బట్టతలకీ ముడిపెట్టడం అంటే ఇదే సార్. వాళ్ళు సినిమాలు చూడటానికీ, ఈ పని చేయడానికీ ఏం సంబంధం సార్? రోజూ వేయిమంది చూస్తున్నారు ఈ సినిమాలు. అందరూ ఇలాంటి పనులే చేస్తున్నారా? "

"అందరూ చేస్తే ఇంకా బాగుంటుంది సార్. మీరు వేస్తున్న సినిమాలు చూడటానికీ, వాళ్ళు ఈ పనిచేయడానికీ సంబంధం వుంటుందో, వుండదో నాకు కాదు సార్... మా ఎస్పీగారికి చెప్పండి. ఆయన ఇప్పుడు గరంగరంమీద వున్నాడు"

"మా హాలుకి స్టూడెంట్స్‌వలన డేమేజీ జరిగింది. ముందు మీరు కేసు బుక్ చేయండి సార్"

"ఆ గదిలో రైటర్ వున్నాడు. అతనికి చెప్పి కేసు రాయించండి" అన్నాడు సిఐ.

సిఐకి చాలా బాధగా వుంది. నిన్న డిఎస్పీ జనం, స్టాఫ్ చాలామంది వుంటే అందరి సమక్షంలో తనని తిట్టిన తిట్లే తల పుకొస్తున్నాయి. చాలా చండాలంగా తిట్టాడు.

సిగ్గూ, మానం, అభిమానం అన్నీ ఖాకీ డ్రెస్సు వేసుకున్న మొదట్లోనే విడిచిపెట్టాడు కాబట్టి తను బతికి వున్నాడు కానీ, ఇంకొకరు అయితే ఈపాటికి సూయిసైడ్ చేసుకుని వుండేవాడు. ఈ చైర్మన్ తనని ఏం చేస్తాడు? అంతగా అయితే మరో వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించగలడు.

కానీయ్, తనూ ఎప్పుడెప్పుడు ఈ వూరు విడిచి వెళ్ళిపోదామా అనే చూస్తున్నాడు.

ఇంతమాత్రం నిర్మొహమాటంగా మాట్లాడకపోతే లాభంలేదు. ఇప్పటికే ఈ నాయకులు తమ భుజాలమీద కూర్చుని స్వారీ చేస్తున్నారు. ఇంకా మెత్తగా వుంటే ఝుట్టుప





ట్టుకుని గాడిదల మాదిరిగా తమమీద కూర్చుని వూరేగుతారు.



డిఎస్పీకి ఎదురుగా వున్న కుర్చీలలో ఒక దాంట్లో ఎం.ఎల్.ఏ., మరోదాంట్లో సందీప్ తండ్రి ఆసీనులై వున్నారు.

డిఎస్పీకి ఎంఎల్ఏ గాడ్‌ఫాదర్.

రెండు సందర్భాలలో తన సస్పెన్షన్‌కి తయారైన ఆర్డర్స్‌ని పలుకుబడి ఉపయోగించి, హోంమంత్రి వద్ద కూర్చుని చివరి నిముషంలో కాన్సిల్ చేయించాడు. తనని ఆపదలో ఆదుకున్నాడు.

ఇప్పుడు ఈ కేసులో సందీప్ పేరు లేకుండా చేయాలి. సందీప్ బదులు ఏ సుబ్బారావునో, సన్యాసిరావునో ఇరికించి అతని పేరు తీయించాలి.

"నిజమే సార్, మీరు చెబితే కాదంటానా నేను? ఎదురుగా వున్న బావిలో దూకమని మీరు ఆర్డర్ వేస్తే నేను మరో ఆలోచన లేకుండా దూకుతాను. ఇదే విషయం ఆలోచిస్తున్నాను. వీలవుతుందా, కాదా అని..."

"నువ్వు తలుచుకుంటే కాకపోవటం ఏమిటీ? "

"ఈ కేసులో ఎస్పీ సీరియస్‌గా వున్నాడు సార్. ఎప్పటికప్పుడు ఎంక్వయిరీ చేస్తున్నాడు. ఇది జిల్లా హెడ్‌క్వార్టర్. మారుమూల పల్లె అయితే ఎలాగో మేనేజ్ చేయవచ్చు. పైగా ఇది స్టూడెంట్స్‌కి సంబంధించిన విషయం. ఇప్పటికే ఇవ్వాళ పేపర్లు అన్నీ ఏకి వదిలిపెట్టాయి. ఎస్పీ స్పెషల్‌గా ఈ కేసు విషయం చూస్తున్నాడు!"

"ఎస్పీకి ఏదో నచ్చచెప్పు"

"పైఅధికార్లకి ఏమని చెప్పగలం సార్? మీరే ఎస్పీతో ఒకమాట మాట్లాడితే బాగుంటుంది"

"నేనా? అసలే ఈ ఎస్పీగాడు తిక్కముండాకొడుకు. నన్ను నోర్మూసుకుని పొమ్మనేటంత కలేజా కలిగినవాడు. ఆయనని ఇక్కడ్నించి లేపెయ్యాలని నేను ప్రయత్నించినట్లు ఎవరు పుకారు పుట్టించారో ఈయన నమ్మి కూర్చున్నాడు. నేను చెబితే అసలు పనికాదు"

"మరి ఎలా సార్ ఇప్పుడు? నేను కింది స్థాయివాణ్ణే కానీ పైవాణ్ణి కాదుగదా!"

"నువ్వు చేసేపని మాకు వూరికే వద్దులేవయ్యా! డబ్బు తీసుకో. నువ్వు మాత్రం మానించి మాట ఎందుకు పడాలి? "

ఎంఎల్ఏ అలా అంటూ సందీప్ తండ్రికి సైగ చేశాడు. ఆయన జేబులోనించి ఐదు వందల రూపాయల కాగితాలకట్ట ఒకటి తీసి డిఎస్పీ ముందు టేబుల్‌మీద పెట్టాడు.

"ముందు డబ్బు జేబులో పెట్టుకోండి సార్, ఎవరైనా వస్తే బాగుండదు" అన్నాడు డిఎస్పీ.

"ఉంచుకో పర్లేదు" ఎంఎల్ఏ అన్నాడు.

"ఏసీబివాళ్ళు వస్తే అందరం ఇరుక్కుపోతాం. ముందు ఆ కట్ట మీ జేబులో పెట్టుకోండి" డిఎస్పీ మళ్ళీ మరోసారి బతిమాలినట్లుగా అన్నాడు.

సందీప్ తండ్రి వాటిని తన లాల్చీ జేబులో వేసుకున్నాడు.

యాభైవేలు! కాదూ కూడదంటే ఇంకో

ఇరవైవేలు అవలీలగా ఇస్తారు. కేసు వాడి మీద ఫైల్ చేయకుండా వాడ్ని తప్పించి వేరేవాడ్ని ఇరికించాలి. ఎలా? ఎస్పీతోనే సమస్య. పరిపరివిధాలుగా ఆలోచిస్తున్నాడు డిఎస్పీ.

"ఇక్కడ తీసుకోవడం బాగుండదనుకుంటే ఇంటికి పంపిస్తాంలే డబ్బు" ఎం.ఎల్.ఏ. అన్నాడు.

"ఛ... మీ దగ్గర డబ్బుకి ఆశపడతానా సార్ నేను? మీరు గతంలో నాకు చేసిన సాయం ఎన్ని జన్మలు ఎత్తినా తీర్చుకోగలనా సార్? "

"ఆ విషయాలు ఇప్పుడు ఎందుకులే? ఇతను నాకు కుడిభుజంలాంటివాడు. ఇతనికి ఒక్కడే కొడుకు. వాడు ఈ వెధవపని చేశాడు. ముందు వాడ్ని కేసులో లేకుండా చేసి ఎంత కావాలంటే అంత తీసుకో"

"సరే సార్. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. వీలైనంతవరకూ వాడిమీద కేసు లేకుండా చేయడానికి కృషిచేస్తాను. ఎస్.ఐ., సి.ఐ.లతో కూడా మాట్లాడి మీకు ఫేవర్‌గా వుండేలా చేస్తాను. వాళ్ళ ముఖాన కూడా కొంత మేత వేయండి"

"అలాగే వాళ్ళకి ఇస్తాం. గ్యారంటీగా చేస్తారుకదా మీరు"

"గట్టిగా ప్రయత్నిస్తాను సార్. ఎస్పీ గండంనించి తప్పించుకుంటే పెద్ద సమస్య వుండదు సార్. సరే, డబ్బు మా ఇంటికి పంపించండి. ఇంకొంత ఎమౌంట్ కూడా కలిపి పంపించండి సార్"

"ఇంకొంత అంటే మొత్తం ఎంత ఇమ్మంటారు? "

"ఇంతక్రితం మీరే యాభై తీశారుకదా! ఇంకో పాతిక కలిపి మా ఇంటి వద్ద ఇచ్చేయండి"

"నువ్వు చెప్పినట్లు ఇస్తాంకానీ పని మాత్రం కావాలి"

"మీరు ఇన్నిసార్లు చెప్పాలా ఎంఎల్ఏ గారూ... ఆరమో, భారమో చేద్దాం" భరోసా ఇచ్చాడు డిఎస్పీ.

ఎంఎల్ఏకి భరోసా ఇచ్చినా భయంగానే వుంది. కళ్ళముందు డబ్బు కదలాడుతోంది. మరోవైపు ఎస్పీ ఉగ్రనరసింహావతారం ఎత్తి త్రిశూలంతోపాటు అనేకరకాల ఆయుధాల్ని ధరించి తనపని పడుతున్న దృశ్యం ప్రత్యక్షమవుతోంది కళ్ళముందు.

తనతోపాటు సర్వీసులో చేరినవాళ్లు కోటి రూపాయలు పైచిలుకు సంపాయించిన వాళ్ళు వున్నారు. తను కనీసం 60, 70 లక్షలు కూడా వెనకేసుకోలేకపోయాడు. ప్రతిదానికీ వెనుకంజే!

ఎంఎల్ఏ అడిగితే కాదనడం తనకి మర్యాద కాదు. పైగా డబ్బు ఆశ కూడా పెట్టాడు. అంతగా అయితే ఎస్పీ విషయం ఎంఎల్ఏ చూసుకుంటాడు.

చివరికి డిఎస్పీ డబ్బువైపు మొగ్గాడు.

సిఐని పిలిపించి మాట్లాడాలంటే సంకోచం కలిగింది. అంతకుముందురోజు తను అందరిముందూ సిఐని చడామడా తిట్టాడు. వాడి ముఖం అప్పుడే నల్లగా మాడిపోయింది.

'మాట్లాడి చూద్దాం' అని సిఐని తన రూంకి పిలిపించాడు. విషయం చెప్పాడు.

"వాడికి బదులుగా మరొకర్ని కేసులో ఇరికిస్తాం. రేపు ఎస్పీ ఎలాగూ అడుగుతాడు. అప్పుడు మీరు మమ్మల్ని బలిచేస్తారు. అదేకదా జరిగేది? "

"నీమీద మాట రాకుండా నేను చూస్తాను కదా? "

"నేను మీరు చెప్పిన పనివరకే చేస్తాను సార్. అంతవరకే నా డ్యూటీ. అంతకు మించి నామీద ఏంభారం పెట్టుకోను" సిఐ స్పష్టంగా చెప్పాడు.

"అలాగే కానీ..." అన్నాడు డిఎస్పీ.

అప్పటికప్పుడే పోలీసుల్ని టౌన్‌మీదకు తరిమారు. వాళ్ళు జేబుదొంగలు ఎవరెవరు వున్నారో వాళ్ళందర్నీ పట్టుకుని వచ్చి లాకప్‌లో వేశారు.

వాళ్ళలో సందీప్ వయసుకలిగిన వాళ్ళని ముగ్గుర్ని వుంచారు. మిగతావాళ్ళని ఇళ్ళకి పంపిస్తూ వార్నింగ్ ఇచ్చారు.

"రేయ్... ఇటీవల టౌన్‌లో జేబుదొంగత నాలు ఎక్కువ అయ్యాయి. మాకు ఫిర్యా దులు కూడా ఎక్కువగా వస్తున్నాయి. ఈసారి టౌన్‌లో ఎక్కడైనా జేబుదొంగ తనం జరిగినట్లు తెలిస్తే మీ అందరికీ మూడిందే! వారంరోజులపాటు లాకప్‌లో వేసి కూడూ నీళ్లూ లేకుండా ఎండగడతాం. జాగ్రత్తగా మసలుకోండి" అని వాళ్ళని హెచ్చరించారు.

తీసుకువచ్చిన వాళ్ళని . వూరికే పంపిం చడం బాగుండదనే వాళ్ళని అలా హెచ్చ రించి వదిలిపెట్టాడు.

ఉన్న ముగ్గురిలో సంజీవ్ అనేవాడ్ని పట్టుకున్నాడు ఎస్పీ. వాడు చాకులాగా వున్నాడు.

"రేయ్... నువ్వు మాకు ఒక పని చేసిపె ట్టాల్రా! మేం చెప్పిన పనిచేస్తే నిన్ను వది లేస్తాం. నువ్వేం చేసినా నిన్ను అడిగేవాడు ఎవరూ వుండడు"

"చెప్పండి సార్"

"మొన్న రేప్ అండ్ మర్డర్ జరిగింది కదా! వాళ్ళలో ముగ్గురు దొరికారు. నాలు గోవాడు దొరకలేదు. వాడికి బదులుగా నిన్ను పెడతాం. నువ్వు వప్పుకోవాలి!"

"అమ్మ బాబోయ్... నా గొంతుకి ఉరి బిగించకండి సార్. నేనేదో ఐదూ పదీ వందా జేబులు కొట్టేవాడ్నే కానీ అంత పెద్ద క్రిమినల్‌ని కాను సార్"

"నీకేం కాదురా. శిక్షలూ గిక్షలూ ఏం పడవు. నీకు డబ్బు కూడా ఇస్తాం"

"వద్దు సార్. నన్ను ఇలా బతకనివ్వండి. మీరు ఇంకోపని చెప్పండి చేస్తాను. నలుగురి జేబులు కొట్టుకుని వచ్చి ఇవ్వమని అడగండి ఇస్తాను. అంతేకానీ ఇందులో మాత్రం నన్ను ఇరికించొద్దు సార్"

"వప్పుకోవురా నా కొడకా! నువ్వు మాటలతో వప్పుకోవు. కుళ్ళబొడిస్తే కానీ మీరు దారికి రార్రా!" అంటూ సంజీవ్‌మీద థర్డ్ డిగ్రీ మెథడ్స్ ప్రయోగించారు. లాఠీలూ వైర్లూ, బెల్ట్‌లూ ఫటాఫట్టయ్యాయి.

"నామీద ఇంకో కేసు బనాయించండి వప్పుకుంటాను. రేప్ కేసు మాత్రం నామీద పెట్టొద్దు సార్. అది చాలా పాపం సార్. నాకు ముగ్గురు అక్కచెల్లెళ్లు వున్నారు. నేనంటే ప్రాణం ఇస్తారు. నేను జేబులు కొట్టేవాడ్నే కానీ ఆడబిడ్డల్ని వేధించేవాడ్ని కాను సార్ వాళ్లలో నాకు నా తోబుట్టువులే కనిపిస్తారు సార్"

"ఛట్ లం... కొడకా నీతులు మాట్లాడ తావురా? నువ్వు నిజంగా చెయ్యలేదుక దరా! ఇది కేసేకదా! కేసు కోసం వప్పుకోడా నికేంరా?" అంటూ ఫుట్‌బాల్‌లా అతని శరీరంతో ఆడుకోవడం మొదలుపెట్టారు.

పోలీస్ హింస భరించలేక చివరకు సంజీవ్ అనే ఆ జేబులుకొట్టే నేరస్తుడు చేయని నేరాన్ని చేసినట్లు చెప్పుకోడానికి వప్పుకున్నాడు.

సునంద హత్య కేసులో నిందితులు నలుగుర్ని అరెస్టు చేసి కోర్టులో హాజరుపరి చారు. జడ్జి వాళ్ళకి రిమాండ్ వేశాడు.

"అసలు మమ్మల్ని ఈ పనికి పురిగొల్పింది సందీప్‌గాడు. వాడు కేసులో లేకుండా పోయాడు. చివరకి అన్నెం పున్నెం ఎరుగని ఎవడ్నో తీసుకొచ్చి వాడి మీద కేసు పెట్టారు మాతోపాటు కలిపి. నిజానికి వాడికి సునంద ఎలా వుంటుందో కూడా తెలియదు. వాడికి ఏం సంబంధం లేదు" అని వేణు, రమణ తల్లిదండ్రుల వద్దా, ప్లీడర్ వద్దా మొరపెట్టుకున్నారు.

నేరం జరిగి 48 గంటలు గడవకముందే నిందితుల్ని అరెస్ట్ చేయడంతో పోలీసుల్ని చాలామంది ప్రశంసించారు.

అయితే నేరంలో ప్రధాన పాత్ర పోషించిన సందీప్ స్థానంలో మరొకర్ని ప్రవేశపె ట్టారనీ, అసలు నేరస్తుడు తప్పించుకుపో

# ఏరిన ముత్యాలు

★ సంతృప్తి శత్రువులు దాడిచేసి వశపరచుకోలేని కోటలాంటిది.

–ఎపిక్టెటస్

★ మీరు ఈ దేశంలో పుట్టారు గనుక ఇతర దేశాలకంటే మీ దేశం గొప్పదన్న మీ దృఢ విశ్వాసమే దేశభక్తి.

–బెర్నార్డ్‌షా

★ అప్పు ఇవ్వండి. మీ స్నేహితులను పోగొట్టుకోండి.

–డి.ఆర్.గుప్తా

★ తాను శ్రమించిన పనివల్ల అతడికి లభించే ఫలితంపై కాకుండా అతడు మారిన విధమే అతిగొప్ప బహుమతి అవుతుంది.

–జాన్‌రస్కిన్

★ రేపన్నది సోమరులు ఎక్కువగా పనిచేయవలసిన రోజు.

–నార్వేజియన్ సామెత

★ భగవంతుడిచే రక్షింపబడే వ్యక్తికి ఎవరూ హాని చేయడానికి సాహసించలేరు.

–మహాత్మాగాంధీ

★ మనలో ముష్టియుద్ధానికి దిగేవ్యక్తి మన నరాలను బలపరిచి మన నైపుణ్యానికి పదును పెడతాడు. మన పోటీదారుడే మన సహాయకుడు.

–ఎడ్మండ్ బర్క్

★ వ్యర్థవాగ్వాదాలు చేసేవారికి మిగిలేది అశాంతి, ఆవేదన.

–సిసిరో

★ వీర్యవంతులను బలహీనులుగా చేసి బలహీనులను వీరులుగా చేయలేవు.

–అబ్రహాంలింకన్

★ ఊరికే దొరికిన పుస్తకాన్ని సాధారణంగా చదువరు. డబ్బు పెట్టి కొంటే తప్పకుండా చదువుతారు.

–శామ్యూల్ జాన్సన్

★ ధనవంతుడిగా మరణించడంకంటే ధనవంతుడిగా జీవించడం హాయి.

–బ్రౌన్

★ స్త్రీలు పురుషులకంటే ఎక్కువ తెలివైనవారు. తక్కువ తెలుసుకుని ఎక్కువ అర్థం చేసుకుంటారు.

–స్టీఫెన్స్

★ చిన్న విషయాలలో కూడా జాగ్రత్త పడితేనే పరిపూర్ణత లభిస్తుంది. అయితే పరిపూర్ణత అనేది చిన్న విషయం కాదు.

–గాంధీ

★ తలమీద జుట్టు అందాన్నిస్తుంది. తలలోని జ్ఞానం గొప్పదనాన్ని కలిగిస్తుంది.

–స్వామీ చిన్మయానంద

సేకరణ: పి.వి.రమణకుమార్

యాడనే విషయం నెమ్మదిగా గుప్పుమంది. ప్రశంసించిన నోళ్లే పోలీసుల్ని ఛీకొట్టాయి.

★ ★ ★

ప్రధాన నేరస్తుడు తప్పించుకుని బహిరంగంగా వున్నాడనే విషయం కరుణకి తెల్సింది.

ఫ్రెండ్స్‌తో మాట్లాడింది. "ఎంత మోసం. నేరస్తుడ్ని వదిలిపెట్టకూడదు. అమాయకుడ్ని తీసుకుపోయి ఇరికించారు. ఆమాయకుడు అన్యాయమైపోకూడదు"

"మనం ఏం చేయగలం చెప్పు? నువ్వేది చేద్దామని చెబితే అది చేద్దాం. ఏం చేద్దామో ఆలోచించు" అన్నారు మిత్రులు.

కరుణకి ఏం చేయాలో అర్థంకాలేదు. నేరస్తుడు మాత్రం తప్పించుకోకూడదనే విషయం బలంగా వుంది.

"చేయాలి. ఏదో ఒకటి చేయాలి. నిందితుడ్ని మాత్రం వదలకూడదు" అంది కరుణ.

ఇలాంటి సమయంలో గోపాల్ వుంటే బాగుండేది. అతనికి తెలిస్తే వూరుకోడు. అతను వస్తే బాగుండు, ఏం చేయాలో ఆలోచించవచ్చు అనుకుంటూ కరుణ కాలేజీకి వెళ్లింది.

కాలేజీలో కూడా ఇదే విషయం ఆలోచిస్తున్న సమయంలో గోపాల్, అతని స్నేహితుడు మరొకరు కలిసి కరుణ కోసం కాలేజీకి వచ్చారు.

"మనం అనుకున్నంత పనీ జరిగింది కరుణగారూ! అసలు నేరస్తుడ్ని విడిచిపెట్టి ఎవరో అమాయకుడ్ని ఇరికించారు. వెళ్ళి మనం ఎస్పీతో మాట్లాడుదాం"

"మనం ముగ్గురమేనా?"

"ఇంకా కొంతమంది వున్నారు. వాళ్ళు వాళ్ళ కాలేజీలో స్టూడెంట్స్ ఆర్గనైజర్స్‌గా వున్నారు. ఇప్పుడు వాళ్ళు సాధనా కాలేజీ దగ్గర మన కోసం ఎదురుచూస్తుంటారు. వెళ్దాం" అన్నాడు గోపాల్.

వీళ్ళు వెళ్ళి వాళ్లని కలుపుకుని అందరూ ఎస్పీ ఆఫీసుకి వెళ్ళారు.

ఎస్పీకి కూడా సందీప్‌ని తప్పించారనే విషయం అంతక్రితమే తెల్సింది. డిఎస్పీ క్యాంప్‌కి వెళ్లాడు. డిఎస్పీకి క్యాంప్‌ని క్యాన్సిల్ చేసుకుని తక్షణం బయల్దేరి ఆఫీసుకి రావాలని ఎస్పీ ఆఫీసునించి మెసేజ్ వెళ్లింది.

టౌన్‌లో లేకుండా తప్పించుకోడానికే డిఎస్పీ క్యాంప్ పెట్టుకున్నాడు. అది క్యాన్సిల్ చేసుకుని రమ్మనడంతో భయంతోనే వెనక్కి కదిలాడు.

ఎస్పీ లోనికి పర్మిషన్ ఇవ్వడంతో స్టూడెంట్ లీడర్స్ అందరూ లోనికి జొరబడ్డారు. అప్పటికే ఆయన ముందు వినయంగా డిఎస్పీ అటెన్షన్‌లో నిలబడివున్నాడు.

"ఏమిటి వచ్చారు?" అడిగాడు ఎస్పీ హుందాగా.

"నేరం ఒకరు చేస్తే మీరు వేరొకర్ని నిర్బంధించారు సార్. నిందితుడు తప్పించుకుంటే అమాయకుడు బోను ఎక్కాడు"

"మీరు చెప్పేదేమిటి?"

"సునందని హత్య చేసిన వాళ్లలో ముఖ్యుడు సందీప్ అనే మా కాలేజీ కుర్రవాడు. నిందితుల్ని పట్టుకున్న వెంటనే ఇది అందరికీ తెల్సింది. మీరు అతన్ని విడిచిపెట్టి వేరే అతన్ని పట్టుకున్నారు"

"అదేమీ కాదండీ. మా ఇంటరాగేషన్‌లో ఈ నలుగురే చేసినట్లు తెల్సింది. కోర్టులో కూడా ఈ నలుగురూ తాము కలిసే నేరం చేశామని అంగీకరించారు"

"సందీప్ అనే కుర్రాడు వున్నట్లు మా కాలేజీ స్టూడెంట్స్ అందరికీ తెల్సు. వాడు పెద్ద పోరంబోకు. మొత్తానికి పెద్ద గూడుపుఠాణీ ఏదో జరిగింది. మీ అధికారులు బాగా డబ్బు తిన్నారు. అలా డబ్బు తినకపోతే ఇంత కుట్ర జరిగే అవకాశం లేదు. మీరు సంజీవ్ అనే అమాయకుడ్ని వదిలిపెట్టి సందీప్‌ని అరెస్ట్ చేసేవరకూ మేం

ఇక్కడినించి కదలం!" అని మొండికి పడి కూర్చుంది కరుణ. కరుణతోపాటు మిగతా వాళ్లు కూడా ఎస్పీరూంలోనే చతికిలపడి కూర్చున్నారు.

"నేను ఎంక్వయిరీ చేస్తాను. నిందితుల్ని వదిలే ప్రసక్తిలేదు. అమాయకుడని మా ఇంటరాగేషన్‌లో తేలితే వదిలివేస్తాం. మీరు వెళ్ళండి. సందీప్ అనేవాడు నేరం చేస్తే వాడ్ని సాయంత్రంలోపే అరెస్ట్ చేయిస్తాం. ఇక్కడ మీరు ధర్నా చేయాల్సిన పనిలేదు. నేను న్యాయం చేస్తానంటున్నా కదా" అన్నాడు ఎస్పీ.

ఎస్పీ మంచివాడు, ముక్కుసూటిగా వెళ్తాడనే పేరు వుంది.

"మీ మాటమీద విశ్వాసంతో, మీమీద వున్న గౌరవంతో వెళ్తున్నాం సార్. మీరు రేపు ఉదయంలోపు నిందితుడ్ని అరెస్ట్ చేయాలి. అమాయకుడ్ని విడిచిపెట్టాలి. నిందితుడ్ని అరెస్ట్ చేయకపోతే మాత్రం సమస్య తీవ్రమవుతుంది. అసలే విద్యార్థులు కోపోద్రేకంతో ఉడికిపోతున్నారు" అంది కరుణ.

"ఇక మీరు వెళ్ళండి. న్యాయం చేస్తానంటున్నాకదా!" అన్నాడు ఎస్పీ.

"రేపు ఉదయంలోపు అరెస్ట్ చేయకుండా వుంటే, రేపు కాలేజీలు బాయ్‌కాట్ చేసి ప్రదర్శన చేసి ప్రజల అందరి దృష్టికీ విషయం తీసుకుపోతాం సార్. తరువాత పోలీసుల ప్రిస్టేజీ మంట కలిసిందని మీరు బాధపడితే ఉపయోగంలేదు"

పదిమందివరకూ విద్యార్థులు ఎస్పీ హాలులో వున్నారు. అందరికంటే కరుణ ఎక్కువగానూ, నిర్భయంగానూ మాట్లాడింది. ఎస్పీ న్యాయం చేస్తానని హామీ ఇవ్వడంతో అందరూ బయటకి వచ్చారు.

అప్పటివరకూ డిఎస్పీ అటెన్షన్‌లోనే ఎస్పీ ఎదుట. నిలబడివున్నాడు.

"చూశావుకదా, విద్యార్థులు ఎంతటి కోపంతో వున్నారో! ముఖ్యుడ్ని వదిలిపెట్టి వేరేవాడ్ని కేసులో ఇరికించటం ఏమిటీ? "

"అది కాదు సార్..."

"షటప్. ఉద్యోగం చేయదలుచుకోలేదా? రేప్ అండ్ మర్డర్ అంటే ఆషామాషీ కేసు అనుకున్నావా? "

"నా ఎంక్వయిరీలో తేలిన నిందితుడ్ని..."

"మాట్లాడవద్దని చెప్పానా? ఏమిటి నీ ఎంక్వయిరీ? గడ్డి తినడమా నీ ఎంక్వయిరీ! బుద్ధిలేదూ? విద్యార్థులతో తమాషా అనుకుంటున్నావా? వాళ్ళు తలుచుకుంటే బస్సుల్ని తగలబెడతారూ, ప్రభుత్వ ఆస్తుల్ని ధ్వంసం చేస్తారూ! ఇలా జరిగితే గవర్నమెంట్‌కి నెగెటివ్ ఓట్ పడుతుంది. పైఅధికార్లు మనల్ని నిందిస్తారు. మనకే మాట వస్తుంది"

"ఇప్పుడు నన్నేం చేయమంటారు సార్? " గొంతు పెగల్చుకుని అడిగాడు డిఎస్పీ.

"నువ్వు ఏమైనా చెయ్యి. సాయంత్రం లేదా రేపు ఉదయంలోపు నిందితుడ్ని తీసుకువచ్చి లాకప్‌లో వేశావా సరే! రేపు వాడ్ని కోర్టుకి హాజరుపరచాలి. ఇలా జరక్కపోతే నీ బతుకు కుక్కబతుకుకంటే హీనమైపోతుంది. నిన్ను ఎవ్వడూ కాపాడలేడు"

"జడ్జి వాళ్ళకి రిమాండ్ వేశాడుకదా సార్? "

"వేస్తే ఏమవుతుంది? చార్జిషీట్ మార్చేద్దాం. మాకు తప్పుడు ఇన్ఫర్మేషన్ అందిందనీ, దాని ఆధారంతో వీళ్ళలో ఒకతన్ని అరెస్ట్ చేశామనీ, నిజానికి అతనికేం సబంధం లేదనీ, జరిగిన పొరపాటుకి చింతిస్తున్నామనీ మరో చార్జిషీట్ రాసి కోర్టుకి సబ్‌మిట్ చేయి. వాడ్ని వదిలి వాడికి బదులుగా వీడికి రిమాండ్ వేస్తాడు" ఎస్పీ అన్నాడు.

"అలాగే చేస్తాను సార్"

"పిచ్చి పిచ్చి వేషాలు వేయవద్దు. ఇది చిన్నకేసు కాదు. ఎక్కడో మారుమూలన జరిగింది కాదు. ఈ కేసులోనే నువ్వు తిమ్మిని బమ్మీ, బమ్మిని తిమ్మీ చేస్తున్నా





వంటే ఏమనుకోవాలి నిన్ను? అదీ నా ముందు నీ కుప్పిగంతులా? జాగ్రత్తగా మసలుకో, లేకపోతే అడుక్కుతిని పోతావ్!" అంటూ ఎస్పీ నిలబడిన డిఎస్పీని చడామడా తిట్టి వదిలిపెట్టాడు.

డిఎస్పీ ముఖాన నెత్తురు చుక్కలేదు. కందగడ్డయిపోయింది. తిట్లదండకం అయిన తరువాత "గెటవుట్" అంటూ హుంకరించాడు.

ఏడుపు ముఖంతో డిఎస్పీ బయటకు వచ్చాడు.

మొగుడు కొట్టినందుకుగాదు, తోటికోడలు నవ్వినందుకు బాధగా వుందనీ... ఎస్పీ తిట్టినందుకుకంటే, ఎస్పీకి వెళ్లి కంప్లయింట్ చేసి ఉద్యమం నడుపుతామనీ, గూడుపుఠాణి ఏదో జరిగిందనీ, నేరస్తుల వద్ద అధికారులు కొందరు లంచాలు తిన్నారనీ, నిందితుడ్ని అరెస్ట్ చేయాలనీ కోరిన విద్యార్థులమీదే డిఎస్పీకి కోపంగా వుంది.

వీటి అన్నిటికంటే బాధ... చేతికి దొరికాయనుకున్న అరవైవేలు చేజారిపోతున్నాయి. ఆ డబ్బు తిరిగి ఇచ్చుకోక తప్పదు. వేరేవాడు అయితే తనని అడగలేడూ, ఒకవేళ అడిగినా తను ఇవ్వడు. ఇది ఎంఎల్ఏతో కూడుకున్న విషయం. ఎంఎల్ఏ ఇవ్వడమంటే అతను ఇచ్చింది. తిరిగి ఇవ్వకుంటే బాగుండదు.

ముందు వాడ్ని అరెస్ట్‌చేసి... తరువాత స్టూడెంట్స్ విషయం చూడాలి. వాళ్లని వదలకూడదు. వాళ్ళ కారణంగానే ఎస్పీ తనని బండబూతులు తిట్టాడు. లేకపోతే అంత ఘాటుగా తిట్టి వుండేవాడు కాదు.

డిఎస్పీ బుర్రలో సడన్‌గా మెరుపు మెరిసింది. చైర్మన్‌గాడి హాలు ధ్వంసం చేసిన కేసులో వీళ్ళని ఇరికించాలి. అసలు వీళ్ళే ధ్వంసం చేసింది. దొరికారు.

డిఎస్పీకి చాలా ఉత్సాహం కలిగింది. ఎస్పీ తిట్టిన తిట్లన్నీ మరచిపోయాడు.

సందీప్ కోసం ఇన్ఫార్మర్స్‌ని అలర్ట్ చేశాడు. "రేయ్... వాడు ఎక్కడ వున్నా క్షణాలమీద నాకు సమాచారం తెలియచేయాలి. అర్ధరాత్రికైనా వాడ్ని పట్టుకోకపోతే కొంప మునిగిపోతుంది. ఎస్పీగాడు యమ సీరియస్‌గా వున్నాడు" అని కొందర్ని టౌన్‌లోనికీ, ఇద్దర్ని సందీప్ వాళ్ళ వూరికీ పంపించాడు.

సందీప్ వాళ్ళ వూరు వెళ్ళిన ఇన్ఫార్మర్స్ రాత్రి పదిగంటల ప్రాంతంలో డిఎస్పీకి ఫోన్‌చేసి చెప్పారు. "పగలు ఎక్కడ్నో వుంచి ఇప్పుడు ఇంటికి తీసుకొచ్చారు సార్. బాగా హుషారుగా వున్నాడు కుర్రాడు"

వెంటనే డిఎస్పీ జీప్‌లో పోలీసులతో బయల్దేరాడు. అర్ధరాత్రికి సందీప్ వాళ్ళ ఇంటిమీద దాడిచేసి అతన్ని పట్టుకున్నారు.

"అదేమిటి సార్ డిఎస్పీగారూ... మొన్న మాట్లాడుకున్న విషయం ఏమిటీ, ఇంతలోనే మళ్ళీ మీరు రావడం ఏమిటీ? " సందీప్ తండ్రి డిఎస్పీని పక్కకి పిలిచి కన్నీళ్ళతో అడిగాడు.

"ఎస్పీ కోపంగా వున్నారు సార్. నా ఉద్యోగం వూడిపోయే పరిస్థితి. లేకపోతే అంత తేలికగా అరెస్ట్ చేసేవాడ్ని కాదు"

"మరి డబ్బు విషయం"

"రేపు వచ్చి మీ డబ్బు తీసుకొండి. నన్ను అర్థం చేసుకోండి"

"పిల్లవాడ్ని కొట్టడంకానీ, ఏమైనా చేస్తారేమో సార్? "

"అలాగ ఏం జరగదు. పిల్లవాడి వంటి మీద దెబ్బ పడనివ్వను. రేపు ఉదయమే కోర్టుకి హాజరుపరుస్తాము. తప్పనిసరి పరిస్థితిలోనే అరెస్ట్ చేయాల్సివస్తోంది కానీ లేకపోతే అరెస్ట్ చేసేవాళ్ళం కాదు" అని సందీప్‌ని జీపులో ఎక్కించుకుని తీసుకుపోయారు.

శంకరం వూరినించి కరుణ దగ్గరికి వచ్చాడు. కరుణకి ఏవో వస్తువులు కావాల్సి వుంటే వార్డెన్ పర్మిషన్ తీసుకుని ఇరువురూ షాపింగ్‌కి వచ్చారు.

ఒక షాపులోనించి మరో షాపులోనికి వెళ్తుండగా, గోపాల్ తలవంచుకుని కొద్ది దూరంలో వెళ్తూ కనిపించాడు.

"గోపాల్ గారూ... గోపాల్ గారూ..." అని కరుణ పిలిచింది. పిలుపు విని గోపాల్ వచ్చాడు.

"బావున్నారా? ఏమిటి బజారుకి వచ్చారు? " అడిగాడు.

"మా నాన్నగారు..." అని గోపాల్‌కి వాళ్ళ నాన్నని పరిచయం చేసింది. "కొద్దిగా షాపింగ్ పనిమీద వచ్చాం. గోపాల్ అని పీజీ సెంటర్‌లో ఎం.ఏ. చేస్తున్నారు నాన్నా"

గోపాల్ వినయంగా నమస్కరించాడు.

"పేపర్ చూస్తున్నారు కదూ నాన్నా? వారంక్రితం సునంద అని ఒక అమ్మాయిని మా కాలేజీ స్టూడెంట్స్ ముగ్గురూ, మరొ కడూ కలిసి చంపేశారు"

"తెలుసు. చాలా దారుణం అమ్మా"

"కేసులో నేరస్తుల్ని శిక్షించాలని మేం ఫైట్ చేస్తున్నాం నాన్నా. అప్పుడు పరిచ యమయ్యారు ఈ జిల్లా నవయుగ విద్యార్థి సమాఖ్య అధ్యక్షుడు"

"కరుణగారూ... మీ వరకూ విషయం రాలేదనుకుంటాను. మనమీద కేసు పెట్టా లని పోలీసులు ప్రయత్నాలు ప్రారంభిం చారు. బహుశా ఇవ్వాళ పెట్టివుంటారు"

"ఎందుకూ? " ఆశ్చర్యంగా అడిగింది కరుణ.

"మీరేం చేశారూ? మీమీద ఎందుకు కేసు? " శంకరం ఆందోళనగా అడిగాడు.

"పోలీసులకి మనమీద కోపంగా వుంది. ముఖ్యంగా డిఎస్పీ మనమంటే మండిపోతు న్నాడట! రంభ థియేటర్‌ని నష్టపరిచిన కేసులో మనల్ని ముద్దాయిల్ని చేయబోతు న్నారు. ఇవ్వాళో, రేపో మనకి అరెస్ట్ వారెంట్లో, సమన్లో వస్తాయి. మీరు జాగ్ర త్తగా వుండండి. ముందే మానసికంగా ప్రిపేర్ అయితే వాళ్ళు వచ్చి అరెస్ట్ చేసినా భయపడే అవకాశం వుండదు. నేను మీ దగ్గరికి వచ్చి చెపుదామనుకుంటున్నాను. ఇంతలో మీరే కనిపించారు"

"ఇప్పుడు ఎలా? మీ ప్రయత్నం ఏదో చేయకపోతే ఇబ్బందిపడతారుకదా? "

"నాకు తెలిసిన లాయర్‌తో మాట్లాడాను సార్. బెయిల్‌కోసం అప్లయ్ చేద్దామ న్నాడు. మనల్ని వాళ్ళు ఏం చేయకపో యినా కోర్టుల చుట్టూ తిప్పి ఇబ్బంది పెడ తారు"

"మీకు ఈ విషయం ఎలా తెల్సింది? "

గోపాల్ చుట్టూ చూశాడు. తమని ఎవరూ గమనించడంలేదని నిర్ధారణ చేసు కుని చెప్పాడు.

"డిపార్ట్‌మెంట్లో మా క్లోజ్ ఫ్రెండ్ ఒకడు వున్నాడు. వాడు చెప్పాడు. మనం ఎస్పీ వద్దకీ, కలెక్టర్ వద్దకీ తిరిగి నిందితుల్ని అరెస్ట్ చేయాలని గట్టి పట్టుపట్టామని డిఎస్పీ కోపంగా వున్నాడట. సందీప్ అనే వాడు ఈ కేసులో నెంబర్‌వన్ ముద్దాయి. వాణ్ణి కేసులో లేకుండా తప్పిస్తానని వాళ్ళ నాన్న వద్ద పెద్ద మొత్తంలో డబ్బు తీసుకు న్నాడట. మనం ఎస్పీ వద్దకి వెళ్ళడంతో వాడ్ని అరెస్ట్ చేయక తప్పలేదు"

"నాకు తెల్సిన లాయర్ ఒకరు వున్నా రమ్మా. ఆయన వద్దకి పోయి మాట్లాడు దామా? ముందుగానే జాగ్రత్తపడటం మంచిదికదూ!"

"అవసరంలేదు సార్. మాకు తెల్సిన లాయర్ ఫేమస్ క్రిమినల్ లాయరే. మా కేసులు ఫ్రీగా చేస్తాడు. బెయిల్ ప్రయ త్నాలు అన్నీ ఆయనే చేసుకుంటారు. మీరు నిశ్చింతగా వుండండి" గోపాల్ అన్నాడు.

"ఒకవేళ సడెన్‌గా ఇప్పటికిప్పుడు అరెస్ట్ చేస్తే పరిస్థితి ఏమిటి? మేం ఇక్కడ వుండే వాళ్ళం కూడా కాదు. నువ్వు ఒంటరిదానివి. ఆడపిల్లవి. నాకు తెల్సిన లాయర్‌తో మాట్లాడి వస్తే మంచిదమ్మా!"

"మనకి కేసు విషయం ఇంకా పూర్తిగా




తెలియదుకదా నాన్నా? నామీద కేసు పెట్టారో, పెట్టలేదో! అప్పుడు వూరేగింపు ముందుభాగంలో వున్నాను నేను. స్టూడెంట్స్ కొంతమంది హాలుమీదకి పోయినట్లు కూడా నాకు తెలియదు. తరువాత తెల్సింది, హాలుని ధ్వంసం చేసి వచ్చారని. వెళ్లి దాడిచేసింది కూడా ఎంతోమంది లేరు, కొద్దిమందే" అంది కరుణ.

"అమ్మకి తెలిస్తే ఎంత గొడవ చేస్తుందో! వెంటనే పెట్టెబేడా సర్దించుకుని తీసుకురమ్మని పోరు పెడుతుంది"

"అమ్మ ఎంత పోరు పెట్టినా డిగ్రీ కాకుండా ఎలా వస్తాను నాన్నా? "

"మంచిమాట అన్నావమ్మా. నీ లక్ష్యం మీదనే నువ్వు శ్రద్ధ పెట్టాలమ్మా. నువ్వు ఎందుకు ఇక్కడికి వచ్చిందీ? చదువుకోవటానికి. నీ లక్ష్యం అది. దానిమీద నువ్వు కాన్ సెన్ట్రేట్ చెయ్యాలి. మిగతావన్నీ సెకండరీ విషయాలే. ఫస్ట్ నీ గురి నీ చదువు మీదనే!"

"బాగానే చదువుతున్నా నాన్నా! చదువు విషయం నాకు తెల్సుకదా. ఒకరితో చెప్పించుకుంటానా? మొన్నటి ఎగ్జామ్స్‌లో నైంటీటూ పర్సెంట్ మార్క్స్ వచ్చాయి. క్లాస్ ఫస్ట్ వచ్చాను"

"నువ్వు బాగా చదువుతావమ్మా. బాధ్యతగా వుంటావు. నీమీద నాకా నమ్మకం వుంది. అయితే ఇలాంటి సమస్యల్లో ఇరుక్కుంటే చదువుకి ఏమైనా ఆటంకం ఏర్పడుతుందేమోనని సందేహపడుతున్నాను"

"వీలైనంతవరకూ ఆటంకాలు ఏర్పరుచుకోకుండానే చదువుతాను నాన్నా. కానీ కొన్ని మనకి తెలియకుండానే జరిగిపోతుంటాయికదా!"

"మరీ ముఖ్యమైనవి తప్ప కొన్ని విషయాలు చూసీచూడనట్లు పోవాలమ్మా! అన్ని విషయాల్లో జోక్యం చేసుకోకూడదు"

"అన్యాయం జరిగితే నేను చూడలేను నాన్నా. పదిహేనేళ్ల అమ్మాయి. చిన్నపిల్ల. ఇంటర్ ఫస్టియర్ చదువుతోంది. ఎంత దుర్మార్గులు కాకపోతే ఆ అమ్మాయిని రేప్ చేసి నిలువునా హత్య చేస్తారు. ఆ హంతకుల్ని రక్షించాలని మళ్లీ ప్రయత్నాలు!" బాగా కోపంగా, ఆవేశంగా అంది కరుణ.

"బజారులో నిలబడి ఇలా మాట్లాడుకోవడం బాగుండదు. ఆ హోటల్లో కూర్చుందాం రండి. టీ తీసుకుందాం" అని గోపాల్ ముందుకి కదిలాడు.

కరుణ, శంకరం అనుసరించారు.

"టిఫిన్ ఏమైనా తీసుకుంటారా? "

గోపాల్ అడిగాడు.

శంకరం, కరుణ ఇద్దరూ వద్దన్నారు.

"తేలికగా తీసుకోమ్మా కరుణా. ఉదయం ఎప్పుడో తిన్నావు"

"వద్దు నాన్నా. ఆకలి లేదు. నాకు హోటల్లో తినడం కూడా ఇష్టం వుండదు"

గోపాల్, శంకరం చెరొక టీ తీసుకున్నారు.

"అరవైతొమ్మిదిలో నేను శ్రీకాకుళం వెళ్లాలని ట్రై చేశానండీ. ఎందుకో చివరి నిముషంలో మానుకున్నాను. ధైర్యం చాల్లేదు. పైగా చిన్నవాణ్ణి. మా అమ్మా నాన్నకి ఒక్కణ్ణే!" శంకరం చెప్పాడు.

ఆశ్చర్యపోతూ విని అడిగాడు గోపాల్.

"ఇప్పుడు ఎందులో వున్నారు? "

"అంటే ఏ గ్రూపులో అనా? సంసారం గ్రూపులో వున్నాను"

చిన్నగా నవ్వాడు గోపాల్.

శంకరం కూడా నవ్వి అన్నాడు. "వయసు పెరిగేకొద్దీ అన్ని భావాలూ పోయాయి. భార్యా, కుటుంబం, బిడ్డలూ! అంతే. ఉడుకురక్తం అంటారు చూశారూ, ఆ దశవేరు"

"మీ ఆశయాల్ని మీ కుమార్తె సాధిస్తుందండీ" అన్నాడు గోపాల్

"ముందు చదువు పూర్తికావాలి కదా" శంకరం అన్నాడు.

"చాలామంది నాయకుల పిల్లల్ని చూస్తే

ఆశ్చర్యంగా వుంటుందండీ, వాళ్ళు చెప్పే సిద్ధాంతాలు అన్నీ ప్రజలకోసమే కానీ వాళ్ళ పిల్లలకు మాత్రం వర్తించవు. ఆ పిల్లలు చక్కగా చదువుకుని ఏ రష్యాలోనో, అమెరికా, జర్మనీల్లోనో, పెద్ద హోదాతో స్థిరపడి పోవాలి"

"నాతోపాటు అప్పుడు తిరిగిన వారిలో కొందరు. ఇవ్వాళ సాయిబాబా భక్తులయ్యారు. తిరుపతి పోయివస్తున్నారు. ఇక వాళ్ళ రాజకీయాలు చూస్తే, జనంమీద ఏ పార్టీ పెత్తనం చేస్తుంటే ఆ పార్టీ జెండాలు మోసేదశకు చేరుకున్నారు"

"బాగా పతనమైపోయారన్నమాట!"

ముగ్గురూ బయటకు వచ్చారు.

"ధర్మం చేయి బాబూ... నాయనా... అమ్మా..." అంటూ హోటల్ ఎదురుగా నాలుగుచక్రాల చిన్న బండిమీద కూర్చుని అడుక్కుంటున్నాడు ఒకతను. అతనికి రెండుకాళ్ళూ లేవు. రెండు చేతులూ లేవు. కేవలం మొండెం, తల మాత్రమే వున్నాయి.

కరుణ బ్యాగులోనించి పది రూపాయల కాగితంతీసి అతనికి ఎదురుగా వున్న సత్తు గిన్నెలో వేసింది.

వికలాంగుడి ముఖం ఆనందంతో వెలిగి పోయింది. కళ్లు కృతజ్ఞతాపూర్వకంగా మెరిశాయి.

"నూరేళ్లు బతుకు తల్లీ. ఆ దేవుడు నిన్ను చల్లగా చూడాలి తల్లీ. దణ్ణం తల్లీ!" అంటూ వికలాంగుడు నమస్కరిస్తున్నట్లుగా శిరస్సు పూర్తిగా వంచాడు.

కరుణ చేసిన పని శంకరానికి ఏమీ నచ్చలేదు. అడుక్కునేవాళ్లు అడిగితే రూపాయి ఇస్తారు, లేదా రెండు రూపాయలు ఇస్తారు. వెనుకా ముందాలోచించకుండా ఏకంగా పదిరూపాయలు ఇచ్చిందంటే ఏమనుకోవాలి? ఇలాగైతే ముందు ముందు పరిస్థితి ఏమిటి?

"నువ్వు చేసిన పని ఏమీ బాగా లేదమ్మా! చేతికి ఎంత వస్తే అంత ఇవ్వడమేనా?" కొద్దిదూరం వచ్చిన తరువాత శంకరం కోపాన్ని అణుచుకుంటూ అన్నాడు.

"చేతికి రావడం కాదు నాన్నా. నేను చూసే ఇచ్చాను"

"పది రూపాయలు ఇస్తారా ఎవరైనా?"

"అతన్ని చూసి నాకు ఇవ్వాలనిపించింది ఇచ్చాను"

"నువ్వు సంపాదించుకునేటప్పుడు నీ సంపాదన నీ ఇష్టం వచ్చినంత ఇవ్వమ్మా! నేనేం లక్షాధికారిని కాను"

"మీరు టిఫిన్ చేయమన్నారు. చేస్తే పది రూపాయలై వుండేవికద నాన్నా! నేను టిఫిన్ చేశానే అనుకో"

"అలా చాలా అనుకోవచ్చు కరుణా. ఘనకి ఆరోగ్యం బాగులేకపోతే వైద్యానికి పదివేలు కావచ్చు ఆరోగ్యం బాగుందికదా! అనారోగ్యం అయితే వైద్యానికి అయ్యాయిలే అని పదివేలు ఇద్దామా?"

కరుణ బాధపడినట్లు ముభావంగా వుంది. కూతురి మనసు నొచ్చుకుందని శంకరం ఊహించాడు.

"నిన్ను బాధపెట్టాలని నేను అనలేదు కరుణా! నీవు ఒక రూపాయో, రెండు రూపాయిలూ ఇచ్చినట్లయితే నేను చాలా సంతోషించి వుండేవాణ్ని. మనం ఒక్కర్మే కాదు, సమాజంలో అందరం బతకాలి. నేను స్వార్థపరుణ్ని అనుకోవద్దు కరుణా! నీవు పది రూపాయలు ఇవ్వడాన్ని ఎందుకో నేను సహించలేకపోతున్నానమ్మా!"

"నేను డిగ్రీలో చేరిన తరువాత ఈ పది రూపాయలు నా ఖర్చు అనుకో, వ్యర్థం చేశాను అనుకో. నాకు తెలిసి నేను రూపాయి కూడా వేస్ట్‌గా ఖర్చుపెట్టను. మా హాస్టల్ క్యాంటీన్‌లో కూల్‌డ్రింక్స్ అమ్ముతారు. అవి రోజూ తాగేవాళ్లు వున్నారు. అలాగే క్యాంటీన్‌లో ఎగ్‌పఫ్‌లూ, కర్రీపఫ్‌లూ, శ్నాక్సూ, రకరకాల కేక్సూ అమ్ముతుంటారు. అవి కూడా వేలం వెర్రిగా కొను




క్కుని తింటారు. నేను ఒక్కసారి కూడా వాటి రుచి ఎలా వుందో చూడలేదు. పఫ్‌లు అంటే ఏమిటో కూడా నాకు తెలియదు. డబ్బు నేను ఎప్పుడూ వ్యర్థంగా ఖర్చుపెట్టను నాన్నా" బాధపడుతూ అంది కరుణ.

"నువ్వు ఖర్చుపెడతావని కాదమ్మా. నీ విషయం నాకు తెలియదూ? నీవు ఖర్చు పెడితే నేను ఎప్పుడైనా ఏమైనా అన్నానా? "

"కాళ్లూ చేతులూ సక్రమంగా వుండి యాచించే వాళ్లు చాలామంది వున్నారు. ఒకవేళ వాళ్లు యాచించినా వాళ్లకి ఇస్తే రూపాయో, అర్ధకంఠే ఎక్కువ ఇచ్చి వుండే దాన్నికాదు. ఇతను ఏం పని చేయగలడు పాపం? రెండు కాళ్లూ చేతులూ లేవు. పది రూపాయలు ఇచ్చినందువలన మనమేమైనా పేదవాళ్లం అవుతామా? అంత మాత్రం ఇవ్వగలిగిన శక్తి మనకిలేదా? "

"సారీ కరుణా" శంకరం హృదయపూర్వకంగా సారీ చెప్పడంతో కరుణ మామూలు మనిషి అయింది.

"నీకు నెలకి తొమ్మిది వేలు జీతం. ఏం పని చేస్తున్నావని నాన్నా నీకు అంత జీతం? చెప్పు. చాలా అన్యాయం. మనకి ఐదు వేలు సరిపోతాయి. మిగతా నాలుగు వేలూ ఎవరికైనా ఇచ్చేయడమే న్యాయం నాన్నా"

"అలాగే ఇద్దాం కరుణా. ఆలోచించు ఎవరికి ఇస్తే బాగుంటుందో! అమ్మకి ఇద్దామా? "

"ఎంత మంచి మనసు నాన్నా నీది"

"అవునమ్మా కరుణా. దేశంలో చాలా మంది చదువులు లేకుండా వున్నారు. నీకు చదువు ఎందుకు చెప్పు! చాలా అన్యాయం. నీవు కూడా చక్కగా కూలిపనులకి పోవచ్చు కదా!"

"వెళ్తే బాగానే వుంటుంది" అంది కరుణ.

గోపాల్‌తో సహా ముగ్గురూ ఒక్కసారిగా నవ్వుకున్నారు.

"బాగుందండీ మీ వ్యవహారం" అన్నాడు ఇద్దర్నీ కలిపి గోపాల్.

"మా నాన్న నా మీద ఎప్పుడూ పెత్తనం చేయరండీ గోపాల్‌గారూ! ఇరువురం ఫ్రెండ్స్ మాదిరిగానే వుంటాం. అదీ బెస్ట్ ఫ్రెండ్స్‌మీ"

"మరి నేవెళ్లొస్తానండీ. బస్టాండ్ వరకూ వెళ్లి రావాలి" అని గోపాల్ కదిలాడు.

"కేసు విషయం ఏమిటో కనుక్కుని చెప్పండి" అంది కరుణ.

"అలాగే" అంటూ గోపాల్ వెళ్లిపోయాడు.

"నువ్వు కేసు వరకూ పోవడం నాకేం నచ్చలేదమ్మా! నీ ఫ్యూచర్ దెబ్బతింటుంది. ఇవాళ పేపర్‌లో చూశావా! టౌన్‌లో ఒక మ్మాయిని కట్నం కోసం భర్త ఎంత దారుణంగా హింసించాడో. ఆ అమ్మాయితో బలవంతంగా యాసిడ్ తాగించాడట. పాపం ఆ అమ్మాయి హాస్పిటల్లో నరకయాతన కంటే ఘోరమైన యాతన అనుభవిస్తోందట. యాసిడ్ అంటే సామాన్యం కాదుగదమ్మా! శరీరం మీద పడితేనే కాలిపోతుంది. అలాంటిది కడుపులోకి వెళ్తే పేగులన్నీ కొరుక్కుపోయి కడుపులో మంట పెట్టినట్లే! ఆ అమ్మాయి బతికే అవకాశంలేదని డాక్టర్లు చెప్పారు. ఇప్పుడు ప్రాణం వుండీ, ఘోరమైన హింస భరిస్తోంది" అన్నాడు శంకరం బాధగా.

"ఉదయం మా హాస్టల్లో అనుకుంటున్నారు నాన్నా! నాకు వెళ్లి చూడాలని గట్టిగా అనిపించింది కానీ వార్డెన్ బయటకి పంపించదు"

"సమాజంలో చాలా అన్యాయాలూ, అక్రమాలూ, హింసా, కిరాతకాలూ జరిగిపోతున్నాయమ్మా! వాటినన్నిటినీ మనం ఎదుర్కోగలమా? మన శక్తి ఎంతా? "

"మనమేకాదు, ఎవరూ ఒక వ్యక్తిగా ఎదుర్కోలేరు నాన్నా! కానీ మన కళ్లముందు జరిగే, మనకి ప్రత్యక్ష పరిచయమో, ప్రమే

యమో వున్న వ్యక్తుల విషయంలో కూడా పట్టించుకోకపోవడం నేరం అవుతుంది కదా!"

"మనకి సంబంధించిన వాళ్ల విషయంలో తప్పదమ్మా! కానీ అందరి విషయాలూ పట్టించుకోవాలంటే అది కుదరదు కదా! వాటికి ప్రజా సంఘాలు వుంటాయి. ఆ సంఘాలు అలాంటివి చూసుకుంటాయి. నీ ధర్మం చదువుకోవడమే! దానికి నువ్వు న్యాయం చేకూర్చాలి"

"బాధ్యతగానే చదువుకుంటున్నా కదా నాన్నా! నువ్వు మాటిమాటికీ ఎందుకు గుర్తు చేస్తావు? "

"చెపుతున్నానమ్మా!" సంజాయిషీ మాదిరిగా చెప్పాడు శంకరం.

కూతురు చదువు ఎక్కడ ఆపేసి ఉద్యమాలూ, సమస్యలూ, ఆందోళనలూ అంటూ తిరుగుతుందేమో అని తండ్రి మనసు భయం వ్యక్తం చేస్తోంది. అందుకే కూతురికి పదేపదే చదువు విషయం గుర్తు చేస్తున్నాడు.

ఇద్దరూ కలిసి హాస్టల్ వద్దకి వెళ్లారు.

"నాకు తెల్సిన పలుకుబడి కలిగిన మనిషి ఒకరు వున్నారమ్మా. ఆయన దగ్గరకి వెళ్లి కేసు విషయం ఎంక్వయిరీ చేస్తాను. మళ్లీ నిన్ను అరెస్ట్ చేస్తే సమస్య కదమ్మా!"

"అలాగే నాన్నా" అంది కరుణ.

శంకరం తమ యూనియన్ లీడర్ దగ్గరకి వెళ్లాడు. ఆయనకి టౌన్‌లో పలుకుబడి వుంది. ఒక రాజకీయ పార్టీకి నాయకుడు. ఆయనకి విషయం అంతా చెప్పి చివరగా అన్నాడు.

"హాలుని నష్టపరిచిన కేసులో మన అమ్మాయిని పెట్టారో లేదో తెలుసుకోవాలి సార్ మీరూ"

ఆయన ఎస్ఐకి ఫోన్ చేసి అడిగాడు.

"కేసు ఇవ్వాళే ఫైల్ చేశాం సార్. మొత్తం పన్నెండు మంది ముద్దాయిలు. పదిమంది స్టూడెంట్సూ, ఇద్దరు అవుటర్సూ"

"కొద్దిగా వాళ్లపేర్లు చెప్పాలి సార్"

"అది కుదరదండీ. మీకు ఎవరు కావాలో చెప్పండి. వాళ్ల పేరు వుందో లేదో చూసి చెపుతాను" అన్నాడు ఎస్.ఐ.

ఆయన కరుణ పేరు చెప్పాడు.

"లేదు సార్. ఆడవాళ్లు ఎవర్నీ పెట్టలేదు. అందరూ మగవాళ్లే"

శంకరం పెద్ద బరువు దించుకున్నట్లు తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు.

డి.ఎస్పీ కరుణ పేరు పెట్టాలని గట్టిగానే భావించాడు. కరుణ వూరేగింపుకి నాయకత్వం వహించినా హాలువైపు వెళ్లలేదు. తను కేసు పెడితే అది తప్పుడు కేసే అవుతుంది. ఇప్పటికే ఎస్పీతో అనేకసార్లు తిట్లు తిన్నాడు. మళ్లీ మరోసారి ఎక్కడ తిట్లు తినాలి? ఈసారి తిట్లేకాదు, పనిష్మెంట్ కూడా ఇస్తాడు అని డిఎస్పీ భయపడి, కరుణ పేరు రాయలేదు.

మరుసటిరోజు ఉదయమే శంకరం హాస్టల్‌కి వెళ్ళి, కరుణకి విషయం చెప్పి తమ వూరు వచ్చేశాడు.

"అమ్మాయి ఎలా వుంది? ఏం చెప్పింది? " అడిగింది సరస్వతమ్మ.

"బాగుంది. వస్తూ అమ్మని కూడా వెంట తీసుకురాకపోయావా! అని నామీద కోప్పడింది. నిన్ను అడిగినట్లు చెప్పమన్నది"

"ఇద్దరం ఎందుకులే, నువ్వు వెళ్ళి చూసి వచ్చావు కదా! అమ్మాయి కూడా మొన్ననే కదా వచ్చి పోయింది. బుద్ధిగా వుంటోందా, అనవసరమైన విషయాల్లో తలదూరుస్తోందా? "

"ఛ... అదేమీలేదు. చక్కగా చదువుకుంటోంది. మొన్న క్లాసులో ఫస్ట్ వచ్చింది"

"చదువు బాగానే చదువుకుంటుందండీ. అందుకు బాధలేదు. తనకి సంబంధంలేని విషయాల్లో తల దూరుస్తుందనే నా బాధంతా"

"ఇప్పుడు ఏ విషయాలూ పట్టించుకో




కుండా పూర్తిగా చదువు ధ్యాసలోనే పడింది" అన్నాడు శంకరం.



రోజులు జరిగిపోతున్నాయి. కరుణ ఫస్ట్ యర్ పరీక్షలు రాసి సెలవులకి ఇంటికి వచ్చింది.

"ఎలా రాశావమ్మా పరీక్షలు?" అడిగాడు శంకరం.

"బాగా రాశానాన్నా! మా సెక్షన్ ఫస్ట్ నేనే వస్తున్నాను. ఈ ఎగ్జామ్స్‌లో కూడా ఫస్ట్ నేనే రావచ్చనుకుంటున్నాను"

"నీతోపాటు ఇంటర్మీడియట్ చదువుకున్న పార్వతికి మొన్న కొడుకు పుట్టాడు" సరస్వతమ్మ అంది.

"అప్పుడేనా? నిరుడే కదమ్మా పెళ్లయిందీ?"

"బిడ్డ పుట్టడానికి ఎంతకాలం కావాలేమిటే? నిరుడు ఈ రోజుల్లో పెళ్లయిందీ, ఏడాది తిరిగేసరికి బిడ్డని కన్నది"

"వెళ్లి చూసి రావాలి. దాని పోలికే వచ్చిందో, వాళ్లాయన పోలిక వచ్చిందో"

"చూసిరామ్మా! చూసి వస్తే నీకూ కొద్దిగా తెలిసి వస్తుంది"

"తెలిసి వచ్చేదేమిటమ్మా?" అడిగింది కరుణ.

"నీకూ పిల్లల మీద గుబులు మళ్లుతుందేమో! నా మాట విని పెళ్లి చేసుకోమ్మా! ఎందుకీ చదువులూ, చట్టబండలూ! ఎంత చదువుకున్నా రేపు పెళ్లి చేసుకోక తప్పదు కదమ్మా!"

"మొదలుపెట్టావ్, ఇంకా మొదలు పెట్టలేదేమిటా అనుకుంటున్నా! ఈ నెల రోజులూ నన్ను ప్రశాంతంగా బతకనివ్వు తల్లీ, నస పెట్టుకోకుండా" అని కరుణ తల్లి మీద విసుక్కుంటూ కోప్పడింది.

మరుసటి రోజు ఉదయం కరుణ చొక్కా, ప్యాంటూ వేసుకుని తోటపనిలోకి దిగింది.

ఇంటిముందూ, ఇంటివెనుకా చాలా పిచ్చి మొక్కలు మొలిచాయి. అవి అన్నీ పీకివేసింది.

పూల మొక్కలూ, పండ్ల చెట్లు అన్నిటికీ గునపం తీసుకుని పాదులు చేసింది. కొన్ని మొక్కల కొమ్మల్ని కొడవలితో కట్ చేసింది.

తను ఎన్నో రకాల గులాబీల మొక్కలు నాటింది. వాటిని పట్టించుకున్నవాళ్లు లేరు. వాటి అన్నిటికీ మోటార్ స్టార్ట్ చేసి పైప్‌తో నీళ్లు పట్టింది.

వేపచెట్టు కింద పూతా, ఆకులూ రాలిపోయి వుంటే అక్కడ అంతా శుభ్రం చేసింది.

రెండు గంటల ప్రాంతంలో శంకరం సొసైటీ వాళ్ల బ్యాంక్‌నించి ఇంటికి వచ్చాడు.

ఇంటి ముందు ఒక్క పిచ్చి మొక్కలేకుండా శుభ్రంగా వుంది.

"చూశావా సరూ... అమ్మాయి ఇంటి ముందు ఎంత బాగా చేసిందో"

"ఆడపుట్టక పుట్టిన తరువాత అంత మాత్రం కూడా చేయకపోతే ఇంకెందుకూ? దీనికే ఏమిటో పెద్ద మురిసిపోతున్నారు"

"పిల్లలు ఏదైనా ఒక మంచి పని చేసినప్పుడు అభినందిస్తే రెండోసారి కూడా

ఉత్సాహంగా చేయగలుగుతారు. ప్రతి పనికీ పెడసరంగా మాట్లాడితే రేపు వాళ్లూ పెడ సరంగానే తయారవుతారు. వాళ్లకి ఇక ఏ పనీ కూడా చేయబుద్ధికాదు" అన్నాడు శంకరం.

స్నానం చేసి సాయంత్రం నాలుగు గంటలకి పార్వతీవాళ్ల ఇంటికి వెళ్లింది కరుణ.

ఒకటే క్లాస్ అయినా పార్వతి తనకంటే వయసులో చిన్న. అప్పుడే కొడుకు.

కరుణని సంతోషంగా ఆహ్వానించింది పార్వతి.

స్కూల్లోనూ, కాలేజీలోనూ జరిగిన ముచ్చట్లు కొద్దిసేపు చెప్పుకున్నారు. విషయం పార్వతి భర్తమీదకి మళ్లింది. అతని గొప్పదనం, గుణగణాలు, ఆస్తిపాస్తుల గురించి నాన్‌స్టాప్‌గా చెప్పడం మొదలుపెట్టింది. కరుణ విసుగుతో విషయం మళ్లించినా పార్వతి తిరిగి భర్త వద్దకే లాక్కుని వస్తోంది.

"వెళ్తాను పార్వతీ... రాధావాళ్లింటిదాకా వెళ్లొస్తాను" అని బాబుని ముద్దుగా తడిమి బయటపడింది కరుణ.

రాధావాళ్లింటికి వెళ్తుంటే దార్లో వూళ్లో నించి ఇంటికి వెళ్తూ మరియమ్మ కనిపించింది. మరియమ్మ అంటే అగ్నిప్రమాదం జరిగినప్పుడు తను బైటికి తెచ్చిన పిల్లవాడి తల్లి.

"ఎక్కడికమ్మా! వెళ్తున్నావు? " అని ఆప్యాయంగా పలకరించింది. చెప్పింది కరుణ.

"బాబు ఎలా వున్నాడు? " ఆమె వేసిన కుశల ప్రశ్నలు అన్నిటికీ జవాబు చెప్పి కరుణ అడిగింది.

"బాగున్నాడమ్మా! మా ఇంటిదాకా రాకూడదూ ఒక్కసారి? " అడిగింది మరియమ్మ.

"ఈసారి ఎప్పుడైనా వస్తాను" అంది కరుణ.

రాధావాళ్ల ఇంటికి తాళం వేసి వుంది. పక్క ఇంటి వాళ్లని అడిగితే వూరికి వెళ్లారు అని సమాధానం వచ్చింది.

"మా వాడదాకా రామ్మా" నిలబడిన మరియమ్మ మళ్లీ అడిగింది.

కరుణకి ఇంటికి వెళ్లాలనిపించలేదు. అక్కడికి దగ్గరే పాత హరిజనవాడ. అది వూళ్లో భాగమైంది.

"సరే" అని మరియమ్మ వెంట కదిలింది కరుణ.

"అప్పుడు గుడిసెలు తగలబడినవాళ్లకి కొంతమందికి గవర్నమెంటు పక్కా ఇళ్లు కట్టించి పెట్టిందమ్మా. మేం గూడా కట్టిచ్చుకున్నాం. ఇంక మాకు అగ్గిబయంలేదు" అంది మరియమ్మ సంతోషంగా.

మాటల్లోనే వాళ్ల ఇల్లు చేరుకున్నారు. రెండు గదుల ఇల్లు. ఇల్లూ, వరండానే. వేరేగా గదులులేవు. అవి రెండూ చాలా చిన్నవి. ఇంట్లో వంట చేసుకుని తినడం, వరండాలో పడుకోవడం!

కరుణని చూసి పల్లెలోని వాళ్లూ ఇరుగూ పొరుగూ చాలామంది వచ్చారు.

"ఎక్కడ చదువుకుంటున్నావమ్మా! బాగుండావా? " అంటూ అందరూ గుమికూడారు.

"ఆరోజు మీరు చందాలు పోగుచేసి మా బిడ్డలకి కుట్టిచ్చిన గుడ్డలు ఇయ్యాల కూడా తొడుక్కుంటున్నారమ్మా! నిన్ను గూర్చి రోజుకి ఎన్నిసార్లు చెప్పుకుంటామో మా వాడలోనివాళ్లు" అని కొందరు ప్రశంసిస్తూ అభిమాన పూర్వకంగా మాట్లాడారు.

అప్పుడు కరుణ లోపల మంచం మీద కూర్చుని మాట్లాడుతోంది.

"అయిపోయింది. ఇంక ఎక్కువ కాలం వుండదు. ఇయ్యాలో రేపో! పాపం పసిబిడ్డలు. తలుచుకుంటే దిగులు పుట్టిద్ది ఎవురికైనా" అంటున్నాడు వరండాలో ఒకతను.

"ఏం జరిగింది? " కరుణ వాళ్లని అడిగింది.

"మా వాడలో దురదృష్ట జాతకుల కుటుంబం ఒకటి వుందమ్మా! అంతటి దురదృష్టవంతులు లోకంలోనే వుండరు.





ఇప్పుడు మేం చెప్పుకుంటున్న ఆమెకి ముగ్గురు బిడ్డలు. పెనిమిటి లేడు. టీబీ జబ్బుతో వాడు చచ్చిపోయి ఆర్నెల్లయ్యింది. పెళ్లానికీ ఆ జబ్బు వుంది. ఆ జబ్బు ముదిరి ఆమె ఇయ్యాలో రేపో అనేట్టు వుంది. వాళ్లకి ముగ్గురు బిడ్డలు. అయితే ముగ్గురూ అవిటోళ్లే. పెద్దోడికి చిన్నప్పుడే పోలియో వచ్చి కాళ్లు చచ్చుబడిపోయాయి. చిన్నోళ్లిద్దరూ మూగ పిల్లలు. పాపం వాళ్లకి ఏం తెలియదు. ఆ బిడ్డలు ముగ్గురికీ నా అనేవాళ్లు లేరు" చెప్పింది ఒకామె.

"వాళ్ల ఇల్లు ఎక్కడా? "

"ఇక్కడికి దగ్గరేనమ్మా. ఐదారిళ్ల పక్కనే"

"వెళ్లి చూడాలి. ఆమె, బిడ్డలూ ఎలా వున్నారో" అంది కరుణ.

"నువ్వెందుకులేమ్మా!" అన్నారు ఇద్దరు ముగ్గురు.

"చూస్తాను. చూస్తే నష్టం ఏమిటీ? " అని కరుణ లేచింది.

నలుగురు ఆడవాళ్లు వెంటరాగా, చిన్న పూరిగుడిసె వద్దకి చేరుకున్నారు. ఆ గుడిసెలో చిన్న కుక్కి నులకమంచం మీద మంచానికి అతుక్కుపోయినట్లు పడుకుని వుంది ఒకామె. ఆమె బిడ్డలు ముగ్గురూ ఆమె చెంతచేరి మంచం చుట్టూ దిగులుగా కూర్చుని వున్నారు.

"ఊపిరి ఎక్కడో కొటకలాడతంది. ఇంక ఎక్కువ కాలం బతకదు" అన్నారు మంచం పక్కనే వున్న ఒకరు.

కరుణ మనసు చలించిపోయింది. పదేళ్ల లోపు పిల్లలు ముగ్గురూ! ముగ్గురూ అవిటి వాళ్లు.

"మరియమ్మా! రేపు నీవు పనికి వెళ్లక పోతే మా ఇంటివైపు వస్తావా ఒకసారి"

"ఇప్పుడసలు పనులు ఏమున్నయ్యమ్మా. నువ్వు ఏవేళన రమ్మంటే ఆవేళన వస్తా" అంది ఆమె.

"సరే రేపు మధ్యాహ్నంరా" అని కరుణ ఇంటికి వచ్చేసింది.

ఆ పిల్లలు ఎలా జీవిస్తారు? ఆస్తిలేదు. ఆదుకునేవాళ్లులేరు. అన్ని అవయవాలూ లేవు అని కరుణ చాలా విచారపడింది. మనసంతా భారమైంది.

మరుసటి రోజు మరియమ్మ కోసం ఎదురు చూస్తూ కరుణ ఇంటి వద్దే కూర్చుంది. శంకరం కూడా ఇంటి దగ్గరే వున్నాడు.

మరియమ్మ వస్తే ఇప్పుడు ఇంట్లో ఒక రణరంగం జరుగుతుంది. తను ఇంటికి రమ్మని పొరపాటు పని చేశానా అని మథనపడింది కరుణ. మరియమ్మ రాకముందే ఇంట్లో విషయం చెప్పటం మంచిదని నిశ్చయించుకుంది. ముందు నాన్నకే చెప్పాలి.

"నాన్నా! నేను ఒక పని చేయాలనుకుంటున్నా"

"ఏమిటమ్మా? "

"అప్పుడు నాకు అవార్డు డబ్బు ఐదు వేలు వచ్చాయి చూడు. అవి బ్యాంక్‌లో అప్పటినుంచి అలాగే వున్నాయి. వాటిని ఇవ్వాళ సద్వినియోగం చేయాలనుకుంటున్నాను"

"ఏం చేస్తావు ఏమిటి? " అన్నాడు శంకరం కొంత ఆందోళనగా.

"పల్లెలో పిల్లలు ముగ్గురు వికలాంగులు వున్నారు నాన్నా! ఆ ముగ్గురికీ అయిన వాళ్లులేరు. అనాథలయ్యారు. పైగా వికలాంగులు. ఈ డబ్బు వాళ్ల పేరుతో బ్యాంక్‌లో వేద్దామనుకుంటున్నాను"

"వేయి మరి. ఇంక నన్ను అడిగేది ఎందుకూ? " అన్నాడు శంకరం కోపంగా, నిరసనగా.

"అది కాదు నాన్నా, నీకు చెప్పి చేద్దామని నా ఉద్దేశం. నీ సలహా ఏమిటి? "

"నా సలహాతో నీకు పనేమిటమ్మా! ఎవరి సలహా లేకుండా నువ్వే నిర్ణయించుకున్నావు కదా. నిర్ణయించుకున్న తరువాత సలహా ఎందుకు ఇంకా? "

పొయ్యిమీద నించి కూరగిన్నె దించి

వేగంగా బయటకి వచ్చింది సరస్వతమ్మ. "నీకు పోయేకాలం ఏమైనా వచ్చిందేమిటే? చూస్తూ చూస్తూ అంత డబ్బు ఎవరికో ముష్టివాళ్లకి ఇస్తావా? దేశంలో ఎక్కడైనా ఇంత విడ్డూరం వుందా? "

కరుణ అమ్మవైపు చూడదలచుకోలేదు. ఆమెతో ఈ విషయం మాట్లాడకూడదు.

"పెద్ద పెద్ద నాయకులు కూడా వాళ్ల స్వంత డబ్బు ఇవ్వరే! ఇంత చిన్న పిల్లకి అంత పెద్ద ఆలోచనేమిటే? ఎవరైనా వింటే నవ్వుతారు" అంది ఆమె.

"నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో" అని శంకరం లేచి లోపలకి వెళ్లిపోయాడు విసురుగా.

"ఇప్పుడే ఇది మన మాట విని చావడం లేదు. ఇంక పెద్దయితే మనల్ని లెక్క చేస్తుందీ! చదువు వద్దండీ, ఇది అందరి లాంటిది కాదూ పెళ్లి చేద్దామండీ అంటే నా మాట ఆలకించారా? ఇది గొప్ప ప్రజా సేవకురాలు అని తెలిస్తే అసలు సంబంధాలు వస్తాయంటండీ" సరస్వతమ్మ శంకరాన్ని సాధిస్తూ కరుణని తిట్టడం మొదలు పెట్టింది.

లోపలికి వెళ్లిన శంకరం కూతురి ఆలోచనా ధోరణికి ఒకవైపు విస్మయం చెందుతూనే మరోవైపు భయపడిపోతున్నాడు. ఏమిటీ ఇంత సున్నితంగా, సెన్సిటివ్‌గా, డెలికేట్‌గా తయారవుతోంది కరుణ? ముందు ముందు ఈ ఆలోచనలు ఎక్కడికి చేరుకుంటాయి? ఇలాంటి ఉదార ప్రవర్తన మంచికా, చెడుకా? ఇప్పుడే వేలు వేలు దానాలు చేస్తానంటున్న మనిషి భవిష్యత్‌లో చేతిలో ఎంత ఉంటే అంత ఇవ్వడానికి సిద్ధపడదా? అమాయకంగా ఆస్తి మొత్తం హరించి వేసుకుంటే పరిస్థితి ఏమిటి? భర్తవస్తే, ఇలాంటి ఆర్థిక గొడవలతోనే కాపురం చిన్నాభిన్నమైపోదూ?

కరుణకి అవార్డుగా వచ్చిన డబ్బు హరిజనుల కోసమే ఖర్చు చేస్తానని మొదట్లోనే స్పష్టంగా చెప్పింది. తాము డబ్బు కోసం ఆశపడకపోగా కరుణ నిర్ణయానికి మానసికంగా కూడా సిద్ధమయ్యారు.

చాలామంది దానాలు చేసేవాళ్లున్నారు. చందాలు ఇచ్చేవాళ్లున్నారు. రూపాయి ఖర్చుపెట్టి రెండు రూపాయల పబ్లిసిటీని ఆశిస్తారు వాళ్లు. అలా చేసినా తమకి ఒక రకంగా సంతోషమే! ఏదైనా శాశ్వతంగా ఉపయోగపడే వాటికి ఆ డబ్బు వెచ్చించినా తమకి ఇంత బాధ వుండేదికాదు. ఊరూ పేరూ లేని వాళ్లకీ, దిక్కూ దిశాలేని దరిద్రులకీ ఇస్తే ఏమొస్తుంది? డబ్బుకి డబ్బు పోయీ, కనీసం పేరు కూడా రాకుండా ఏం ప్రయోజనం?

అంతలో మరియమ్మ వచ్చింది. బయటే సరస్వతమ్మ కూర్చుని వుంది.

ఏదో ఒక మాట అంటుందని తల్లి ఎదురుగా కూర్చోవడం ఇష్టంలేక కరుణ ఇంట్లోకి వెళ్లింది.

"అమ్మాయిగోరు ఉన్నారా అమ్మా? "

"అమ్మాయిగారు ఎవరూ? "

"కరుణమ్మగోరు"

"ఏం పని దానితో నీకు? "

"నిన్న ఇంటికి రమ్మని చెప్పింది అమ్మగారూ"

"ఎక్కడ కనపడింది నీకు చెప్పడానికి!"

"అమ్మాయి మా వాడలోకి వచ్చింది అమ్మగారూ!" భయపడుతూనే చెప్పింది మరియమ్మ.

"కరుణా ఇటూ" అని కఠినంగా పిల్చింది సరస్వతమ్మ. లోపలనించి వచ్చింది కరుణ.

"నిన్న నువ్వు హరిజనవాడకి వెళ్లావా? "

"రాధా వాళ్లింటికి వెళ్లాను. రాధ లేదు. ఈమె అక్కడ వుండి ఇంటికి రమ్మని అడిగితే వెళ్లాను"

"రమ్మంటే వెళ్లడమేనా? హరిజనవాడతో నీకేం పనే? పెళ్లి కావాల్సిన ముండవి! బజార్లవెంట తిరగటం ఏమిటీ?




అవసరమైతే పోవచ్చు. నీకు ఏం అవసరం వచ్చి వాడలోకి వెళ్ళావే? "

"నేనే రమ్మన్నాను అమ్మగారూ! నా బిడ్డకి జన్మ ఇచ్చింది. అమ్మాయిగారు లేక పోతే నా బిడ్డ నాకు దక్కేవాడు కాదు. నేను రమ్మంటే వచ్చిందమ్మా" అంది మరి యమ్మ వినయంగా.

"ఊళ్ళో ఇంతమంది ఆడపిల్లలు వున్నారు. ఇలా నీ మాదిరిగా వున్నవాళ్ళు ఎవరైనా ఉన్నారా? ఎందుకే నువ్విలా మమ్మల్ని బాధపెడతావు? పెద్దవాళ్ళు చేప్పేమాట అంటే నీకు గౌరవం కొద్దిగా అయినా వుందీ? "

"ఇప్పుడు ఏమైందీ? " అంది కరుణ కోపంగా.

"కరుణా... ఇలా రామ్మా" అని శంకరం కరుణని లోనికి పిల్చాడు. వెళ్లింది కరుణ.

"ఇలా వ్యక్తులకి డబ్బు ఇస్తే ఉపయోగం వుండదమ్మా! వాళ్ళు తాగి తందనాలాడి వృధా చేస్తారు"

"వీళ్ళు పిల్లలు నాన్నా"

"అయినా ఇలా వ్యక్తులకి ఇవ్వడం మంచిదికాదమ్మా! తెల్సిన వాళ్ళు ఎవరూ ఇలా ఇవ్వరు. చర్చికో, వాళ్ళ కమ్యూనిటీ హాలు నిర్మాణానికో విరాళంగా ఇవ్వు. నీ పేరుతో ఫలకం వేస్తారు. వాడలో అందరూ నీ గురించి చెప్పుకుంటారు"

"గుళ్లూ గోపురాలూ, రాళ్లూ రప్పలకి ఇవ్వడం ఇష్టంలేదునాన్నా! పేదవాళ్లూ, అంగవికలురూ, వాళ్లని ఆదుకునేవాళ్లు లేరు, వాళ్లకి ఇస్తేనే వుపయోగంగా వుంటుందని నా వుద్దేశం. దయచేసి నన్ను మాత్రం బాధపెట్టొద్దు" అంది కరుణ.

"చావ్వే! నువ్వు ఎలా చస్తే మాదేం పోయిందీ? మా మాట విననప్పుడు మా ఇంట్లో మాత్రం ఎందుకూ నువ్వు? ఇక్క ణ్ణించి వెళ్లిపో" అంది సరస్వతమ్మ కోపంగా.

"ఇంక మాట్లాడకు. తన ఇష్టం వచ్చి నట్లు చేసుకోనివ్వు. చిన్న పిల్ల అయితే ఒక దెబ్బవేసి నచ్చచెప్పవచ్చు. మన అంత అయిన దానికి మనమేం చెపుతాం? మంచి చెడ్డలేవో నిర్ణయించుకునే వయసు వచ్చిందికదా" అన్నాడు శంకరం.

ఇంట్లోనించి వెళ్లమంటే కరుణ నిజం గానే ఇంట్లోనించి వెళ్లిపోతుంది. అలాంటి పట్టుదల కలిగిన అమ్మాయి. తెగేవరకూ లాగకూడదు.

డేర్ టు హెల్ప్, డేర్ టు థింక్, డేర్ టు టాక్, డేర్ టు ఫైట్ అని కరుణ చాలాసార్లు మాట్లాడే విషయం గుర్తొ చ్చింది శంకరానికి. సరస్వతమ్మ కోపాన్ని తగ్గించే ప్రయత్నం చేశాడు.

కరుణ ఏమీ మాట్లాడకుండా పాస్‌బుక్ అందుకుని మరియమ్మని వెంటపెట్టుకుని బ్యాంక్ వద్దకి వెళ్లింది. బ్యాంక్‌లో అప్పుడు ఇచ్చిన ఐదువేలు చెక్‌కి, ఈ రెండున్నర సంవత్సరాల వ్యవధికి 950 రూపాయల వడ్డీ వచ్చింది. తన దగ్గరవున్న డబ్బు 50 రూపాయలు వేసి ఒక్కొక్కరికి 2 వేలు చొప్పున ముగ్గురి పేరుతో బ్యాంక్‌లో మూడు డిపాజిట్లు చేసింది. అసలు అలాగే వుంటుంది, వడ్డీ మూడు నెలలకి ఒకసారి వాళ్లకి ఇచ్చే ఏర్పాటు చేయిం చింది.

"ఇవిగో మరియమ్మా! ఈ సర్టిఫికేట్లు ఆ పిల్లలకి ఇవ్వు. వాళ్లకి మూడు నెలలకి ఒక సారి ఒక్కొక్కరికి 90 రూపాయలు బ్యాంక్ వాళ్లు వడ్డీ ఇస్తారు. అసలు మాత్రం పది సంవత్సరాల వరకూ ఇవ్వరు"

"మీలాంటి వాళ్లని నేను ఎక్కడా చూడ లేదమ్మా! వెన్నపూసకంటే మెత్తటి మన సమ్మా మీది! ఇంట్లో మీ అమ్మా నాన్న కోప్పడుతున్నా ఇంత డబ్బు ఆ పిల్లలకి ఇస్తున్నారంటే నాకు మాటలే రావడంలే దమ్మా" అంటూ మరియమ్మ ఆశ్చర్యానం దాలతో ఆ కాగితాలు అందుకుని కరుణ

వైపు కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ వెళ్లి పోయింది.



ఇంట్లో ప్రచ్ఛన్నయుద్ధం నడుస్తోంది. కరుణతో ఎవరూ మాట్లాడటంలేదు. అమ్మా నాన్న ఇద్దరూ కరుణతో మాట్లాడటం పూర్తిగా మానేశారు.

తమ్ముడు వున్నాడంటే వాడికి క్రికెట్, సినిమాలు తప్ప మరో జ్ఞానంలేదు. వాడికి చదువు కూడా పెద్దగా రాదు. వేళకి వస్తాడూ, అన్నం తింటాడూ ఎక్కడికో వెళ్లి పోతాడు. వాడికి చదువు రాకపోవటంతో వాడ్ని గురించి ఇంట్లో కూడా ఎవరూ పెద్దగా పట్టించుకోరు. ఇద్దరు ఆడపిల్లల తరువాత మగపిల్లవాడు కావడంతో సరస్వతమ్మ గారాబం వాడికి ఎక్కువ. ఆ గారాబంవలన వాడికి చదువు సంధ్యలు లేకుండాపోయాయని శంకరం అంటాడు.

కరుణ డిగ్రీ సెకండ్ ఇయర్ బుక్స్ ఇంటివద్దనే చదువుకుంటోంది. చదువు, ఇంట్లో కొంతపని, తోటపని తప్ప ఇంట్లో నించి ఎక్కడికీ వెళ్ళడంలేదు.

సెలవుల అనంతరం కాలేజీలు తెరిచారు. ఎవరికి వాళ్ళే మౌనంగా వున్నారు. ఒక రోజు చూసి కరుణ అడిగింది.

"కాలేజీలు తెరిచారు నాన్నా నేను రేపు వెళ్తాను"

"ఏ విషయాల్లో కూడా నువ్వు తలదూర్చనంటే కాలేజీకి పంపిస్తాం కరుణా! అంతే కానీ అందరి సమస్యలూ పట్టించుకుంటానంటే మాత్రం కాలేజీకి వెళ్ళడం కుదరదు"

"అదేమిటి నాన్నా అలా అంటున్నావు? స్టూడెంట్స్‌కి సంబంధించిన విషయాలు పట్టించుకోకుండా ఎలా కుదురుతుంది? మా సమస్యల్ని మేం పట్టించుకోవద్దా? నేనేం చదువుకోవడం లేదా? "

"నువ్వు చదువుకుంటున్నావు. కాదనడం లేదు. స్టూడెంట్స్‌కి అనేక సమస్యలు వస్తుంటాయి. అవి అన్నీ పట్టించుకుని నేను పరిష్కరిస్తానంటే ఎలా కుదురుతుంది? నీ చదువు దెబ్బతినదూ? "

"సరే, మీ ఇష్టం నాన్నా! నన్ను కాలేజీకి పంపిస్తే పంపించండి, లేకపోతే మానిపించండి. అంతకంటే నేను చేయగలిగేదేముంది? "

"నేను ఏ సమస్యనీ పట్టించుకోనూ, చదువుమీదనే కాన్‌సెన్‌ట్రేట్ చేస్తానని చెప్పు. ఇవ్వాళే తీసుకుపోయి కాలేజీ దగ్గర వదిలిపెట్టి వస్తా"

"స్టూడెంట్స్‌కి అనేక ప్రాబ్లమ్స్ వస్తుంటాయి. ప్రాబ్లమ్స్ సాల్వ్ చేసుకోవడానికి స్ట్రయిక్స్ చేయాల్సివుంటుంది. అవసరమైతే కాలేజీ మేనేజ్‌మెంట్‌తోనూ, గవర్నమెంట్‌తోనూ కొట్లాడాల్సి వుంటుంది. అవి చేయొద్దంటే ఎలా కుదురుతుంది? "

"అది అంత గట్టిగా నేను తిరిగేది తిరిగేదే అని తేల్చిచెపుతుంటే ఇంకా దాన్ని బతిమాలుతారేమండీ? అసలు దానికి అన్ని కాళ్లు వచ్చింది మీ వల్లనే అనుకోండి. ఇప్పటికైనా దాన్ని చదువు మానిపించడమే నయం. ఇంకొంతకాలం ఆగితే ఇది మనకి అలివి కూడా కాదు" అంది సరస్వతమ్మ.

తండ్రి ధోరణికీ, స్వభావానికీ కరుణకి మనసు చాలా కష్టం వేసింది. మెత్తగానే

మాట్లాడుతూ తన కాళ్ళకి బంధాలు వేయాలని చూస్తున్నాడు. ఒక్క చదువు తప్ప ఇతర విషయాల్లో జోక్యం చేసుకోవద్దని ప్రత్యక్షంగానే చెబుతున్నాడు. ఇంతకు ముందు చెప్పిన కబుర్లు అన్నీ ఎటుపోయాయి? ఈయన శ్రీకాకుళం వెళ్ళాలనుకున్నాడట. వెళ్ళి ఏంచేయడానికో!

"సరే కరుణా... స్టూడెంట్స్ ప్రాబ్లమ్స్ తప్పవనుకో. టౌన్‌లో అనేక గొడవలు జరుగుతుంటాయి. వాటిలో జోక్యం చేసుకోకూడదు. ఆడపిల్లల్ని వేధించడం దగ్గర్నించీ ఆడబిడ్డల హత్యల వరకూ ఎన్ని ఘోరాలు జరగడంలేదూ! ఇలాంటివి అన్నీ పట్టించుకుంటానంటే ఎలా అమ్మా? "

"అవి అన్నీ పట్టించుకోవడం ఎలా కుదురుతుంది? అవి పట్టించుకుంటాను అని నేను చెప్పానా? "

"సరే బట్టలూ, బుక్సూ అన్నీ సర్దుకో. రేపు ఉదయమే వెళ్దాం" అన్నాడు శంకరం.

"కొద్దిగా అయినా బుద్ధి లేకపోతేసరి. అది అంత గట్టిగా మాట్లాడుతుంటే తీసుకుపోయి వదిలిపెట్టి వస్తారట. ఎందుకూ దానికి చదువు? " అని సరస్వతమ్మ భర్త మీద తిట్లకి లేచింది.

శంకరానికేమో కూతుర్ని బాగా చదివించాలని గట్టి కోరిక. ఉద్యమాల్లోనికి వెళ్ళి కరుణ చదువుకి ఎక్కడ భంగం కలిగించుకుంటుందో అనే భయంతో హెచ్చరించి పంపించాలని ప్రయత్నించాడు. అందుకే కాలేజీకి పంపించనని బెదిరించాడు.

కరుణ మొండిమనిషి. తన బెదిరింపులకి ఏమీ లొంగకపోగా స్టూడెంట్స్ ప్రాబ్లమ్స్ మీద ఫైట్ చేయడంలో వెనుకంజ వేసే ప్రసక్తి లేదని స్పష్టంగా తేల్చిచెప్పింది. తెగే వరకూ లాగకూడదు. తను అనుకున్న వ్యూహం బెడిసికొట్టింది.

కరుణ నిజాయితీని శంకించాల్సిన పని లేదు. తాను ఏ విషయమూ పట్టించుకోను అని చెప్పి, కాలేజీకి వెళ్ళిన తరువాత పట్టించుకుంటే చేసేదేముంది? అయినా తను అలా అబద్ధం చెప్పదు. ఏ విషయమూ దాచిపెట్టదు.

చదువు మానుకోవడానికి అయినా కరుణ సిద్ధపడింది కానీ తన బెదిరింపుకి ఏమాత్రం లొంగలేదు. తను మళ్ళీ అడిగితే కరుణ ఇంకా గట్టిగా తను చేయదలుచుకున్న విషయం చెబుతుంది. అప్పుడు సరస్వతమ్మకి అవకాశం దొరుకుతుంది. ఇప్పటికే ఏదో ఒక మిషతో చదువు మాన్పించాలని ప్రయత్నిస్తున్న వ్యక్తికి ఇంకా గట్టిగా మాట్లాడే అవకాశం కల్పించినట్లవుతుంది. అందుకే శంకరం మాట మార్చాడు.

"పొద్దున్నే ఫస్ట్ బస్‌కి వెళ్ళిపోదాం కరుణా" అని కూతురికి చెప్పి శంకరం బయటికి వెళ్ళిపోయాడు.

★ ★ ★

మరుసటిరోజు ఉదయమే కరుణని తీసుకుపోయి హాస్టల్లో విడిచిపెట్టివచ్చాడు శంకరం.

కరుణ చదువుమీదనే మనసు పెట్టింది.

కొద్దిరోజులకి మొదటి సంవత్సరం ఫలితాలు వచ్చాయి. కరుణ కాలేజీ ఫస్ట్ వచ్చింది. అన్ని సబ్జెక్టుల్లో కూడా 90 శాతం మార్కులు తగ్గకుండా వచ్చాయి.

ఫస్ట్ వచ్చిన కరుణని ప్రిన్సిపాల్, లెక్చరర్లు అభినందించారు. అనుకున్నదానికంటే కరుణకి మార్కులు ఎక్కువే వచ్చాయి. ఇంటికి ఫోన్‌చేసి కాలేజీ ఫస్ట్ వచ్చిన విషయం, తనకిచ్చిన మార్కులూ చెప్పింది కరుణ.

"నాకు తెల్సమ్మా, నువ్వు బాగా చదువుతావనీ..."

"ఇందులో అంత ప్రతిభ ఏముందిలే నాన్నా? మెరిట్ స్టూడెంట్స్ అందరూ ఎంసెట్ రాసి ప్రొఫెషనల్ కోర్సెస్‌లో చేరిపోయారు. దాదాపు మెరిట్ లేనివాళ్ళే ఇలాంటి డిగ్రీల్లో చేరేది"

# ఏరిన ముత్యాలు

★ అహంకారం తగ్గి వినయ విధేయతలు పెరిగినప్పుడు కీర్తిప్రతిష్టలు వ్యాప్తి పొందుతాయి.

–జాన్.ఎఫ్. కెన్నెడి

★ ప్రలోభాలకు లోనై ఏకాగ్రతను పోగొట్టుకుంటే లక్ష్యాన్ని సాధించలేరు.

–వివేకానంద

★ సంఘంలో కాలాన్ని బట్టి, కార్యాలను బట్టి గౌరవం, అగౌరవం ప్రాప్తిస్తుంటాయి.

–అరిస్టాటిల్

★ అహింస హింసకన్నా గొప్పది. క్షమించడం శిక్షించడం కన్నా మేలైనది.

–గాంధీ

★ అసమానత్వంవల్ల విప్లవం వృద్ధిచెందుతుంది.

–కార్లయిల్

★ మనం సంతోషంగా జీవిస్తూ, ఎదుటివారిని సంతోషపెట్టడమే ఉత్తమ జీవిత లక్ష్యం.

–ప్రేమ్‌చంద్

★ సత్యము చెప్పుము కాని రహస్యము వెల్లడించకు.

–యాజ్ఞవల్క్యుడు

★ తన సిద్ధాంతాలపై నిలబడ్డవాడే అతిబలవంతుడు.

–లాల్‌బహదూర్‌శాస్త్రి

★ పొదుపు చేయవలసినచోట ఖర్చు చేయకు, ఖర్చు చేయవలసినచోట పొదుపు చేయకు.

–గాంధీజీ

★ విమర్శలన్నింటిలో ఉత్తమమైనది ఆత్మవిమర్శ.

–డా. అంబేద్కర్

★ మనుషుల మందను తోలడం సులభమేకాని, ఆ మందకు నాయకత్వం వహించడం కష్టం.

–ఠాగూర్

★ ఇది తప్పు అని అంతరాత్మ ప్రబోధించినప్పుడు ఆ పని చేయకుండా వుండాలి.

–సత్యసాయిబాబా

★ మనం చేసేపనులవలన పొందే మిత్రులకంటే మన మాటలు శత్రువుల సంఖ్యను పెంచుతుంది.

–గాంధీజీ

★ ఒక హద్దును దాటిన సహనం సుగుణం అనిపించుకోదు.

–అరవిందుడు

సేకరణ: పి.వి.రమణకుమార్

"నువ్వు మాత్రం రాస్తే నీకు ఎంసెట్ రాకపోయిందా? అమ్మ బజారుకెళ్ళింది. వస్తే అమ్మకి చెపుతా. మీ అమ్మ ఎంత సంతోషపడుతుందో, నువ్వు ఇలా కాలేజీ ఫస్ట్ వచ్చావని తెల్సి" అన్నాడు శంకరం సంతోషంగా.



యూనివర్సిటీ పరిధిలోని పెద్ద కాలేజీలూ, ఫేమస్ కాలేజీలూ అని చెప్పుకునే వాటిలో ఈ కాలేజీ ఒకటి. ఫస్టియర్ డిస్టింక్షన్ ఇవ్వరు కాబట్టి తెలియదుకానీ, ఈ కాలేజీలో ఫస్ట్ రావడం అంటే యూనివర్సిటీలో కూడా మొదటి రెండు మూడు స్థానాల్లో తను వుండే వుంటుంది. ఏమైనా డిగ్రీ ఫైనల్ నాటికి తను యూనివర్సిటీ ఫస్ట్ రావాలని నిశ్చయించుకుంది కరుణ.

అందరూ అభినందించారు కానీ ఒకే ఒక వ్యక్తి, తను అమితంగా అభిమానించే వ్యక్తి అభినందనలు కరుణ అందుకోలేకపోయింది. ఆమె లెక్చరర్ సౌమ్య.

రిజల్ట్సు వచ్చిన తరువాత ఆమె కాలేజీకి రాలేదు.

"ఆబ్సెంట్ అంటే ఏమిటో ఎరుగని సౌమ్య మేడం కాలేజీకి రాకపోవడం ఏమిటి? ఏమైవుంటుందీ? సాయంత్రం వాళ్ళ ఇంటికి వెళ్ళి మాట్లాడి వద్దాం" అంది కరుణ క్లాస్‌మేట్స్ అయిన స్నేహితురాళ్ళతో.

సాయంత్రం స్నేహితురాళ్ళు విజయ, ప్రత్యూష, కరుణ ముగ్గురూ సౌమ్య మేడం వాళ్ళింటికి వెళ్ళారు. కాలింగ్‌బెల్ నొక్కడంతో యాభైఏళ్ల ఒకావిడ వచ్చి తలుపుతీసింది.

"సౌమ్య మేడంగారు వున్నారాండీ? " వినయంగా అడిగింది విజయ.

"ఏంమేడం ఏట్లో మేడం. లేదు" అంది ఆమె కొట్టినట్లుగా.

ఆమె ధోరణికి వీళ్ళు విస్తుపోయారు. నెమ్మదిగా అడిగారు "ఎక్కడికి వెళ్ళిందో కొద్దిగా చెపుతారా? "

"ఎక్కడికి చచ్చిందో ఎవడికి తెల్సు? ఆ చచ్చేదేదో మాకేమైనా చెప్పి చచ్చిందా? దరిద్రపు మేళం మాకు తగలడింది. ఆ మాయదారి దేవుడు మా పాలిట పడేశాడు!"

ఆమె తిట్లు వినలేక వీళ్ళు కోపంగా వెనుదిరిగారు. ఆమెని అక్కడే ముఖం పగిలేలా కొట్టాలనిపించింది.

వీళ్ళు నాలుగు అడుగులు వేసిన తరువాత ఆమె వెనక్కి పిలిచింది "ఇదిగో అమ్మాయ్... మిమ్మల్నే మాట"

"ఏమిటీ? " వెనక్కి వచ్చి అడిగారు వీళ్ళు.

"ఎందుకు మీకు మీమేడం...? ఏం పనేమిటి ఆవిడగారితో? " వెటకారంగా అడిగింది.

"మీకు చెప్పాలా? "

"చెప్పాలా అంటే... దాని అత్తని నేను. దానికోసం మీరు ఎందుకు వచ్చారో తెల్సుకోవాల్సిన హక్కు నాకు వుంది. ఎందుకు వచ్చినట్లూ? "

"మాకు పని లేక, నీతో మా మేడంగార్ని తిట్టిద్దామనీ..."

"అలాగే వుంది చూడబోతే..."

మా మేడంగారికి మంచి అత్త దొరి

కింది!"

"ఏం? ఏమైంది నాకు? "

"అవును మీకు ఏం? కన్ను వంకరా, కాలు వంకరా ఏంలేవు. బుద్ధి మాత్రమే వంకర" ప్రత్యూష అంది.

"నీలాంటి అత్తని ఇంట్లోనించి తన్ని తరిమెయ్యకుండా భర్తతో కాపురం చేస్తున్నందుకు మేడం గూర్చి చెప్పుకోవాలి. ఎంత గొప్పదో!"

"తరిమెయ్యడానికి అది ఎవుత్తే, మీరెవరు? ఈ ఇల్లు నేను కట్టించుకున్న ఇల్లు"

"డబ్బు వుంది కాబట్టి ఇల్లు అయితే కట్టించుకోగలిగావ్! నువ్వు ఇరవై నాలుగు జన్మలు ఎత్తినా మేడంలాంటి కోడల్ని తీసుకురాగలవా? అలాంటి మంచికోడలు నీలాంటి చుప్పనాతి అత్తకి దొరికినందుకు అనుకోవాలి! నిన్ను ఎక్కడో అడవులనించి పట్టుకొచ్చిన రకంలా వుంది!"

"ఏమిటమ్మా ఎవరితో మాట్లాడుతున్నావు? " అంటూ నిద్రలేచి కళ్ళు నులుపుకుంటూ బయటకు వచ్చింది ఒకావిడ. అంటే ఆవిడ కూతురు కాబోలు!

"ఎక్కడ్నించి వచ్చారో వీళ్ళు, మేడం కావాలంటూ లోపలకి వచ్చి నన్ను నానా మాటలూ అంటున్నారమ్మా! నన్ను తిట్టిరమ్మని ఆ దొంగముండే పంపించివుంటుంది! ముందు మీరు నా ఇంట్లోంచి బైటికి పొండి. ఎక్కడి వాళ్ళే మీరూ? "

"ఏమండోయ్, కొద్దిగా మాటలు మర్యాదగా రానివ్వండి. మీరు వుండమన్నా మేం ఇక్కడ వుండం! ఎలా అంటే అలా మాట్లాడితే ఎవరైనా పళ్ళు రాలగొడతారు. కొద్దిగా జాగ్రత్తగా మాట్లాడటం నేర్చుకోండి" అంది ప్రత్యూష.

"ఏమిటి మీరు పెద్దా చిన్నా లేకుండా మాట్లాడుతున్నారు! మా ఇంటికి వచ్చి మమ్మల్ని దబాయిస్తున్నారేమిటి? మిమ్మల్ని ఆ మహాతల్లి పంపించిందా? మీరు కాలేజీ స్టూడెంట్స్ అయితే ఇక్కడ మేం భయపడతాం అనుకుంటున్నారా? " అంటూ ఆమె కూతురు కోపంగా, పెద్దగా అరిచింది.

"మిమ్మల్ని మేం భయపడమని చెప్పడం లేదు. కొద్దిగా సంస్కారం, మర్యాద, సభ్యత, ఇతరుల్ని గౌరవించడం నేర్చుకొమ్మని చెపుతున్నాం. జాగ్రత్తపడండి. ఎప్పుడో దెబ్బతింటారు వస్తాం మరి" అని చెప్పి ముగ్గురూ బయటకి వచ్చారు.

వాళ్ళకి చాలా ఆశ్చర్యంగా, భయంగా వుంది.

"సౌమ్య మేడం అత్త ఇంత రాక్షసా? ఇలాంటి రాక్షసి ముందు మేడంగారు ఎలా వుండగలుగుతున్నారు ఒక ఇంట్లో? అమ్మో... ఈ రాక్షసిని చూస్తేనే భయం కలుగుతోందే!" అంది విజయ.

"అత్తే ఒక పిశాచి అయితే కూతురు అంతకు మించిన పిశాచే! ఈ పిశాచుల మధ్య మేడం సుఖంగా, ఆనందంగా వుండగలుగుతున్నారా? ఇది జరిగే విషయం కాదు. మూడంటే మూడు నిముషాల్లోనే వాళ్ళు ఎలాంటి వాళ్ళో మనకి అర్థమైపోయింది. ఓ మైగాడ్... ఇలాంటి రాక్షసుల మధ్య జీవించడం అంటే మాటలు కాదు!" అంది ప్రత్యూష.

"ఇప్పుడు మనం అర్జంట్‌గా సౌమ్య మేడంని కలుసుకోవాలి"

"ఎలాగా? వాళ్ళ ఇల్లు మనకి తెలియదు కదా? "

"తెలుసుకోవటం పెద్ద కష్టంకాదు. ఈ ఇంటి ఇరుగుపొరుగు ఎవర్ని అడిగినా చెప్పొచ్చు వాళ్ళకి తెలియకుండా వుండదులే!" అని కరుణ పక్కింటికి వెళ్ళింది.

"ఏమండీ, ఎవరు కావాలీ? " అని ఇంట్లోనించి ఒక అమ్మాయి వీళ్ళని చూసి బయటకు వచ్చింది.

"సౌమ్యమేడంగారి పుట్టిల్లు అడ్రస్ కావాలండీ? "




"నాకు కరెక్ట్‌గా తెలియదు. మా అమ్మకి తెలుసు. పిలుస్తా వుండండి" అని ఆ అమ్మాయి లోపలకి వెళ్ళి వాళ్ళ అమ్మని పిలుచుకువచ్చింది.

ఆమె సౌమ్యవాళ్ళ ఇంటికి అక్కడ్నించి ఎలా వెళ్ళాలో వివరంగా చెప్పింది. అక్కడ్నించి అరకిలోమీటర్ దూరంలోనే సౌమ్యవాళ్ళ ఇల్లు వుంది.

ముగ్గురూ నడుచుకుంటూ బయలుదే రారు. వీళ్ళు వెళ్ళేటప్పటికి సౌమ్యమేడం ఇంటిముందు బయట చిన్న నవారు మంచం వేసుకుని పడుకునివుంది.

వీళ్ళని చూసి "రండి...రండి" అంటూ ఆహ్వానించింది.

"ఏం మేడం బావున్నారా? "

మేడంనించి చెదరని చిరునవ్వే సమాధానం

"మేం మీ ఇంటికి వెళ్ళి వస్తున్నాం మేడం. మీరు ఇక్కడ వున్నారని మాకు తెలియదు కదా? "

"అలాగా? "

"అక్కడ మీ అత్తయ్యగారికీ, మాకూ గొడవ జరిగింది మేడం"

"ఏం జరిగింది? పెద్దావిడ ఆమెతో మీకు ఎందుకమ్మాయి? ఆమె ఏదో మాట్లాడుతుంది? మీపాటికి మీరు తిరిగి రాకపోయారా? "

"మిమ్మల్ని కూడా తిట్టింది మేడం. మేం సహించలేకపోయాం. పళ్ళు రాలగొడదామనిపించింది"

"తప్పు... అలా మాట్లాడకూడదు. సార్ వున్నారా అప్పుడు? " సార్ అంటే సౌమ్య భర్త.

"లేరు మేడం"

"ఉండకపోవచ్చులే. బార్‌కి టైమై వుంటుంది కదా? "

"ఏమిటి మేడం? " ఆశ్చర్యంగా అడిగింది కరుణ.

"ఏముంది, బార్‌కి వెళ్ళి వుంటారంటున్నాను!"

"తాగుతారా మేడం, సారు? "

"ఎప్పుడో నైట్ అయితే పర్లేదు. ట్వంటీఫోర్‌అవర్స్ నిషాలో వుండాల్సిందే!"

"ఏమిటి మేడం... మీలాంటి వారికి అలాంటి భర్త? "

"అంతేనమ్మా! పుణ్యం కొద్దీ పురుషుడూ, దానం కొద్దీ బిడ్డలూ అనీ... మా సౌమ్య ఏనాడు ఏం పాపం చేసుకుందో అలాంటి వాడు భర్తగా దొరికాడు!" అన్నాడు అప్పుడే వచ్చి సౌమ్య తండ్రి.

"మీరు చాలా ఆస్తిపరులనీ, లక్షాధికారులనీ, కాలుకింద పెట్టాల్సిన పని వుండదనీ మా స్టూడెంట్స్ అనుకుంటారు మేడం!"

"ఒకప్పుడు ఆస్తి బాగానే వుండేదమ్మా! ఒక్కగానొక్క కొడుకని గారాబం చేశారు. పాడైపోయాడు!"

"పిల్లలకి ఎందుకు నాన్నా ఈ విషయాలూ? "

"కడుపులో బాధ కక్కితే పోతుందమ్మా! మనం ఎంత దాచిపెట్టాలని ప్రయత్నించినా కొన్ని విషయాలు దాగవు. నిప్పుని ఎంత కాలం దాచిపెట్టగలం? ఎంత లక్షాధికారులైనా ఐదు లక్షలు తీసుకుపోయి ఒక్క రోజులో రేసుల్లో పెట్టాడంటే ఆ కాపురం నిలుస్తుందా? అలాగ ఇంక ఎన్నిసార్లు పెట్టాడో ఆలోచించండి. వాడు ఎలాంటివాడైనా దివాలా తీయకుండా వుంటాడా? "

"అలాంటి భర్తతో ఎందుకు మేడం, డైవోర్స్ తీసుకోవచ్చు కదా? " కరుణ అడిగింది ధైర్యంగా.

"డైవోర్స్ అంటే మాటలు కాదమ్మా? తీసుకుని ఏంచేయాలి? రేపు మళ్ళీ వచ్చే వాడు బుద్ధిమంతుడని నమ్మకం ఏమిటి? వాడు ఇంకా పెద్ద తాగుబోతుకావచ్చు. ఇవ్వాళ తాగుడు అనేది ఒక కల్చర్‌గా, ఫ్యాషన్‌గా డెవలప్ అవుతోంది. మా చిన్నతనంలో ఎవడో ఒకడు తాగుబోతు వుంటే

వాడ్ని గురించి విచిత్రంగా చెప్పుకునే వాళ్ళు ఇవ్వాళ సొసైటీలో సగంమంది తాగేవాళ్ళే! సౌమ్యకి ఇద్దరు చెల్లెళ్ళు వున్నారు. అక్క ఇలా డైవోర్స్ తీసుకుం దంటే, చెల్లెళ్లకి వచ్చే సంబంధాలవాళ్ళు సంశయిస్తారు కదా!"

సౌమ్య చీర చెరుగుతో కన్నీళ్ళు తుడుచు కుంది.

"వాళ్ల నాన్న కొడుక్కి పెత్తనం అప్పగిం చాడూ, ఏడాది తిరిగేసరికి కొడుకు ఆస్తి అంతట్నీ క్షవరం చేసి పెట్టాడు! ఎంత డబ్బో తగలేశాడమ్మా!" అన్నాడు ఆయన విచారంగా.

"మా కాలేజీలో అందరూ మేడమ్ అదృ ష్టాన్ని గుర్చి చెప్పుకునేవాళ్ళేనండీ! కోరికోరి వెంటపడి చేసుకున్నాడని చెప్పుకుంటారు!"

"ఎందుకూ కోరికోరి చేసుకోవటం, కొరివి పెట్టడానికా? దౌర్భాగ్యుడు!"

"మీరు ఇక్కడ వున్నారు ఏమిటి మేడం? శూర్పణఖ గొడవపెట్టుకుని పంపించిందా, మీరే అలిగి వచ్చారా? "

"మా గొడవలు మీకు ఎందుకులే కరుణా! మీ మనసులు పాడైపోతాయి. మేం ఎలాగూ బాధపడుతున్నాం అనుకో! మళ్ళీ ఎందుకు మీరు మా గురించి బాధప డటం. కాలేజీ విశేషాలు ఏమిటీ? క్లాసులు బాగా జరుగుతున్నాయా? స్టాఫ్ అందరూ వస్తున్నారా? "

"బాగానే జరుగుతున్నాయి మేడం. ఫస్ట్ ఇయర్ మార్క్స్, మెమోస్ వచ్చాయి. కరుణ కాలేజీ ఫస్ట్ వచ్చింది మేడం"

"అలాగా, కంగ్రాచ్యులేషన్స్ కరుణా! మరి ఇంతసేపట్నించీ చెప్పలేదేమిటి? ఫస్ట్ కొట్టే శావన్నమాట" సంతోషంగా అంటూ లోప లికి వెళ్ళి మైసూర్ పాక్ తెచ్చి కరుణ నోట్లో పెట్టింది.

మిగతా వాళ్ళకి సౌమ్య అమ్మ ప్లేట్స్‌లో తీసుకునివచ్చి పెట్టింది.

"నువ్వు జాగ్రత్తగా చదవాలి కరుణా. నువ్వు గట్టిగా ట్రైచేస్తే యూనివర్సిటీ ఫస్ట్ వస్తుంది" అంది సౌమ్య.

"మీరు కాలేజీకి ఎప్పట్నించి వస్తారు మేడం? "

"రేపట్నించి వస్తానమ్మా. ఇంటిదగ్గర వుంటే క్షోభ ఇంకా పెరుగుతుందికానీ తగ్గ డంలేదు" అంది సౌమ్య.

కొద్దిసేపు మాట్లాడి "వస్తాం" అని చెప్పి, ఫ్రెండ్స్ ముగ్గురూ హాస్టల్‌కి వచ్చారు.

★ ★ ★

ఓ సాయంత్రం కరుణకోసం గోపాల్ కాలేజీకి వచ్చాడు.

రెండుమూడు మీటింగుల్లో గోపాల్, కరుణ కలుసుకున్నారు. విద్యార్థులమీద జరిగిన సెమినార్‌లో గోపాల్ అధ్యక్షత వహిస్తే, ప్రధాన వక్తగా కరుణ విద్యార్థుల సమస్యలమీద మాట్లాడింది.

ఇద్దరూ దూరంగా వెళ్ళి ఒక చెట్టుకింద కూర్చున్నారు.

"మీతో ఒక విషయం మాట్లాడాలనుకుం టున్నానండీ" గోపాల్ అన్నాడు.

"మాట్లాడండి"

"ఎలా మాట్లాడాలో తెలియడంలేదండీ"

"నోటితో మాట్లాడండి"

"భలే వాళ్ళండి మీరూ..." నవ్వాడు గోపాల్.

"లేకపోతే ఏంటండీ? ఎన్నిసార్లు మనం మాట్లాడుకోలేదూ! కొన్ని సందర్భాల్లో గంటల తరబడి కూడా మాట్లాడుకున్నాం కదా! ఎలా మాట్లాడాలో తెలియకపోవటం ఏమిటండీ పసిపిల్లాడి మాదిరిగా!"

కొద్దిసేపు ఆగి గోపాల్ అన్నాడు. "నామీద మీ అభిప్రాయం ఏమిటండీ? "

"ప్రస్తుతానికి సదభిప్రాయమే వుంది. నాకు ఎవరిమీదైనా దురభిప్రాయం వుంటే వాళ్ళతో నేను అసలు మాట్లాడను"

"నేనూ... నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నా నండీ. మీకు అభ్యంతరం లేకపోతే పెళ్ళిచే




సుకుంటాను"

"ఎప్పుడూ?"

"మీరు ఎప్పుడు చేసుకుందామంటే అప్పుడే?"

"అయితే రేపే చేసుకుందాం. ఆలస్యం ఎందుకూ?" అంది కరుణ.

గోపాల్ అర్థంగాక అయోమయంగా చూశాడు.

"అలా చూస్తారేమిటండీ? పెళ్ళిచేసుకుంటాను అంటున్నారుగా, రేపే చేసుకుందాం"

"ఇంత తొందరగానా?"

"నీళ్లు నములుతారెందుకు? మరి ఎప్పుడు చేసుకుందాం?"

"ముందు ఏర్పాట్లు చేసుకోవాలికదా! మా పెద్దవాళ్ళకీ, మీ పెద్దవాళ్ళకీ చెప్పాలి. వాళ్ళు అంగీకరిస్తే సరే, ఒకవేళ అంగీకరించకపోతే ఏంచేయాలో ఆలోచించాలి"

"అయితే ఎంతకాలం పడుతుంది?"

"నెలా రెండు నెలలు పట్టవచ్చు మనం అనుకున్న తతంగం మొత్తం పూర్తికావడానికి"

"మీరు ఇప్పుడు ఏంచేస్తున్నారు?"

"మీ ఎదురుగా కూర్చున్నాను"

"ఏం జోకేశారండీ! ప్రస్తుతం మీ ప్రొఫెషన్ ఏమిటీ అని?"

"చదువు... పీజీఫైనల్ సెమిస్టర్"

"ఎంతకాలంలో అయిపోతుంది?"

"ఇంక నాలుగు నెలల్లో అవుతుంది"

కరుణ ఈ ప్రశ్నల పరంపరని ఎందుకు అడుగుతోందో గోపాల్‌కి అర్థంకాలేదు.

"నెలరోజుల్లో చేసుకుంటాం మ్యారేజీ. తరువాత ఏంచేద్దాం?"

"చెప్పండి. మీరు ఏంచేద్దాం అంటే అదే చేద్దాం" అన్నాడు గోపాల్

"చేయటంకాదండీ. ఫ్యామ్లీ మెయింటెనెన్స్ ఎలా చేద్దాం అనీ..."

"అంటే డబ్బా?"

"అదేకదా! డబ్బు లేకపోతే ఎదురుగా వున్న ఆ టీ స్టాల్ వాడు కూడా కనీసం చిన్న చుక్క టీ పోయడు. డబ్బు లేకపోతే ఏదీ జరగదని తెల్సుకదా? డబ్బు ఎలా సంపాదిద్దాం అనీ"

"అదే నాకు అర్థం కావటంలేదండీ"

"లేకపోతే ఒకపని చేద్దామా?" కరుణకి ఒక ఆలోచన వచ్చింది.

"ఏమిటీ?" ఉత్సాహంగా అడిగాడు గోపాల్.

"చెరొక గిన్నె తీసుకుని వీధుల వెంట అడుక్కుతిందామా?"

నీరసపడిపోయాడు. "అదేమిటండీ అలా అంటున్నారు?"

నెమ్మదిగా అంది కరుణ "గోపాల్ గారూ... మీమీద నాకు సదభిప్రాయమే వుంది. మిమ్మల్ని చేసుకోవడానికి కూడా నాకు ఎలాంటి అభ్యంతరంలేదు. మీ గురించి నాకు పూర్తిగా తెలియకపోయినా... గంటసేపటిలో ముగిసే పెళ్ళి చూపుల్లో తెల్సుకోవటంకంటే మీ గురించి ఎక్కువే తెలుసు"

గోపాల్ నోరు తెరిచి కరుణవైపు ఆరాధనా పూర్వకంగా చూస్తూ వింటున్నాడు.

"మీ కులం నాకు అవసరంలేదు. మీ కులం ఏదైనా కావచ్చుగాక! అలాగే మీ ఆస్తిపాస్తులతో కూడా నాకు పనిలేదు. మీకు ఆస్తి వుండవచ్చూ, లేకపోవచ్చూ! కానీ ఆర్థిక స్వాతంత్ర్యం వుండాలి. అది మీకూ, నాకూ కూడా. ఇద్దరికీ వుండాలి"

"అంటే ఉద్యోగం వచ్చేవరకూ ఎదురు చూపులు తప్పవన్నమాట"

"నాకు చాలా ఆశలు వున్నాయి గోపాల్ గారూ... నామీద మీకు ప్రేమ వుండి నన్ను పెళ్ళిచేసుకోవాలని మీరు కోరుకుంటే సుదీర్ఘకాలం నిరీక్షించాల్సి వుంటుంది. ఉన్నత చదువులు చదువుకోవాలని నా కోరిక. సైంటిస్ట్‌గా స్థిరపడదామని నా ఆకాంక్ష. సైంటిస్ట్‌గా సెటిల్ అయ్యేవరకూ ప్రేమలూ, దోమలూ, పెళ్ళిళ్ళు గిళ్ళిళ్ళూ



ఇలాంటివాటి గురించి ఆలోచించదలుచుకో లేదు"

"కరుణగారూ..."

"అవును గోపాల్! ఎప్పుడైనా ఎవర్నో ఒకర్ని పెళ్ళిచేసుకోవాలి కాబట్టి, ఆ ఒకరు మీరైతే బాగుంటుందనుకుంటున్నాను తప్ప మీమీద నాకు ప్రత్యేకంగా ప్రేమలాంటి భావం ఏమీలేదు. మీరు మంచిమనిషీ, మంచి భావాలు కలిగిన వాళ్ళూ అని మాత్రం అభిమానం వుంది. నా మీద మీకు ప్రేమ వుందంటున్నారు కాబట్టి నన్ను చేసు కోవాలంటే మీరు వృద్ధులు అయ్యేవరకూ కూడా ఆగాల్సిరావచ్చు"

"అంతే అంటారా?"

"ముమ్మాటికీ..."

"ఒకవేళ ఈలోపు నాకంటే మంచివ్యక్తీ, బాగా ఆస్తిపాస్తులు వున్నవాడూ, అంద గాడూ మీకు తారసపడి అతన్ని మీరు ప్రేమిస్తే... వూరికే అంటున్నాను. అతన్ని మీరు ప్రేమిస్తే?"

"పెళ్ళి చేసుకుంటాను"

"కరుణగారూ... అప్పటివరకూ మీకోసం నిరీక్షించిన నా నిరీక్షణకి ఫలితం ఏమీ వుండదన్నమాట? అప్పుడు నేను దేవదా సునై పోవాలన్నమాట"

"దేవదాసులందరూ ప్రేమదాసులే కదా"

"మీరు చాలా అన్యాయంగా, అక్రమంగా మాట్లాడుతున్నారండీ"

"నేను కాదు, మీరు మాట్లాడుతున్నారు. ఆస్తిపాస్తులుంటే వాడ్ని నేను ప్రేమిస్తానని ఎలా అనుకుంటున్నారు? లేకపోతే ఎర్రగా బుర్రగా, లావుగా ఎత్తుగా వుండేవాడు నా ప్రేమకు పాత్రుడవుతాడా? అన్యాయంగా మాట్లాడేది మీరూ! ఆస్తిపాస్తులమీద నాకు దృష్టిలేదని మీకు ఎప్పుడో చెప్పాను. అంద గాడు అయితే వాడ్ని నేను ప్రేమిస్తానన్న మాట! ఈ స్టేట్మెంట్‌తో మీరు నన్ను చాలా అవమానించినట్లే! ఈ ఒక్కమాటతో మీ ప్రేమని నేను రిజెక్ట్ చేయవచ్చు. అందమే మిటీ? అంతఃసౌందర్యానికి తప్ప బాహ్యసౌం దర్యానికి నేను ఎప్పుడూ విలువ ఇవ్వను. సంస్కారవంతమైన అంతఃసౌందర్యం కలిగిన వాళ్ళే నాకు అద్భుతమైన అందగాళ్ళుగా కనిపి స్తారు"

"మీ మాటల ద్వారా మీ మీద నా ప్రేమ రెట్టింపవుతోంది కరుణగారూ! మీ ప్రేమ పొందడానికీ, మీతో కలిసి జీవించడానికీ నేను ఎంతకాలమైనా నిరీక్షిస్తాను. జీవితాంతం నిరీ క్షించాల్సి వచ్చినా ఆనందమే తప్ప నాకు బాధ లేదు. మధ్యలో ఏమైనా అవాంతరాలు వస్తా యేమోననే నా సందేహం"

"రావచ్చు అవాంతరాలు రావు అని ఎలా అనుకుంటున్నారు? అనేకమైన అడ్డంకులూ, అవాంతరాలూ తప్పకుండా వస్తాయనే భావించాలి. వాటినన్నిటినీ అధిగమించి నిల దొక్కుకున్నప్పుడే ప్రేమలు ఫలిస్తాయి. నాకు మాత్రం ప్రస్తుతం మీ మీద ప్రేమలాంటి భావం ఏమీ లేదు. భవిష్యత్‌ని ఎవరూ చెప్ప లేరు. మీరు నాకోసం పెళ్ళిచేసుకోకుండా వుంటానంటే నాకు అభ్యంతరంలేదు. అయితే భవిష్యత్ ఎన్ని మలుపులు తిరగవచ్చో సినిమా కవి ఒకరు అన్నట్లు... రేపు మనది కాదూ కాదూ, నేడే నిజం అనీ..."

"చూద్దాం... రేపుని మనం ఎందుకు నిజం చేసుకోకూడదు? రేపుని నిజం చేద్దాం. పీజీ అయిన వెంటనే నేను లా కానీ, పీహెచ్‌డీ కానీ చేస్తాను. అంటే నాకూ చదువు ఇంకొన్ని సంవత్సరాలు వున్నట్లే కదా! నేను మీ కోసం జీవితాంతం నిరీక్షిస్తాను. నా మీద మీకు ప్రేమ కలిగితే నన్ను పెళ్ళి చేసుకోండి. ప్రేమ లేకుండా కేవలం యాంత్రికంగా, ఎవరో ఒకర్ని చేసుకోవాలి కాబట్టి చేసుకో వటం అయితే మనకి పెళ్ళివద్దు మీరు నన్ను చేసుకోవద్దు! మీ ప్రేమకోసం ఎదురు చూస్తూ నిరీక్షిస్తాను. వుంటాను మరి" అని లేచాడు గోపాల్.

"విష్ యూ బెస్టాఫ్ లక్" అంది కరుణ.







# చతురకథలు

## సరదాలు

వాసుదేవరావు ఫ్యాక్టరీ ఉద్యోగి. అతని బెస్ట్ ఫ్రెండ్ సత్యమూర్తి గవర్నమెంటు ఉద్యోగి. ఇద్దరూ చిన్ననాటి స్నేహితులు. ఉద్యోగాల్లో అంతరాలున్నా వాళ్ల మధ్య స్నేహానికి ఏమాత్రం అడ్డురాలేదు. వీలున్నప్పుడల్లా కల్సుకుంటూ ఉంటారు. సినిమాలు, షికార్లు అంటూ తిరుగుతారు. వాసుదేవరావుకి ఓ పదేళ్ల కొడుకు. పేరు హిరణ్యకుమార్. పేరులోనే బంగారం అనుకుంటూ మురిసిపోతుంటారు వాసుదేవరావు దంపతులు. వాడు మాత్రం హిరణ్యాక్షవ రాల్లా అదికావాలి, ఇది కావాలి అంటూ ఉంటాడు.




ఎప్పట్నుంచో సత్యమూర్తి చెప్తున్నాడు "నీ ఫామిలీని తీసుకొని ఇంటికిరారా" అంటూ ప్రైవేటు ఉద్యోగం, టైమింగ్స్ ఎక్కువ కావడంతో తీరుబడిలేక ఎప్పటికప్పుడు ఇదిగో అదిగో అంటూ గడిపేస్తున్నాడు. సత్యమూర్తి మాత్రం వీలున్నప్పుడల్లా కుటుంబంతో వాసుదేవరావింటికి వచ్చి వెళ్తూవుంటాడు.

"ఎప్పుడూ మేమేనా! ఈసారి చెల్లెమ్మని తీసుకొని రాకపోతే ఇహ అంతే" అంటూ తీర్మానం చేసి ఫర్మానా జారీ చేశాడు సత్యమూర్తి ఓసారి ఇంటికి వచ్చి వెళ్తున్నప్పుడు.

ఇక తప్పదన్నట్టుగా ఆదివారం శలవురోజున ఓవర్‌టైమ్ చెయ్యాలన్నా కాదని చెప్పి భార్యని, కొడుకుని వెంటబెట్టుకొని సత్యమూర్తి ఇంటికి వెళ్లాడు వాసుదేవరావు.

ఆప్యాయంగా స్నేహితుడి కుటుంబాన్ని ఆహ్వానించాడు సత్యమూర్తి.

ఆడవాళ్లిద్దరూ లోపలికి వెళ్లిపోయారు. మిత్రులిద్దరూ కబుర్లలో మునిగిపోయారు. హిరణ్యకుమార్ ఒంటరిగా మిగిలిపో

యాడు.

సత్యమూర్తి కూతురు ఆ రోజు ఉదయమే తాతగారింటికి వెళ్లింది. ఎవరూ తోడు లేక పోవడంతో ఏమీ తోచనట్టు ఓ మారు హాల్లో తిరిగి అన్నీ చూశాడు హిరణ్యా కుమార్.

వాసుదేవరావుతో మాట్లాడుతున్న సత్యమూర్తి దగ్గరకి వచ్చాడు.

"అంకుల్... అంకుల్ మీ ఇంటిలో ఫ్రిజ్ ఉందా" అనడిగాడు.

మాట్లాడుతున్న వాడల్లా ఆగి "ఉంది నాన్నా" అని వాసుదేవరావుతో మాటలు కంటిన్యూ చెయ్యబోయాడు సత్యమూర్తి.

ఆ వెంటనే మళ్లీ అడిగాడు హిరణ్యకుమార్ "అంకుల్... అంకుల్... అందులో ఫ్రూట్స్ పెడ్తారా? ... డ్రింక్సు పెడతారా?" అని.

"రెండూ పెడతాం బాబు" సమాధానం చెప్పి మళ్లీ మాటల్లో పడబోయాడు సత్యమూర్తి.

ఆ వెంటనే మరో ప్రశ్న సంధించాడు హిరణ్యకుమార్. "అంకుల్... అంకుల్... ఏం డ్రింక్స్ పెడతారు? మజానా? థంప్సప్నా?"

"మజానే" అని పాపం కుర్రాడికి డ్రింకు తాగాలని ఉందేమోనని లేచి ఫ్రిజ్‌లోంచి ఓ బాటిల్ తీసి ఓపెనర్‌తో మూత తీసిచ్చి మళ్లీ స్నేహితుడితో కబుర్లలో పడ్డాడు సత్యమూర్తి.

కాస్సేపటికి బాటిల్లో డ్రింకు తాగుతూ వచ్చాడు హిరణ్యకుమార్. "అంకుల్... అంకుల్ మీ టీ.వీ. కలరా? బ్లాక్ అండ్ వైటా?" అని అడిగాడు.

"కలరే నాన్నా... ఏం టీ.వీ. చూస్తావా" అంటూ టీ.వీ.ఆన్ చేసి రిమోట్ చేతికిచ్చాడు.

కాస్సేపు మొత్తం ఛానెల్స్ అన్నింటినీ తిప్పాడు. రిమోట్ ఆ పక్కన పడేసి హాల్లో షోకేసుల్లో ఉన్న బొమ్మలు తియ్యడం మొదలుపెట్టాడు. వాటితో కాస్సేపు ఆడి చెల్లాచెదురుగా పడేశాడు వాటిని. మళ్లీ టీ.వీ. ఆన్ చేసి సోఫాలో కూర్చున్నాడు. టీ.వీ. చూస్తూనే టీపాయ్ మీదున్న నెయిల్ కట్టర్ తీసుకొని గోళ్లు గిల్లుకున్నాడు. ఆపై ఏం చేయాలో తోచక నెయిల్ కట్టర్‌లో ఉన్న చిన్న చాకును తీసి సోఫా పై కవర్స్ లోంచి కన్నాలు పెట్టసాగాడు.

స్నేహితుడితో కబుర్లాడుతున్న సత్యమూర్తికి సడెన్‌గా వచ్చింది ఓ ఆలోచన. మాటి మాటికి 'అంకుల్... అంకుల్' అంటూ వచ్చే కుర్రాడు ఇంత సైలెంట్ అయిపోయాడేమిటా అని. మాటలాపి హాల్లోకి పరికించి చూశాడు. అల్మారుల్లోని బొమ్మలన్నీ కుప్పలుకుప్పలుగా పోసి ఉన్నాయి. సోఫాలో కూర్చుని కన్పించాడు హిరణ్యకుమార్ ఏదో చేస్తూ. లేచి వాడి దగ్గరికి వెళ్లాడు సత్యమూర్తి. సోఫాకవర్లు నిండా కన్నాలు ఉన్నాయి. కట్టలు తెగిన చెరువులా పొంగిన కోపాన్ని అణచుకుంటూ "బాబూ... ఏంటమ్మా యిది. మీ ఇంటి దగ్గర కూడా ఇలాగే చేస్తావా" అన్నాడు సత్యమూర్తి.

ఠక్కున సమాధానం చెప్పాడు హిరణ్యకుమార్. "బలే వారంకుల్... ఎవరైనా ఇంట్లో ఇలాంటి సరదాలు తీర్చుకుంటారా? ఇలా ఫ్రెండ్స్ ఇళ్లకు వచ్చినప్పుడుకానీ..."

"సరదాలా..." బిత్తరపోయాడు సత్యమూర్తి.

–సువర్చలా జ్యోతి

---

## జాతకం

జంట నగరాల్లో జోగారావ్ పంతులు అంటే ఎవరయినా చెబుతారు. అలాగని ఆయనేం రాజకీయనాయకుడుగానీ, కోట్ల టర్నోవర్ వున్న బిజినెస్ మాగ్నెట్‌గానీ కాదు.

జాతకాలు చెప్పడం అతని వృత్తి, ప్రవృత్తి. దానికితోడు ఆ చెప్పటంలో అవలంభించే విధానం కూడా విచిత్రంగా

వుంటుంది.

పుట్టిన తేదీలు, వేళలు గట్రా అడగడు. మొహం చూస్తాడు. ఇష్టమైన పువ్వు, నచ్చిన రంగు, అంకె, రోజు... యిలాంటివి అన్నీ ఆరాతీసి వచ్చినవారి సమస్యలకు సమాధానం చెబుతాడు.

ఎలా అయితే ఏంకానీ... అతని లౌక్యం వల్లనో, నిజంగానో, ఉపాసన శక్తివల్లనో గానీ జోగారావ్ చెప్పినవి నూటికి తొంభై నిజాలయి కూర్చున్నాయి.

జోగారావ్ బిజినెస్ ఇలా బిజీబిజీగా గడుస్తున్న తరుణంలో జోగారావ్ మనసులో ఓ చిలిపి వూహ పుట్టింది.

కాశం లభించింది. ఆ దెబ్బకి ప్రతి సినిమా అభినందనసభకి ఓ వక్త అయి కూర్చున్నాడు జోగారావ్.

అయితే ఈ అభినందన వుపన్యాసాలకి జోగారావ్ పాపులారిటీ పెరిగేమాట అటుంచి, జాతకాల గిరాకీ తగ్గుముఖం పట్టసాగింది.

జోగారావ్ కంగారుకి అంతూపంతూ లేకుండా పోయింది.

అభినందనసభల్లోనే జనం నాడి తెలుసుకుందామనుకున్నాడు.

ఓ అభినందనసభలో ముందుగా తను మాట్లాడేసి, గబగబా స్టేజీ దిగిపోయి వేషం



"జనం తన దగ్గరికొచ్చేమాట నిజమేగానీ, ఈ పాపులారిటీ సరిపోదు. రాజకీయనాయకులు, సినిమా స్టార్స్‌తో కలిసి ఫొటోలు తీయించుకుని, వారితో కలిసి వేదికలు ఎక్కి, వాళ్ళ గురించి తనూ, తన గురించి వాళ్ళు మాట్లాడితే మరింతగా తను నలుగురినోళ్ళల్లో నానుతాడు" అనుకున్నాడు.

అనుకున్నది తడవుగా ఆచరణలో పెట్టాడు. మొట్టమొదటిసారిగా అతనికి ఓ సినిమా అభినందనసభలో మాట్లాడే అవ

మార్చుకుని జనం మధ్యలోకి వెళ్ళి కూర్చున్నాడు.

కొంతసేపటి తర్వాత జోగారావ్ మారువేషం తాలూకు ఆశయం నెరవేరింది.

ముందుసీట్లోని ఎవరో ఇద్దరు కుర్రాళ్ళు నవ్వుతూ మాట్లాడుకుంటున్నారు.

"రెండున్నర గంటలపాటు సినిమా చూసినా కూడా ఈ జోగారావ్‌కి ఆ సినిమా

జాతకం తెలియలేదు. సూపర్‌హిట్ అవుద్దని బల్ల గుద్దినట్లు చెబుతున్నాడు. చూసిన సినిమా జాతకమే తెలియకపోతే ఇక మన జాతకాలు ఏంచెబుతాడురా? " అంటున్నాడో కుర్రాడు.

"అవున్రా! వీడింతకుముందు కూడా చాలా సినిమాలకు ఇలాగే సర్టిఫికెట్టిచ్చాడు. వాటిలో చాలా సినిమాలు వారం కూడా ఆడలేదు, గుర్తుందిగా..." అన్నాడు రెండోవాడు.

ఆరోజునుంచి జోగారావ్ సినిమా అభినందనసభల్లో మాట్లాడితే ఒట్టు!

—ప్రసాద్ తోట

---

## బట్టబయలు

గోదావరి జిల్లాలోని ఓ మండలం హెడ్‌క్వార్టర్స్‌లోని ప్రభుత్వహాస్పటల్ లోని డాక్టర్ రిటైరైపోతున్నాడు. అతని స్థానంలో కొత్త డాక్టర్‌ని అపాయింట్ చేశారు.

రిటైరయ్యే డాక్టర్ కొత్త డాక్టర్ తో ఇలా చెప్పాడు.



"ఇవాళ సాయంత్రం నిన్ను చుట్టుపక్కల గ్రామాల్లోని రోగుల ఇళ్లకు తీసుకువెడతాను. దారి, ఆ మనుషులు నీకు పరిచయమవుతారు."

అందుకు కొత్త డాక్టర్ ఒప్పుకున్నాడు.

ఇద్దరూ స్కూటర్ మీద ఓ గ్రామంలోని ఓ రైతు ఇంటికి వెళ్లారు. సీనియర్ డాక్టర్ ఆ రైతుతో వాతావరణం గురించి, ఆయన మనవల గురించి, గుళ్లో రిపేర్‌ల గురించి మాట్లాడాక అడిగాడు "ఇప్పుడెలా ఉంది మీకు? "అని.

"నిన్నటినుంచీ కడుపు నొప్పిగా ఉంది డాక్టర్" జవాబు చెప్పాడు.

"నువ్వు పనసతొనలు ఎక్కువగా తింటున్నావు. వాటిని తగ్గించి చూడు. రోగం తగ్గుతుంది.

బదులుగా ఆయన తల ఊపాడు.

బయటకి వచ్చాక జూనియర్ డాక్టర్ సీనియర్ డాక్టర్‌ని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు

పరీక్ష చేయకుండా అంత త్వరగా రోగాన్ని ఎలా రికగ్నైజ్ చేయగలిగాడని.

"వీళ్లని పరీక్షించాల్సిన పనిలేదు. నేను ఆయనతో మాట్లాడుతూ ఉండగా స్టెతస్కోప్ కింద పడిందిగదా! నిజానికి నేనే దాన్ని కింద పడేసి అందుకోడానికి వంగినప్పుడు కింద చుట్టూ చూశాను. ఓ మూల పనసగింజలు కనపడ్డాయి. ఆయనకి కడుపునొప్పి ఎందుకు వచ్చిందో ఇట్టే గ్రహించాను".

"బావుందే ట్రిక్కూ!"

"నువ్వు ఈసారి పేషెంట్ వద్ద ఈ ట్రిక్కు ప్రయోగించి చూడు" ప్రోత్సహించాడు సీనియర్ డాక్టర్.

తర్వాత ఇంకో ఇంటికి వెళ్లారిద్దరు డాక్టర్లూ. జూనియర్ డాక్టర్ని పరిచయం చేశాక ఆయన ఆ ఆడ పేషెంట్‌తో వాతావరణం, ఆవిడ కొడుకులు, గుళ్లో రిపేర్ల గురించీ మాట్లాడాడు.

"ఇప్పుడెలా. ఉంది ఒంట్లో? " అడిగాడు జూనియర్ డాక్టర్ ఆవిడని.

"ఎందుకో ఒకటే నీరసం. ఇదివరకటిలా చురుగ్గా లేను"

వెంటనే జూనియర్ డాక్టర్ స్టెతస్కోప్‌ని కింద పడేసి దాన్ని అందుకుని చెప్పాడు.

"మీరు గుడి రిపేర్‌పనిని మీమీద అధికంగా వేసుకున్నారు కనుక ఈ బాధలు. ఆ పూజారికి కూడా ఖచ్చితంగా ఇదే రోగం వచ్చి ఉంటుంది. కొంతకాలం ఆయనకు దూరంగా ఉండండి"

"నిజమేనండీ" ఒప్పుకుందామె.

ఇద్దరు డాక్టర్లూ బయటకి వచ్చాక అడిగాడు సీనియర్ జూనియర్‌ని.

"నువ్వు ఎలా డయాగ్నైజ్ చేయగలిగావు? "

"మీలాగే నేను స్టెతస్కోప్‌ని కింద పడేసి దాన్ని తీసుకోవడానికి వంగినపుడు చుట్టూ చూశాను. మంచం కింద దాక్కున్న పూజారి కనిపించాడు." చెప్పాడు జూనియర్ డాక్టర్.

—పద్మజాదేవి

---

## తొందరపాటు

అద్దింటి కోసం తిరుగుతున్న కిట్టూకి 'టు లెట్' బోర్డ్ కనిపించింది.

"ఎవరు కావాలండీ? " కిట్టూ నొక్కిన కాలింగ్‌బెల్‌కు స్పందించి ఓ అందాల భరిణె బయటకు వచ్చి అడిగింది.

కిట్టూకి ఆ అమ్మాయి అందాన్ని చూసి నోటి మాట పడిపోయింది.

ఓ పన్నొమ్మిది సెకన్లు అయ్యాక నోరు విప్పాడు.

"ఇక్కడ అద్దెకు రూమ్ ఉందాండీ? "

"ఆ వుంది...మూడునెల్ల అద్దె అడ్వాన్స్ ఇవ్వాలి" టకటకా చెప్పేసిందామ్మాయి.

"రూమ్ చూడొచ్చాండీ? " అడిగాడు కిట్టూ.

నిజానికి రూం ఎంత అధ్వాన్నంగా ఉన్నా తీసేసుకోవాలని డిసైడ్ చేసేసుకున్నాడు కిట్టూ.

ఆ అమ్మాయి రూం చూపిస్తుండగా మాటల సందర్భంలో తన పేరు మాయ అని చెప్పింది.

"ఓకే మాయగారూ!సాయంత్రంలోగా అద్దె ప్లస్ అడ్వాన్స్ తీసుకొని వచ్చేస్తాను." రూం చూడ్డం అయ్యాక అన్నాడు కిట్టూ.

వెళ్తూ "కాస్త మంచినీళ్లు ఇస్తారాండీ? " అని మాయను అడిగాడు కిట్టూ.,

కిట్టూని ఇంట్లోకి పిలిచి నీళ్లు ఇవ్వడమే కాకుండా ఆపిల్ జ్యూస్ కూడా ఇచ్చింది మాయ.

అద్దె వెయ్యి కాదు రెండు వేలు అయినాసరే అద్దెకు దిగాలని నిర్ణయించుకుని మాయ దగ్గర సెలవు తీసుకుని ఊహల్లో తేలుతూ వెళ్లిపోయాడు కిట్టూ.

తన మెళ్లో గొలుసు, చేతికున్న ఉంగరం కాస్తో కూస్తో పరిచయం ఉన్న తన ఫ్రెండ్స్ దగ్గర తలా ఓ రెండు వందల రూపాయలు అప్పు చేసి సాయంత్రానికల్లా అద్దె ప్లస్ అడ్వాన్స్ డబ్బుతో మాయ ఇంటిముందు ప్రత్యక్ష

మయ్యాడు కిట్టూ.

"ఎంత మంది ఉంటారూ? " అడిగాడు కిట్టూని మాయ డాడీ.

"నేను ఒక్కణ్ణే ఉంటాను సార్! వేరే ఎవర్నీ పెట్టుకోదల్చుకోలేదు. చదువుకోవడానికి ఇబ్బంది అవుతుంది" అన్నాడు కిట్టూ.

నిజానికి వేరే ఎవరైనా ఉంటే మాయ తనకు దక్కకుండా పోతుందేమోనని కిట్టూకి భయం. మరుసటి రోజు లగేజీతో దిగాడు కిట్టూ. ఆరోజు సాయంత్రం కిట్టూ రూంలో ఉండగా మాయ వచ్చి అరగంట పిచ్చాపాటీ



మాట్లాడి వెళ్లిపోయింది.

తన అదృష్టానికి తానే మురిసిపోయాడు కిట్టూ. రూంలోకి చేరిన మూడోరోజు పొద్దున్నే మాయ దర్శనం కోసం చూశాడు కిట్టూ.

మాయ తలంటి స్నానం చేసి అపరంజి బొమ్మలా తయారయివుంది. గుమ్మం దగ్గరే నుంచుని కిట్టూని చూసి అదోలా నవ్వి ఇంట్లోకెళ్లింది.

కిట్టూ ఆనందం హిమాలయ పర్వతం ఎక్కేసింది. ఇంతలో మాయ డాడీ ఓ ఆటో తీసుకొచ్చాడు. మాయ సూట్‌కేసు, ఓ ఎయిర్ బ్యాగ్ తీసుకుని మమ్మీ, డాడీలకి చెప్పి ఆటో ఎక్కి తుర్రు మంది.

మాయ ఎక్కడికెళ్లిందో కిట్టూకి అర్థంకాలేదు. ఆ సంగతే అడిగాడు మాయ మమ్మీని.

"మా మాయ బెంగుళూరు లో మెడిసిన్ చదువుతోంది. ఆర్నెల్ల కోసారి వచ్చి మూడు రోజులుండి వెళ్లి పోతుంది. ఏం చదువులో ఏమో... ఉన్న ఒక్క కూతురూ కళ్ల ముందు లేకుండా పోతోంది" మాయ తల్లి కంట తడి పెట్టుకుంది.

"మీరెందుకు ఏడవడం. ఆ ఏడుపేదో నేను ఏడ్వాలిగానీ" అని మనసులో తిట్టుకుని కళ్లు బైర్లు కమ్ముతుంటే తిన్నగా నడుచుకుంటూ వెళ్లి రూంలో కూలబడ్డాడు కిట్టూ.

మరుసటి నెలలో మూడోతేదీన కిట్టు జుట్టు అప్పులవాళ్ల చేతుల్లో ఉంది.

-కార్టూనిస్టు గాంధీ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78